

శివతాండవము

చిత్రలేఖకుడు :
శ్రీ గుఱ్ఱం మల్లయ్యగారు.



౧౬. సంపుటం. ప్రమాది, ఆశ్వయుజమాసము (1939) అక్టోబరు సంఖ్య. ౧౦

# ఆ నం ద ము

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

౧

వద్దని కద్దటంచు నొడువంగల హక్కది నాకు లేశమున్
వద్దు. త్వదిచ్ఛకున్ జయము పల్కెదు. నేఁ డిదె నీదు తేజులో
నద్దియె యొక్కెడఁగాఁ కిరణ మెక్కువగాఁ బడియుండెనేని నా
యద్దము ఘట్టునం బగిలి యంకెల కందకపోయెదుం బ్రభూ!

౨

నీ కిరణం బొకండు గొని నేఁడు నిగూఢములౌ నసూర్యముల్
లోకము లెల్లఁ గాంచఁ గడు లుబ్ధుఁడనై యటు వోవ నేడ వా
లోకము లేటి వార్త యిది? లోపల బైటను మధ్యలన్ మహో
లోకమదైకవార్ధియె వెలుంగుఁ-గలం గనినట్టి చందమై.

౩

ఓ మధుచక్రమా! యెచటి యున్న మి చెక్కడి పాకభాండరం
బేమి మహోగ్రవేగ మిది యేటి పసారము? నీదు తేనియన్
గీముసఁ బాల్చు బంగరువు గిన్నెలు దొన్నెలు పొర్లి పోవునా
యేమి? యకాల వర్షముగదే యిది! యిమ్మెశ నేను నిల్తునే?

౪

ఈ తేనె చుక్క యొక్కటి
మూతికి రాచికొను మోసముద్రేఁడ! యేత
న్మాత్రములోపల నీ వా
పాతాళముదాఁకఁ దియ్యఁబడఁగలవు సుమీ!

౫

రేయీ! నీవయిఁ బ్రేమ నా కథిక మీ రిక్కల్ ప్రయోగించు వా
చోయుక్తుల్ మది నే నెఱుంగుదు మహీశోకంబు మీ రెంతయుం
బాయంజేయఁగఁ గల్గువా రనెడి యీ వాదంబు భావింపఁగాఁ
బ్రేమోవాదము, మీ కుపాయమును నే వ్రాక్రుత్తు రం డిద్దెసన్.



# కృష్ణరాయలు: సకలకథాసార సంగ్రహము

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

ఆముక్తమాల్యదలో రాయలవారు సంస్కృతమునఁ గొన్ని గ్రంథముల రచించినట్లు చెప్పుకొనిరిగదా! అవి మదాలసాచరిత్రము, జ్ఞానచింతామణి, సకలకథాసారసంగ్రహము, సత్యావధూప్రీణనము, రసమంజరి- ఇత్యాదులు. ప్రపంచదర్పణమను సంస్కృత గ్రంథమున రసమంజరి, సత్యావధూపరిణయము, అను గ్రంథములలోనివిగాఁ గొన్ని శ్లోకము లుదాహృతము లయియున్నవి. కాని యందా గ్రంథములు అల్లసాని పెద్దనార్యరచితములుగాఁ బేర్కొనఁబడినవి. ఆ ప్రపంచదర్పణము ఓఢ్రదేశ ప్రాంతమున దొరకినది. అది విలువగల గ్రంథమే కాని, యందు గ్రంథకర్తలపేళ్లు కొన్ని తారుమారుగా నున్నట్లున్నవి. అది సూక్తిముక్తావళ్యాదులవంటి సంకలన గ్రంథము —సంకలన గ్రంథములకుఁ బెక్కింటి కీ దోషమున్నది. ఆముక్తమాల్యదాపద్యమున పేర్కొనఁబడనిది 'జాంబవతీ కళ్యాణ'మని నాటకమొకటి శ్రీకృష్ణదేవరాయరచితము, తంజావూరి సరస్వతీ పుస్తక భాండాగారమున నున్నది. అందు నాటక ప్రస్తావన కొంత పోయినది. శ్రీకృష్ణరాయలు గ్రంథకర్తగా, ఉన్న ప్రస్తావన భాగములోను, తుదిగద్యములోను ఉన్నది. కడపట నొక శ్లోకము నున్నది. అందు "శేషక్ష్మాధరనాయకస్య కృపయా సప్తార్ణవీమధ్యగాం రక్షన్ గామిహ కృష్ణరాయనృపతి ర్జీయాత్సహస్రం సమాః" అని కలదు.

ఇప్పుడు క్రొత్తది, ఓరియంటల్ లైబ్రరీలో, సంస్కృతగ్రంథ మొకటి శ్రీకృష్ణదేవరాయ రచితము గుర్తింపఁబడినది. అందు గ్రంథపీఠికాభాగము మాత్రమే ఉన్నది. గ్రంథముపేరు కవిపేరు స్పష్టముగా లేవు. కాని యది కృష్ణదేవరాయరచితమే యగుటను అందలి శ్లోకములు వ్యక్తపఱచుచున్నవి. సందర్భమునుబట్టి చూడఁగా దాని పేరు 'సకలకథాసారసంగ్రహ' మనఁదగి యున్నది. ఆముక్తమాల్యదలో 'శ్రుతిపురాణోపసంహిత లేర్చికూర్చితి సకలకథాసార సంగ్రహంబు' అని కలదు. ఇప్పుడు దొరకిన గ్రంథము శ్రుతిపురాణాదుల సారోద్ధార మనఁదగిన దేయగుట క్రిందిశ్లోకములు వెల్లడించుచున్నవి. కాన దీనిపేరు సకలకథాసారసంగ్రహమే యనఁదగు నంటిని. మఱియు, నీ గ్రంథము తన గురువర్యులగు వ్యాసతీర్థులవారి యానతిచొప్పున సంగృహీతమయినట్లు రాయలవారు చెప్పుకొనిరి. మాధ్వుల గ్రంథములలో శ్రీకృష్ణరాయలవారికి వ్యాసరాయలవారు గురువులని కల

టు. అంతేకాని, ఇతర చారిత్రిక గ్రంథము
లోఁగాని, కృష్ణదేవరాయలవారి గ్రంథ
ములలోఁగాని యీ విషయము కానరాదు.
రాయలవారి గ్రంథములోనే యిప్పుడది కాన
చ్చుట విశేషవిషయము. అయ్యలురాజు
రామభద్రకవి సకలకథాసారసంగ్రహమని
కృష్ణరాయల కంకితముగా తత్ప్రేరణమున
ొకగొప్ప యాంధ్రప్రబంధమును విష్ణుపా
మ్య ప్రతిపాదకమును, రచింపఁబూనెను
ాని, అది పూర్తిచేయకమునుపే కృష్ణరా
యలో రామభద్రకవియో మరణించుటచేఁ
ాఁబోలును - అసమగ్రముగానే యుండి
ోయెను. అది యిప్పుడు ప్రాచ్యలిఖిత
పుస్తకశాలలో నున్నది. అది ఇంక
ముద్రితమే. శ్రీవ్యాసతీర్థులవారి ప్రేరణ
మున శ్రీకృష్ణరాయలవారు రచించిన
యీ క్రొత్త గ్రంథము ఆముక్తమాల్య
లో పేర్కొనఁబడిన సకలకథాసార
సంగ్రహమగుట, రామభద్రుని సకలకథా
సారసంగ్రహము దాని ననుసరించి తెలుఁ
గున రచించిన గ్రంథమగుట ఊహింపఁదగిన
విషయములు. పుస్తకము దొరకలేదు గాని
సంస్కృతమున రాయలవారు రచించిన
సత్యావధూప్రీణనము తెలుఁగున నంది
తిమ్మన రచించిన పారిజాతాపహరణము
ట్టి రచనాసంబంధము కలవే.

?. స బుక్కమాంబాం పరిణీయ తస్యా
మౌదార్యగాంభీర్య వివేకశౌర్యైః
దాక్షిణ్యకారుణ్యనయైశ్చ యుక్తం
లేభే తనూజం నరసక్షితీశమ్.

సబాల్య ఏ వావని మర్ణవాంతా
మత్యర్థ(?) శౌర్యేణ నిరంకుశేన,
మాంధాతృముఖ్యాన్ మహితాన్ మహీపాన్
యశోవిశేషై రఖిలా నశైషీత్.

బాహోర్బలే నార్జిత విత్తజాతైః
కృతార్థయిత్వాఖిల వర్థిసార్థమ్,
కాశీప్రయాగాది మహాగ్రతీర్థే
మహాంతి దానాని మహాంశ్చకార.

కులేన శీలేన గుణేన భక్త్యా
ప్రేమ్ణానుకూల్యేన చ సంయుతే ద్వే;
నాగాంబికాయాం నరసక్షితీశః
ప్రాసూత మాం స్వర్గకృత్యై స్సైరివర్గః.

సోఽహం సుతం శ్లాఘ్యగుణాన్వితాయాం
తిమ్మాంబికాయా మిహ తిమ్మభూపమ్,
ఉత్పాద్య నామాస్య సహోద్భవాత్తై
స్సమర్పయం వేంకటశైలభర్త్రే).

ఏకం చ చేత స్స్వనా స్వతృప్తిః
వాచాపి ప్రాణాం కలయే కథం వా,
శ్రీ వేంకటాధీశితు రిత్యుదారం
చిత్తే విచారం కలయ న్నవాత్సమ్.

ఉత్సాహం మమ వీక్ష్య మద్గురు రథ
శ్రీవ్యాసతీర్థో మునిః
పర్యాలోచ్య పురాణశాస్త్ర వివిధా
మ్నాయేతిహాసాదికాన్,
లబ్ధ్వా తత్ర కథాసారేః పనుపతే
స్సామ్యం సిరూ పాస్య(రపాస్య?)నికం
విష్ణుం కీర్తయ సర్వథే త్యుపదిశన్
మహ్యం ముదా దత్తవాన్.



(శ్రీ గాంధీమహాత్ముని ౭౧-వ జన్మదినోత్సవములు ఈ వారమంతయు అఖిల భారతదేశములోను అత్యంతవైభవముతో జరుపబడుచున్నవి)

# సుధాజ్వాల

కీ. కొంపెల్ల జనార్దనరావు] [శ్రీ సోమశేఖర శర్మకు

(వ్రాయుము వ్రాయు మంచు మధుర ప్రణయామృత వాహినీ తరం
గాంచితమై త్వదీయగళగారిత నిస్వనరాజి నాదు క
ర్ణాయతనమ్ము సోఁకుటయు ఆదిగ, చక్కిలిగింతవడ్డ న
వ్వైవ్వ మెదఁ గల్గు భక్తి విరియంబడు ముంగిట పాటపాట లై.)

వలచిన స్వప్నమెల్ల వలపంబడురీతిని తారసిల్లెనం
చలయని ధన్యతా నియతమై విలసిల్లు ప్రసన్నతాచ్ఛటల్
వెలుఁగులు చిమ్ము నాహృదయవీథిని శిష్టలవ మ్మధీరతన్
తోలఁచితి వీవ; ఆశయతతుల్ ఫలియించెడి నాకు తోరమై.

అనిన నీదు నెయ్యపుపయస్సులు దిద్దిన తీయకైత లీ
లోనని భాగ్యగర్భముల లుప్తములై చనఁజూచు: బిట్టు ల
జ్జా నిభృతమ్ము నా యెడఁద సాఁచెడి కోర్కులు మ్రోఁత వెట్టినన్
మానముచాయనే మధురిమల్ కురియించెడి నీకు కాన్కగా.

లేఁజిలుపోఁడుముల్ చవుకళించు మదీయ కిశోరవాణి యెం
దేఁ జవి తప్పి తోఁచిన భరించెడి నీతమలోన దృప్తతల్
మైఁ జను; నేర్చు తీరనివి మక్కువలే మెలుఁగుల్ వెలార్చు, నీ
రాజన మెత్తి నీపదపరాగము లంటు నిజానుతాపముల్.

నీ కిది పూవుఁగాన్క, కరుణింపుమి ఓ మధుమూర్తి! సంతత
మ్మా కమనీయతల్ విరియునట్టిద; నీ తొలిసంజ లూరు ప్రే
మాకృతి యొల్కు దీవనలకై యెదమూలము రేఁగి, సంపదల్
వ్రేఁకలు మూదలింప మధురించున దీపదనన్నిధిన్ చెలీ!

నీమది రేఁపఁబడ్డ తమినింపులు నాకయి ఆశిషాకృతుల్
నోమిన, మానదృగ్వలనలుబ్ధతలో బిగియించి కట్టికో
నా యెడ జైత్రహారము, అవినాకృత భావవచో మిథః ప్రచా
రామృతశైలి నాకు బగునై చివురాకున గొంతు కల్పునో.

# కొన్ని ప్రాచీనశబ్దముల విచారము

శ్రీ నేలటూరి వేంకటరమణయ్య

తలతంత్రము, గోమిని, కేవము అను ప్రాచీన పదార్థ విచారము నిమిత్త మీ వ్యాసము వ్రాయబడుచున్నది[1]. ఇవి అసలు కన్నడపదములని కొందఱు, కాదు తెలుగు కన్నడములు రెంటిలోనుగల సాధారణ పదములు అని కొందఱు అభిప్రాయపడు చున్నారు. ఈ విషయమును దేల్చుటకు పూర్వము కన్నడ-తెలుగు భాషల ఉత్పత్తి పరిణామములను గూర్చి కొంత తెలిసికొనుట అవసరము.

'ఆంధ్రమునకు గన్నడమునకును సాధారణమగు పదజాలము గొంత యున్నది' అనుట నిర్వివాదాంశము. కాని ఈ 'సాధారణ పదజాల మెటులేర్పడినది?- ఎరవు తెచ్చుకొనుట చేతనని కొందరు తలంతురు.

కాని, నిజ మరయగా ఎర వొక్కటియే కారణము గాదని తేలును. ఈ రెండు భాషలును సహజలు. ప్రాచీన కాలమున క్రీ. పూ. ౫, ౬ శతాబ్దము లప్పుడు కృష్ణకు దక్షిణమునన్న భూభాగమునం దంతటను ప్రాచీన తమిళభాష వ్యవహారమున నుండెడిది. ఆంధ్రులు ఉత్తరాపథమునుంచి వచ్చి ఇప్పటి తెనుగు, కన్నడ భూముల నాక్రమించుకొనిరి. వీరిభాష ప్రాకృతము. ఇదియే వీరి శాసనములందు వాడబడెను. ఆంధ్ర తమిళ సంయోగమువలన భాషాసాంకర్య మేర్పడినది. పశ్చిమమున, అనఁగా ఇప్పటి కన్నడ దేశమున, తమిళు లెక్కువగ నుంట చేత అచ్చటి సంకరభాషయందు తమిళపదములు విశేషించి నిలిచిపోయినవి. ఈ భాషకు హళెకన్నడమని పేరు. హళెకన్నడమునకును తమిళమునకు గల పోలిక లందరెరింగినవే. తూర్పున, అనగా, ఇప్పటి తెనుగు దేశమున ఆంధ్రుల సంఖ్య హెచ్చుయి తమిళుల సంఖ్య సన్నగిల్లినది. పశ్చిమమునందువలె ఇచ్చటను భాషాసాంకర్య మేర్పడినను ఈ సంకరభాషయం దెక్కువ సంస్కృత ప్రాకృత పదములు నిలిచిపోయినవి. కావున నిది హళెకన్నడముకంటె భిన్నమయిన దాయెను. ఇదియే ప్రాత తెనుగు. ఇట్లు తమిళాంధ్రభాషల సంయోగము వలన తెనుగు కన్నడములను రెండు నూతన భాష లేర్పడినవి. కన్నడమున ప్రథమమున

1. ఈ పదములకు కుమారసంభవ విమర్శనమున బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిలవారు వేరువిధముగ నర్థము చెప్పియున్నారు. చూడుడు: కు. సం. విమర్శ.

వాఙ్మయ ముత్పత్తి యాయెను. కర్ణాటక నృపాలురగు చాళుక్యులు తెనుగు దేశమును జయించువరకును తెనుగు వ్యవహారభాషగనే యుండెను. అది గ్రంథనిర్మాణమునకు దగినట్టి స్థితియం దుండలేదు. కావున, తెనుగువారు దేశభాషయందు గ్రంథరచనకు గడంగిన కన్నడముననే రచించుచుండిరి. ఈ కారణముననే తెనుగువారైన పొన్నడు పంపడు మొదలయిన కవులు కన్నడమున గ్రంథముల రచించిరి. కాని కాలక్రమమున, తెనుగుభాష రాజాదరమును బడసెను. వారు తెనుగును తమ శాసనభాషగా నంగీకరించిరి. ఇట్లు మొదట తెనుగు శాసనస్థముగ జేయబడినది రాయలసీమయందు. ప్రథమమున రేనాటిని పాలించుచుండిన చోళరాజులును, తరువాత బాదామి చాళుక్య నృపాలురును తెనుగు భూమియందు దమ శాసనములను తెలుఁగుననే ప్రకటింప నారంభించి, తెనుగువచన రచనకు బునాది వేసిరి. తరువాత అచిర కాలముననే పద్యరచనయు నారంభమాయెను. తెనుగు పద్యవాఙ్మయము మొదట పూర్వచాళుక్యుల శాసనముల యందు పాకనాట బొడకట్టెను. పూర్వచాళుక్యులే తెనుగు కవితకు కారణభూతులయిరి. తెనుగుకవులకు అప్పటి కన్నడ కవులు మార్గదర్శకులైరి. తెనుగుకావ్యములకు అప్పటి కర్ణాట గ్రంథములు మేలుబంతులాయెను; కావున కార్ణాటకఛందస్సును వృత్తములను తెనుగువారల్లే గ్రహించిరి. ఏతత్కారణముననే తెనుగున నాదికవియగు నన్నిచోడడు చాళుక్యరాజు[2] దేశికవితను తెనుగున బుట్టించి ఆంధ్రదేశమున నిల్పెనని చెప్పెను.

ఇచ్చట మార్గ దేశికవితల నెవ్వియో విచారించవలసియున్నది. శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు "మార్గకవిత = సంస్కృతకవిత, దేశికవిత = భాషాకవిత్వ, ద్రవిడాంధ్ర కర్ణాటాది కవిత" అని వివరణము వ్రాసిరి. ఈ వివరణము సరియైనదే. నన్నెచోడు డీయర్థముననే మార్గ దేశి శబ్దములను వాడియున్నాడు. గ్రంథావతారికను దిలకించిన నీవిషయము తెల్లముకాగలదు. చూడుఁడు:

చ. సురవరులం గ్రమంబున వ
చోమణిసంహతిఁ బూజ చేసి మ
ద్గురుచరణారవిందముల
కుందగ సమ్మతిఁ జేసి కొల్చి వి
స్తరమతులం బురాణకవి
సంఘము నుత్తమమార్గసత్కవీ
శ్వరులను దేశిసత్కవుల
సంస్తుతిఁ జేసి మనోముదంబునన్.

—కుమా., ఆ. ౧, ౨౮.

---

2. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాళుక్యరాజు రాజరాజని అభిప్రాయ పడుచున్నారు. చూడుడు : ప్రబంధ రత్నావళి, పీఠిక, YIII-వ పుట. తెనుగు కవిత్వమును బుట్టించిన చాళుక్యరాజు రాజరాజు కాజాలడు. అతని పూర్వికులలో నొక్కడుగ నుండవలయును.

ఈపద్యము తత్పూర్వగ్రంథమునకు విషయసూచిక. ఇందు గ్రంథారంభము నందలి ౨౩ పద్యములయందు వర్ణింపఁబడిన విషయములు సూచింపఁబడియున్నవి.

పద్యసంఖ్య

౧. సురవరులం గ్రమంబున ...హాళిఁ బూజ చేసి ౧-౧౧

౨. మద్గురుచరణారవిందముల కుందక సమ్మతిఁజేసి ౧౨-౧౬

3. పురాణకవిసంఘము ౧౭-౧౮
 1. వాల్మీకి ౧౭
 2. వ్యాసుడు ౧౮

వీరే పురాణకవులు. చూ: 'వేదాంత భారతపురాణాదులు' ఇత్యాది. వీ రిద్దరును నొకతరగతికి జేరినవారని 'భాసురమతి వాల్మీకి వ్యాసాదులు చనిన' అనుపద్యము సూచించుచున్నది.

౪. ఉత్తమ మార్గ సత్కవీశ్వరులు ౧౯-౨౨
 1. కాళిదాసుడు ౧౯
 2. భారవి ౨౦
 3. ఉద్భటుడు ౨౧
 4. బాణుడు ౨౨

౫. దేశిసత్కవులు ౨౩

ఇచ్చట గ్రంథపాత ముండెనని తోఁచుచున్నది. దేశికవితను బుట్టించినది చాళుక్యరాజు మొదలైనవారని చెప్పిన చోడుడు దేశికవులను బేర్కొనకపోవునా? రామేశ్వరాది కవులస్తుతి ఇచ్చట నుండియుండును. ఈవిషయసూచికవల్ల మార్గకవులన కాళిదాసాది సంస్కృతకవు లనుట తెల్లమగుచున్నది. మార్గకవిత యనగా రామకృష్ణకవిగారు వచించినట్లు సంస్కృత కవిత యనుట విస్పష్టమగుచున్నది. దేశికవిత యనగా కర్ణాటాంధ్రాది దేశభాషలలో జెప్పబడిన కవిత్వ మనుట నిశ్చయము.

ఇక చాళుక్యరాజు మొదలగు పలువురు తెనుగున దేశికవితను బుట్టించి యాంధ్రవిషయమున నిలిపిరన్న నన్నెచోడునిమాట గమనింపదగినది. తెనుగున చాళుక్యరాజునకు పూర్వము కవిత లేదు. ద్రావిడకర్ణాటాది దేశభాషలయందు కవిత యుండెను. ఆభాషలయందువలెనే తెనుగు భాషయందును దేశికవితను చాళుక్యరాజాదులు పుట్టించి యాంధ్రవిషయమున నిల్పిరని పై పద్యముయొక్క భావము.

కావున తెనుగు కన్నడ భాషలకు సామాన్యపదజాల మేర్పడుటకు రెండు కారణము లగపడుచున్నవి: (౧) సహజత్వముచేత; (౨) తెనుగు కవితకు గన్నడకవిత మాతృక యగుటచేత. రెండవదానికంటె మొదటిదే ఈ సామాన్య పదజాలమునకు విశేషించి కారణభూతమైనట్లు తోఁచుచున్నది.

ఇక హొసకన్నడమునుగూర్చి ఇంచుక వ్రాయవలసియున్నది. హళెకన్నడము తమిళమునకును చాల సన్నిహితసంబంధము కల దనియు, అట్టిసంబంధమే హొసకన్నడ

మునకు దెనుగునకును గలదనియు పైన వ్రాసియున్నాను. హళెకన్నడము హొస కన్నడముగ నెట్లు మారినది? తమిళముతో కేవల సన్నిహిత బాంధవ్యముగల హళె కన్నడము తెనుగుతోడి సన్నిహిత బాంధవ్యముగల హొసకన్నడముగ నెట్లు పరిణమించినది? విచారించగా నిట్టి మార్పు రెండు కారణములవల్ల కలిగినట్టు తెలియుచున్నది. ఒకటి, వీరశైవమత వ్యాపనము. ఈ మతోత్పత్తికి కారకుడగు బసవేశ్వరుడు కర్ణాటకుడేయయినను, ఆ మతము కర్ణాటకమున తెనుగువారిమూలమున వ్యాప్తినందెను. బసవేశ్వరుని యనుయాయులయం దనేకులు కర్ణాటకు లున్నను దేశసంచార మొనర్చి, ప్రతివాదుల కోహటించక కర్ణాటకమున వీరశైవమతమును నెలకొల్పినది పాల్కురికి సోమనాథుడును నాతని శిష్యులును. ఇందుమూలమున తెనుగువారికి కర్ణాటకులతో పొత్తు కుదిరి సంపర్క మతిశయిల్లెను. కర్ణాటశైవులు తెనుగు శైవులు విరచించిన మతగ్రంథములు పఠించుటకై పూర్వముకంటె తెనుగు నెక్కువగ నభ్యసించి యందలి యుద్గ్రంథములను తమభాషలోనికి పరివర్తన మొనర్చుకొన నారంభించిరి. తెనుగుపదములు పలుకుబడులును కన్నడములోనికి ప్రాకి క్రమముగ భాషకు నూతనరూపమును కలుగజేసినవి. రెండవది, విజయనగర సామ్రాజ్య స్థాపనము. ఈ సామ్రాజ్యమును స్థాపించినది తెనుగువారని మావాదము. కర్ణాటకులని కొందఱు తలచెదరు. ఏ వాదము నిశ్చయమైనను అందఱు నంగీకరించదగిన విషయము లొండు రెండు కలవు. అం దొకటి, సామ్రాజ్యమునకు రాజధానియగు విజయనగరము తెనుగు కన్నడరాష్ట్రముల సరిహద్దున బళ్లారి సీమయం దుండెను. మఱియొకటి, ఆద్యమున విజయనగరరాజుల పాలనమునకు కన్నడ భూమికంటె నెక్కువ వైశాల్యముగల తెనుగుదేశము లోబడియుండెను. ఈకారణముచేత తెనుగు కన్నడప్రజలకు విజయనగరము కూడలియాయెను. ఇంతేకాదు; తెనుగువారును కర్ణాటకులును నొకరాష్ట్రప్రజలై యొకరాజు యేలుబడికి లొంగి, రాజకార్యనిర్వహణయందు సర్వదా కూడిమాడి పను లొనర్చుచుండుటవలనను తెనుగువారు కర్ణాటకమునను కర్ణాటకులు తెనుగు దేశమునను రాజ్యాధికారములయందు నిరంతరము వర్తించుటచేతను, నంతకు పూర్వము వీరశైవ ప్రచారమున మారిన ప్రాతకన్నడభాష మఱింతగ మారి హొసకన్నడముగ ననగా నిప్పుడు వ్యవహారముననున్న కన్నడముగ బరిణామమందెను.

తలతంత్రాదిపదములు హళెకన్నడమున లేక హొసకన్నడమున మాత్రము గానవచ్చెడిని. ఇవి హొసకన్నడమున నూతనముగ బుట్టినవని చెప్పుటకంటె, తెనుగుననుండి కన్నడమునకు ప్రాకినవని చెప్పుట యొప్పగు. మఱియు, ఈపదములు

విజయనగరయుగపు గవుల గన్నడవాఙ్మయ మునసె గానవచ్చుట ఈయూహకు ఊత యిచ్చి దృఢపరచుచున్నది.

ఇక తలతంత్రాదిపదములనుగూర్చి యించుక విచారింతము. తళతంత్రమన కన్నడమున సైన్యమని యర్థమని ఈ క్రింది కుమారవ్యాసుని భారత ప్రయోగములవల్ల తెల్లముగా గలదు.

కోశ బలు తళతంత్ర హెచ్చిద దేశ
దుర్గవమాత్య, మిత్ర, మ
హీశ, జన వెంబుదు కణా
సప్తాంగ సన్నాహా॥
—ఉద్యో, ౯. ౩.

హరియ చక్రద సత్వపీతన
ధురదొళాత్మైనె రథద చక్రదొ
ళరిబలవనిడె ముగ్గి కెడదవు
బహళ తళతంత్ర.
—ద్రోణ, ౭. ౨౬.

ఈ రెం డుదాహరణములయందును 'తళతంత్రము' సైన్యమను నర్థమున ప్రయోగింపబడినట్లు విశదమగు చున్నది. కన్నడవాఙ్మయమున నితరత్ర ఈపద మీ యర్థమునసే వాడబడినదని పండితులు చెప్పుచున్నారు. తెనుగు వాఙ్మయమున నీ పదమునకు నన్నిచోడుని కుమారసంభవము నందు

"దారల వట్టఁ బంపు తలతంత్రము దా వడినంపు" (౧౧, ౫౭౫) అను పద్యమున నొక ప్రయోగముమాత్రము గాన్పించుచున్నది. ఇచ్చట తలతంత్రమున కేమి యర్థము చెప్పుకొనవలయును? సైన్యమనియా? 'తంత్రము' అనుమాటకే సైన్యమన్నయర్థము కలదు.

తన్త్రం స్వరాష్ట్రవ్యాపారే
తన్తువానే పరిచ్ఛదే
ఏకసైన్యోభయార్థత్వే
కుటుంబవ్యాహతావపి
సేనాయాం సామసూత్రే చ
సిద్ధాన్తేఽ న్యకుటుంబకే॥
—కేశవ. నానార్థార్ణవ సంక్షేపము (తిరువనంతపుర ముద్రితప్రతి, పుట, ౩౨.)

తమిళమునందు సైతము తంత్రమన్న సైన్యమని యర్థము కలదు.

తానై పదాతి దండం పతాకిని
వాని యనీకం వాహిని తన్తిరం
సెనై పగుది పాడిబలం పడై
—పింగలం తై, ౬-౪౦౦.

తెనుగునను తంత్రమన్న సైన్యమనుటకు గొంతయాధార మున్నది.

ఉ॥ మంత్ర సమేతమై భువన
మాన్యత నొప్పు నమోఘబాణ మా
మంత్రితు జేసి యాతనికి
మన్నన రెట్టిగ నిచ్చి వేడ్కమై
మంత్రుల భృత్యులన్ బుధస
మాజము వైశ్యుల వారిజాక్షులన్
దంత్రము రాజ్యచిహ్నముల
ద్రవ్యసమూహమునిచ్చెఁ బెంపుతోన్॥
—నిర్వ: ఉత్త. ౯,౧౦౦.

ఇచ్చట 'తంత్రమ'న సైన్య మనియే యర్థము చెప్పవలయును. శత్రుపురమగు మధురకు శత్రుఘ్నుని పట్టాభిషిక్తుని జేసి రాము డంపుచు నాతనికి పై పద్యమున పేర్కొన్నవాని నిచ్చెను. అవి,-

| | |
|---|---|
| మంత్రసమేత | |
| మైన బాణము | వైశ్యులు |
| మన్నన | వారిజాక్షులు |
| మంత్రులు | తంత్రము |
| భృత్యులు | రాజ్యచిహ్నములు |
| బుధసమాజము | ద్రవ్యసమూహము. |

శత్రునిర్మూలనార్థము శత్రుఘ్నుని మధురాపురమున కంపిన రాముడు శత్రు నిర్మూలనమునకు ముఖ్యసాధనమైన సైన్యము నిచ్చియుండవలయును. కావున పై పద్యము లోని తంత్రమునకు సైన్య మనియే యర్థము. మఱియు 'తంత్రము'నకు సైన్య మను నర్థమున ప్రయోగాంతర మొండు పండితా రాధ్య చరిత్రయందు గానవచ్చెడిని:

దండనాయకులును తంత్రంబులీశు
దండనాయకులును తంత్రంబు గాగ...

ఇచ్చట బల్లహుని రాజ్యాంగములు పరివారము మొదలైనవి యెన్నబడినవి.

'మంత్రులు, విబుధులు, అమాత్యులు, కరణములు, ప్రెగడలు, బండరు, కార్థరు, బానిసెలు, తలవరులు, లెంకలు, ప్రధానులు, హితులు, ఆప్తులు, పురోహితులు, గాయకులు, నర్తకులు, కలివరులు, పండితులు, తార్కికులు, పాఠకులు, దాసులు, బంట్లు, విలాసినులు, దండనాయకులు, తంత్రము, పౌరాణికులు, ద్వారపాలకులు,-'

ఇంతకంటెను చక్కని ప్రయోగ మొకటి బసవ పురాణమున గాన్పించు చున్నది. చూడుడు:

దండినై మఱియొక్కకుండజంగమము
వెండియు బసవన దండనాయకుడు
మంత్రులు దానును మహీపతి వనుప
దంత్రంబునకు జీవితము వెట్టునెడను
వచ్చి యీయర్థంబు వలయునంతయును
నిచ్చినగాని యెండే నొల్ల ననుచు
ధట్టించి యడుగుడు బెట్టెలమాడ
లట్టున్నభంగి నాయయ్యకు నొసగ
దంత్రసమేతులై ధరణీశుకడకు
మంత్రివర్గం బేగి మఱియిట్టు లనిరి
చెప్పిన గొండెమా జెప్పకయున్న
దప్పగు నటుగాన చెప్పగవలసె
బనిసేయ వెఱతుము బసవయ్యతోడ
ధనమెల్ల నొక్కమిండని కిచ్చె...

—బసవ. ఆ ౩. పుట ౨౪.

ఇచ్చట తంత్రమన సైన్య మనియె యర్థము. అట్లె పూర్వీకులగు వీర శైవకవి పండితు లర్థము చెప్పియున్నారు. బసవపురాణము కన్నడీకరించిన భీమకవి తంత్రమును 'పెర్బలము' (పెద్దసేన) అని భాషాంతరీకరణము గావించియున్నాడు, చూడుడు:

'తండ తండద పెర్బలకెముం
కొండు జీవితముం కొడవెడగ
మిండజంగమ వాగళై తందురవణిసినిందు

—బస. ౧౧-౨.

ఇట్లు పాల్కురికి సోమనాథుని 'ద్విపదలే పెట్టి పద్యములుగ బెనచిన పిడుపర్తి సోమనాథుడును తంత్రమన 'భటమండలి' 'సేనలు' అని యే యన్వయము జేసి కొన్నాడు. చూడుడు:

క. వెండియు నొకయెడ బసవన
దండేశుఁడు మంత్రివరులు దానును ధరణీ
మండలపతి యనుమతి భట
మండలికిని జీత మొసర మన నిచ్చునెడన్॥

క. ఒక విటజంగమవరుఁ డచ
టికి ధనకాంక్షమెయిగడువడిం జని యీపే
టిక నిడియున్నా యర్థము
సకలము నిమ్మని యడుగ బసవఁ డత్యర్థిన్॥

గీ. ఇచ్చె ధనమెల్ల విటజంగ మిచ్చ మెచ్చ,
దానిఁ గని తోఁడిమంత్రులు దంత్రసహితు
లగుచుఁ జని రాజుఁ గని యిటులనిరి తమదు
హస్తములు మస్తకమునను హత్తుకొలిపి.

ఉ. చెప్పిన కొండెహాననుచుఁ
జెప్పకయుండిన ద్రోహహానుమీ
జెప్పినయట్లు సేనలకు
జీవితముల్ బసవన్న దిద్దుచో
నప్పుడు మిండజంగ మొకఁ
డర్థము సర్వము వేడ నేరికిం
జెప్పక నిచ్చె నానచివ
శేఖరుతో బని సాలు మాకికన్॥
— బస. 3: ౨-౫.

కావున 'తంత్ర'మన సైన్యమను నర్థమున ప్రయోగము బహుళముగ గన్పడుచున్నది.

ఇట్లు తెనుగునగూడ తంత్రశబ్దము సైన్యార్థమున వాడబడియున్నది. తంత్రమన్న సైన్యమయినం "తలతంత్రము"నకు విశిష్టార్థ మేదో యుండవలయును. 'తలతంత్రము'లోని 'తల'కు అర్థము నిరూపించిన ఈ శబ్దముయొక్క వాస్తవార్థమును కనుగొనవచ్చును. ఇచ్చట 'తల' యన నర్థమేమి? తలకడచు, తలచావడి, తలపొలము, తలమించు, తలమిగులు, తలమీఱు, తలసాల, తలవాకిలి—ఇత్యాది పదములలోని 'తల'కు గలయర్థమే 'తలతంత్రము'లోని 'తల'కును చెల్లగలదు. ఈ పదములలోని 'తల'కు, 'ముందు', 'పురోభాగము' అని యర్థము. ఈ సందర్భమున తలపొలము, తలచావడి, తలసాల, తలవాకిలి యనువయిన యుదాహరణములు. తలపొలము = పొలిమేర వెంబడినున్న పొలము; అనగా (ఊరి పొలమున కంతటికిని) అగ్రభాగమున నున్న పొలము. తలచావడి = (ఇంటి) ముందరి చావడి; తలసాల = మొగసాల, అనగా (ఇంటి) ముందటి సాల; తలవాకిలి = (ఇంటి) ముందటి వాకిలి. ఇట్లే తలతంత్రము, అనగా సైన్యమునకు (మార్గమును నిరుపద్రవముగ జేయుటకై) ముందు నడచెడిదళము, ఎలగోలు, అని యర్థము చేసుకొనవలెను.

కుమార సంభవములోని తలతంత్రమున కిదియే యర్థము.

'గోమిని': — నన్నెచోడుని కుమార సంభవమున ఈపదము చూపట్టుచున్నది. నన్నెచోడుడు దీని నెటనుండి గ్రహిం

డెను? ఈ మాట తెనుగున నున్నది. కేతన
శకుమార చరిత్రయందు; (౧౦ : ౧౦౮)
. గోమిని యనఁబరఁగిన యా
భామిని నిల్లాలిఁ జేసి పై నొక యాలిం
గామించి వేఁడుకొనియెక
గోమిని యనుసతి గుణంబు కొలఁది
మెఱుంగన్॥

దీనికి మాతృకమైన యాచార్య దండి
యొక్క దశకుమార చరిత్రయందును ఈ
మాట కానవచ్చుచున్నది.

"ఇయ దుక్త్వా ధూమినీ, గోమినీ,
మ్బవతీ, నితమ్బవత్యః ప్రమాణ మిత్యుప
ష్టో మయా". "పున రనుయుక్తో గోమినీ
వృత్తాంత మాఖ్యాతవాన్." (౬-వ ఉచ్ఛ్వాస
ము, మిత్రగుప్త చరిత్రము).

ఇచట 'గోమిని' యనునది యొక స్త్రీ
రు. దండ్యాచార్యుని కాలమున నీ పేరు
స్త్రీలకు బెట్టుట యాచారము గాబోలు.-
గోమిని' లక్ష్మీ శబ్దమునకు సమానార్థక
గుటవల్ల, లక్ష్మి పేరు పెట్టునాచారము
ప్పటివరకును సామాన్య మగుటచేతను,
ండ్యాచార్యుని కాలమున 'గోమినీ' నామ
ారులగు స్త్రీ లుండియుండు రనితలచుట
సహజముగాదు. సహజ మయినను కా
న్నను క్రీ. శ. ౮-వ శతాబ్దమునందు
విడదేశాంతర్గత మగు కాంచీపురవాసి
గు దండి ఈ మాటను గ్రంథస్థము జేసి
ఁడు. - దశకుమార చరిత్రము ఇప్పటి
సంస్కృతమును జదువుబాలు రెల్లను
జదువవలసిన పాఠ్యగ్రంథము. ఆ కాలము
మాట చెప్పవలయునా? సన్నయామను
కొంచమో గొప్పగనో సంస్కృతభాష
నభ్యసించి యుండవచ్చును. 'గోమినీ' శబ్ద
మును చోడుడు దండిగ్రంథమునుండి సం
గ్రహించి యుండవచ్చును; లేక అపారమైన
సంస్కృత వాఙ్మయజలధియం దేమూల
నుండియేనియు గ్రహించియుండవచ్చును.

కేనము:— ఈపదము తలతంత్ర, గోమి
న్యాదులవలె ప్రాగన్నడమున లేదు. వాని
వలె నిది యెచ్చటనుండియో కన్నడము
నందు జొచ్చినది. విజయనగరయుగారంభ
మునకు పూర్వము బయలువెడలిన యాంధ్ర
వాఙ్మయమున 'కే న ము' గానవచ్చు
చున్నది. క్రీ. శ. ౧౫-వ శతాబ్ద పూర్వ
భాగమునందున్న మడికి సింగన్న 'సకలనీతి
సమ్మతము' అను నొక సంకలనగ్రంథమును
కూర్చినాడు. ఆకాలమున లభ్యములగు ననే
కాంధ్ర నీతిగ్రంథములనుండి పద్యములను
గొని యందు సమకూర్చియున్నాడు. కామం
దకమను నొక ప్రాచీనతరమగు గ్రంథము
నుండి కొన్న పద్యములయం దొకదానియం
దీ 'కేనము' గాన్పించుచున్నది.

గీ. ఉభయ వేతన జనులతో నొయ్య గూడి
సాలశిల్పోపదేశమిషంబువలన
గృత్యపతుం బెఱుంగుచుఁ గేనమునను
నాన్నృపాలుని చేష్టల నరయవలయు.
—సకల. ౩౫౩.

ప్రాచీనాంధ్రవాఙ్మయమున 'కేనము' గలదనుట కీ ప్రమాణముచాలును. ఇది శైవ కవిప్రయుక్త కర్ణాటాంధ్రపదమనుట చెల్లదు.

'రత్నభండారము'లోని 'రత్న' 'భండార' శబ్దములు రెండును సంస్కృత పదములు. సమాసముగూడ సామాన్యమైనదే. కావున నిది తెనుగుమాట యైనను కావచ్చును. ఆ కాలమున రాజు లందఱికడను రత్నభండారము లుండెడివి.

కావున, నీ చర్చవల్ల దేలిన దేమనగా,
౧. అనాదినుండి తెనుగు కన్నడభాషలకు గల సంబంధముచేత సామాన్యపదజాల మేర్పడెను.

౨. హళెకన్నడము హొసకన్నడముగ మారుటకు ప్రధానకారణము తెనుగు భాషాసంసర్గముచేతనే.

3. వీరశైవప్రచారమూలమున ననేకములగు తెలుగుమాటలు కన్నడభాషయందు జొచ్చినవి.

౪. తలతంత్రి, కేనాది శబ్దములు హళెకన్నడమున లేవు, ప్రాచెనుగున కలవు.

౫. ఇవి హొసకన్నడమున కానవచ్చుటచేత తెనుగునుండియే కన్నడమునకు కైకొనబడె ననుట నిశ్చయము.

---

# తెనుగు తల్లి

శ్రీ శివరామం

ఏనాడో భోగాల తేలిందిలే! తల్లి
ఈనాల్గు దిక్కులా ఏలిందిలే!!

దాసిగా ఈనాడు తలయొగ్గెనే లెమ్మ
నిరుపేదయై నేడు దురపిల్లగానిమ్మ
ఏనాడో సంపదల కురిసిందిలే! తల్లి
ఈ నాల్గుదిక్కులా విరిసిందిలే!!

చిరునవ్వు నవ్వేనా వరము లనిపించేది
ఎరుపుచూ పొరసెనా ధరణి వణికించేది
ఏనాడో గరువాన తిరిగిందిలే! తల్లి
ఈ నాల్గుదిక్కులా పెరిగిందిలే!!

తనమాట తనపాట తనతపసు తనశక్తి
ఇరుగుపొరుగమ్మలకు ఎరువుగా ఇచ్చింది
ఏనాడో అందాల పండిందిలే! తల్లి
ఈనాల్గు దిక్కులా నిండిందిలే!!

పేరుపెంపులు లేక దారితెన్నులు కాన
రాక ఈనా డిట్లు శోకించు తెనుగమ్మ
ఏనాడో భోగాల తేలిందిలే! తల్లి
ఈనాల్గుదిక్కులూ ఏలిందిలే!!

---

# పసికూన

శ్రీ జనమంచి కామేశ్వరరావు

కలుపుతీయని జొన్నచేను-
పై నుండీ విసిరింది గాలి:
గాలిలోనే కలసి నింద
పింజలై యెగిరి వచ్చింది.

చేనులో ప్రతికంకె యూగె
కలుపుకత్తెలు తలల నూపె
గట్టుపై మోతుబరిరైతు
వెగటుగా నవ్వులే యుమిసె.

"బట్టబై లయ్యింది గుట్టు
బింకాల బిగువు లెటు దాగు?"
ప్రతినోట ఈవాడె నాని!
ప్రతియింట ఈ వ్రాసె రేగె!

ఊరిముంగిల పెద్ద లంతా
అతితెలివి తలలు పంకించి,
మీసాల తెగనవ్వినారు,
మీసాల నెగదువ్వినారు.

ఇందరీ నవ్వులూ ఉప్పెనై
రుసరుసలు వోవుచూ పెరిగి
ఏ పాప మెరుగనీ నిసువు
ఉసురులే యూర్చేసి తరిగె.

# భావవైశిష్ట్యత

'హి మా నీ'

కావ్యకళాత్మయగు కవితావైశిష్ట్యతకు రసార్ద్రమగు భావము ప్రధానము. రసహృదయుఁడు కాని రచయిత రచనలు భావహీనములై అనుజ్వలము లగుట తథ్యము. రసనిష్పత్తి కాధారమగు భావౌన్నత్య ప్రకాశముచే మనోజ్ఞమగు కావ్యకళానందమే బ్రహ్మానందతుల్యమని యాలంకారికుల నుడువు. రచనలందుఁ బ్రస్ఫుటమగు భావసౌందర్యమున పఠిత తన్మయుఁ డైనప్పుడే కవితకు సిద్ధి. ఈ విశిష్టగుణ విహీనములైన రచనలు అప్రకాశమానములును, నీచభావపూరితములును.

హృదయములను భావోద్రిక్తము లొనరించుటయే కళాస్వభావము. హృదయాహ్లాదకరములును, ఆనందజనకములును, మనసులందు భావసుధల స్రవింపఁజేయునవియు నగు ప్రకృతిసౌందర్య విలసితము లగు తావులు కళాస్నిగ్ధము లనుట రసపిపాసువుల సౌందర్యతత్త్వము. బాహ్యాంతర ప్రకృత్యారాధనమునఁ బ్రస్ఫుటమగు భావమరీచికలందు చిత్తము ప్రకాశిత మైనపుడే రచనా సౌష్ఠవమునఁ గలవన్నెలు కవితను దిద్ది తీర్పఁ గలవు. వాసంతలతికకు సురభిళసుమము లెట్టివో కవితకు భావము లట్టివి. సాహితీ కృషిలో సౌందర్యార్చనమే ఉపాధిగాఁ గల కవికుమారులకు భావవైశిష్ట్యత రచనకు పరమావధిగా గోచరించినది. ఆంధ్ర సారస్వతమునకుఁ బునాదియైన భారతసంహితయందు తుది పదునైదు పర్వములలోని భావవిలసితమైన రచన ప్రపంచకవితలో మేటి యనిపించుకొని శతాబ్దుల మన్నన లందుకొన్నది. ఈ కారణముననే తిక్కన లేఖిని స్రవించిన కవితాలహరి నిత్యయౌవనియై, నిత్యజీవనియై నిత్యపావనియై, విశ్వమును ఆనందప్లావిత మొనర్చుచున్నది. లేఖినీముక్తమైన రచనలో కాక, దానిం జదివినపిదప హృదయముల నాకర్షించు భావచిత్రణలోనే కవితావైశిష్ట్యత గలదు. సౌందర్యసృష్టి కనువైనది భావము; భావమున కానందము గలుగఁ జేయునది కళ. లలితకళల కొక్కొక ప్రత్యేక విశిష్టత కలదు. గాయకుడు సృష్టించిన మహాగానముల కేభావములు తావలమైనవో, ఆభావములే చిత్రకారుని రేఖలందుఁ బ్రస్ఫుటించినవి. స్వరమధురములైన రాగగీతము లెట్లు శ్రవణానందములో అట్లే రేఖాసుందరములైన చిత్రములు నయనానందకరములు. భావనాద్యోతకమై మానస వికాస కారణమైన కవిత యన్నికళలకన్న నిత్యమైనది. నూత్నస్వరకల్పనములచే రాగములు భేదించినను, నవ్యరీతుల ప్రభావముచే చిత్రలేఖనము మారినను కవితాభావముల కే మార్పులును తీర్పులును గనరావు. శతాబ్దులనాఁటి కవితలు

భావౌన్నత్యముచే నేటికిని పూజ్యములు. నేటిరీతులు అనూహ్యమైన భావికిఁగూడ వంపులు దిద్దఁగలవు. ఈభావమరీచులలో పులకితమైన విశ్వమునకే రసానుభవము. ద్రష్టలకు రసానుభవము కలిగింపఁజాలిన భావమునకే పరిణతి. భావపరిణతికొఱకే కవుల కళాతపస్సులు. పూర్వకవులు సేకరించిన తలపుపంటల జీర్ణించికొని, తన ప్రయత్నములకు మంగళాచరణము గావించి, హృదయము కళాశ్రీచరణాంకితముగ సౌందర్యార్చన కున్ముఖుఁడైన కవి కవితకే రసావసిద్ధి.

సాహితీ సారస్వతములు ముక్తిసాధనములు. కావ్యకర్తయగు కవికృషి ముక్తిసాధనమున తానొక్కఁడే తరించుటకాక జగత్తును తరింపఁజేయుట. సమకాలికమైన జగత్తునకే కవికావ్యములైనచో ఉన్నత సాహిత్యమున కీభువిలో నవసరము లేదు. అనంతమైన విశ్వనిర్మాణమునకే కావ్యము లుద్భవించినవి. ఇహపర ప్రభావములచే కల్పితములైన కృత్రిమసంఘటనములందు నింక నొక్కఁడెనఁగనవివా రిటు నటు జనినను ప్రధాన మానవ నాగరికతా పరిణామమును సరిదిద్దఁగలిగినవి కావ్యములు. ఈయాధారముచేతనే కావ్యకళోజ్జ్వలములగు పురాణములు ప్రభుసమానము లనెడి యార్యోక్తి. విశ్వహితభావవిలసితము లగు కవితలే పృథ్వీజీవితమున కంచులు దిద్దఁగలిగిన రచనలు. ఇట్లనుట కవితావైశిష్ట్యత నిరూపించుట కాలము యొక్క కార్యమనుటే. నేటికిని ద్విగుణితయశోవంతములై విరాజిల్లుచున్న భారత భాగవతాదుల యంతరము నానారీతులైన మానవ మనసిక తత్వమును సమాలోచించి, శిథిలమానవ ప్రకృతికి ప్రాణప్రతిష్ఠ గావించి, భావికిఁగూడ అదృష్టరేఖలు గీయఁగలిగినది. కవికలమున కింతటి ప్రభావమున్నది. మానవత్వమునకే రెక్కలు తొడిగి ఆధ్యాత్మికప్రపంచమున కెగయునట్లొనర్చిన ఆదికవుల యమృతలేఖనులు ప్రసవించినసాహిత్యము ముక్తిసాధన మన్నచో నడ్డు చెప్పువా రెవ్వరు? అనవరతతపోనిష్ఠచే నిస్సంగియైన మౌనివరునకు ముక్తి యాత్మగత మెట్లయినదో అట్లే, కళాతపస్సునకు ఫలమైన సాహితీప్రతిభచే కవికిఁ గూడ ముక్తి యాత్మగతమైనది. ఆత్మశక్తిచే నిర్గుణబ్రహ్మజ్ఞానము నార్జించినవాఁడు ఋషి; ఆత్మభావవ్యాపృతిచే బాహ్యసృష్టికి పరమావధి నెఱిఁగించినవాఁడు కవి. ఇరువురకును సాధనలు వేఱైనను సాధ్యమైన వస్తువొక్కటియే. ఇరువురును పరబ్రహ్మస్వరూపమునకు వ్యాఖ్యాతలే.

రసభావములకు వ్యత్యాస మణుమాత్రమగుట, కవితలో భావప్రాధాన్య సమీక్షయందు రసచర్చ యనుల్లంఘనీయమైనది. రసానుభూతికి భావమనునది ఉద్దీపనమనుట కొందఱి వాదము. బాహ్యవస్తుప్రేరితమైన భావపరంపరచే పరిణామము చెందిన చిత్తవృత్తినే రసానుభూతిగా నెన్నుకొని, భావమును విభావమున కంటఁగట్టి సరిపెట్టుకొన్నచో పై వాదమునకుఁ గొంత బల మేర్పడును. రసభావముల కన్యోన్య మవినాభావసంబంధ మున్నది. శాస్త్రాదేశమునే యాధారముగాఁ గలిగిన గ్రంథరచనకును, రసప్రవృత్తిప్రధానమైన కావ్యస్వరూప చిత్రణకును బాహ్యాంతరములలో విశేషభేద మున్నది. పూర్వాలంకారికులలో పై రెండు

సూత్రముల కనువైనట్లు వారివారి వ్యాఖ్యానము లొసంగినవా రిరుతెగలవారును గలరు. శాస్త్రాదేశము కత్తిరింపులతోడి బాహ్యకృతికే విలువనిచ్చినది. కాని రసవాదము అంతరంగ రమణీయతలో తన యందము చూచుకొనినది. భావసౌందర్య విస్ఫూర్తి గలిగిన రసవాదమునకు విజ్ఞుల యాధిపత్యమున నగ్రతాంబూలము ముట్టినది. నాఁటి నుండియు నీరసికమతము రసరమణీయతలను కావ్యవస్తువులుగా నాదేశించినది. కావ్యాత్మకు నైరళ్య మాపాదించిన రసికమతమునకు సౌందర్యార్చన హేతువైనదనుట నిర్వివాదాంశము. విశిష్టపదరచననే, రీతిగా ననువదించుకొని దానినే కావ్యమున కాత్మ యనిన లాక్షణికులు రచనలో రమణీయతాగరీయస్త్వము నొప్పుకొనరు. రసవాదమున వస్త్వలంకారములకు తావులేదన్ననుడి అలంకారము ు ను కావ్యశోభాకరములని చెప్పుటతో ఛాయామాత్ర మగుచున్నది. "సౌందర్యమలంకారః", "రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యమ్" "వాక్యం రసాత్మకం కావ్యం" అనెడి రసవాదసిద్ధాంతములు విశిష్టరసభావసౌందర్యమును కావ్యాత్మగా నెంచుకొన్నవి. సాధనల కొఱకేపుంతల త్రొక్కినను లాక్షణికు లందఱును కావ్యసౌందర్యము నారాధించి రనుట సత్యము. ఆసౌందర్యమును గుర్తించి గీచిన గీతలుమాత్రము భేదించినవి.

కావ్యసృష్టికి నిరోధ మేర్పఱుపఁ గల శాస్త్రనియమముల నొక ప్రక్కగా వదలి, కావ్యపుష్టి నొసఁగు రసవాదము సౌందర్య వ్యాప్తికొఱకు భావవైశిష్ట్యత కెంతదూరము తావలమైనదియు యోచించుట సాహిత్యప్రియుల కొక విధి. గుణాలంకారములు కావ్యలక్షణము లన్నమాటకు సౌందర్యాః యవనిరూపణమే అర్థముగా నిర్వచించుకొన్నచో మఱికొందఱు లాక్షణికులనుగూడ రసికమతానుయాయులుగఁ జేర్చుకొనవచ్చును. వారు కీర్తించిన వ్యంగ్యవైభవమును గూడ రసస్వరూపమున నొకశాఖగా నెన్నుకొనుట నప్పుడు మఱువదగినదిఁకాదు. యశముకొఱకే కావ్యము నిర్మింపఁబడిన దని చెప్పినచో, రసభావసౌందర్య విరళీకృతములగు కావ్యప్రయోజనములే స్మృతిపథమున నవతరింపఁ దగినవి. ఇట్లు ఇరుతెగలకును సామరస్యమును కొంతవఱకుఁ దీసికొనిపోఁ గలిగినను కొనలలో వ్యత్యాసము తప్పనిదే. పరిణామమందు విరుద్ధగుణములచేతఁ గూడ మార్పు నందక, పూర్ణముగ రసప్రదర్శనమొనఁగు ప్రధానభావము స్థాయిభావ మన్నది లాక్షణికు లంగీకరించినదే. రసస్ఫూర్తి నంతరమం దముడ్చుకొనఁగలిగిన భావమే సౌందర్యసుధల నెగఁజిమ్మఁగలుగు ననుకొనినచో పై నిర్వచనముయొక్క హృదయము చాలవఱకు తెల్లమగును. స్థాయిభావమే రసమై, సంచారి వ్యభిచారాది విరుద్ధ గుణములచే నైనను మార్పు నొందకపోవుట ప్రధానలక్షణముగాఁ గలిగియుండి ఆనుషంగికములగు భావము లన్నిటికి స్వకీయవాసన నొసఁగుచుండును. నయనగోచరము లైన వస్తుదర్శనకారణమున ప్రభవించిన ఖేదమోదప్రవృత్తులచే హృదయము పొందెడి యవస్థయే భావము. ఈభావము మనసునఁ దోఁచినప్పుడే రసస్నిగ్ధమైయుండును. ఇట్లని కావ్యలక్షణమందు రసవైభవమును కూడ మించిన దానిగ భావవైశిష్ట్యతను నిరూపించుచో సత్యదూరము గానివాద మగును. చిత్తవృత్తి

ననుసరించి రసము విభావానుభావాద్యవస్థలయనుభూతిచే స్థాయిత్వము చెందు నని కొందఱివాదము. అవస్థాభేదముచే భావము పరిణామ మందుచు స్థాయిభావముగ పరమావధి చెందు నని మఱికొందఱిమతము.

వ్యుత్పత్తిక్రమమున రసము ఆస్వాద్యము. మానవజీవితముయొక్కగాని ప్రకృతియొక్కగాని సందర్శనమువలన కవిమనస్సునందు నిశితతైక్ష్ణ్యముతోఁ గలిగిన భావానుభూతియే రసము. కవిమనస్సున సౌదామినీసంకాశమై జనించినరసము విభావాదికముల ప్రస్తారముచే తుదకు స్థాయిభావదశ నందును. సాత్త్వికవ్యభిచారాదులకు తోడు తదంగప్రస్తారముచే కావ్యమున విసువు జనింపక రసమునకు వైవిధ్యమును, ఆనందదాయకత్వమును కలుగుచున్నవి. కారణము ఆధ్యాత్మికమైనను, భౌతిక మైనను, రసమునకుఁ బర్యాయపదము స్థాయిభావము. రససాక్షాత్కారమునకు దృష్టిగోచరమైన వస్తుసౌందర్యము విభావాదికమే యైనను కవిహృదయము రసజ్ఞత నెఱిఁగియే యుండును. కావ్యలక్షణములకు రసభావము లిట్లు పరస్పర పరిణామముచే కవిహృదయమును స్నిగ్ధమొనర్చి, యందు ప్రకృతిసౌందర్యము ప్రతిబింబింపఁజేయును. ఈ స్థితియందు కవి సామాన్యమానవుఁడు కాఁడు. సౌందర్యరసికజీవి యైనతరువాతనే కవి తన కవితను నడుపఁగలఁడు. కవి యీ స్థితికిఁ దీసికొనివచ్చు లోకానేక సంఘటనము ప్రతికవికిని బోడము దుండును. ఆసమయమునందే యతనినుండి రసస్నిగ్ధమైన భావములతోడి కవిత వెలువడును. కళావ్యాపృతి యనినను, సౌందర్యార్చన యనినను అయ్యదియే.

ఈవిలక్షణమైన రచనలే పఠితహృదయమును ఆనందమాలికలందుఁ దేల్చి, అపూర్వసౌందర్యదృశ్య మొకదానిని కనులముందు ప్రత్యక్షమగునట్లుఁ జేయును. స్వప్నమాత్రముగ స్మృతిపథమునఁ దోఁచినభావసౌందర్యములనే పునఃస్మరణమున మథించి రసపూరితమైన రచనలు కావించుటే విశిష్టకవిత. అంజలి భావవైశిష్ట్యతకే ప్రాజ్ఞుల అంజలి. సామాన్యమానవదృష్టికిని కవిదృష్టికిని భేద మనల్పము. కవిమనస్సు మృదులమైనను తలపుటొత్తిడిచే కిణాంకితము. వివిధరసములు కవినుండి విస్ఫూర్తితో వెలువడు టాకారణముననే. కఠిన పాషాణ కర్కశత్వమునఁగూడ, సుమసమ సుందరమృదుత్వములు చూడఁగల్గిన కవికి శృంగారము గుణముగాఁగల్గిన సౌందర్యసృష్టి కష్టము గాదు. సామాన్యమానవుఁడు యినుపపాదాలతో నలిపివేసెడి చిన్నిగడ్డిపూవు కవిహృదయమును చలింపఁజేసి, నవనవానందభావముల రేకెత్తించి, కనులవెంట నానందాశ్రువులను గురియింపఁగలదు. వికసితకుసుమ సందర్శనమాత్రమున దివ్యత్వ మనుభవించి రసచకితమైన హృదయముతో సుమసౌందర్యము ముందు భక్తిభావమున తలలు వాంచిన కవివరులును గలరు. దీని కంతటికిని కారణము కవికిఁ గల సౌందర్యతృష్ణయే. ఈ తృష్ణాతిరేకముచేతనే కవికాంతి లోకముల విహరించి, ఆయా భావదృశ్యములను తన కనకలేఖినితో చిత్రించును. అప్పటి యాకవిసృష్టి విశ్వమునకే సౌందర్యప్రదమై వెలయఁగలదు.

మృగమదసౌరభవిభవ
ద్విగుణితఘనసారసాంద్రవీటీగంధ
స్థగితేతరపరిమళమై
మగువపొలుపు దెలుపు నొక్కమారుతి మొలసెన్!

ఈ నాల్గు పాదములును ఆంధ్ర సాహిత్యప్రపంచమునఁ గల సౌందర్యసృష్టికి తావలమైనవి. ఇట్టి వెన్నియో కలవు. ఇందుఁ గల శృంగారము పరమపవిత్రమైనది; అనూహ్యమైనది. ఇంతటి సౌందర్యము సామాన్య నేత్రములు చూడఁజాలవు; హృదయము లూహింపలేవు గూడ. ఊహ యెంతటివరకు కొనలు సాగినను యిందలి తీపి తెలిసికొనఁజాలదు. దీనిలో నణుమాత్రమైన సౌందర్యముగూడ భావన కత్యంతమై తోచును. ఈ విషయమే నాలుగు గాక పదునాలుగు పాదములైనను ఒకప్పుడు కేవల వచనము వలెనే యుండి భావవైశిష్ట్యత లేకయుండును. వస్తు వొకటేయైనను భావసృష్టి కనువగు పదజాలమందు సౌందర్యము లేకపోయినచో రచనలో కవిత లోపించిన దన్నమాట. సౌందర్యమయము కానిహృదయము కవితలోని పసను రవంతైన చవి చూడలేదు. దివ్యానందప్రదమగు నింతటి భావసంపదను హృదయమున రేపఁగలిగిన దే సౌందర్యసృష్టి. రస మధురమైన కవి హృదయమే యిందులకుఁ దగియుండును.

పఠితల నోకానోక విలక్షణమైన వాతావరణమున స్నిగ్ధచేతస్కులఁ నొనరించున దే సార్థకమగు కావ్యము. కలమును బట్టి వ్రాసిన దెల్లను పద్యము కావచ్చును. పదమునకు నర్థమునకు నవినాభావ సంబంధము గాన నా పద్యమున కేదో యొకభావ ముండవచ్చును. అంతట నద్దానిఁ గవిత యనుట యవివేకము. కవిత్వభావసృష్టి కవికే తెలియును. భావమున కనువైనయర్థబంధురపదజాలము గూడ నప్రయత్నముగా సుధాలహరివలె లేఖినీముఖమునుండి వెలువడును. కావ్యపఠనానంతరము పఠిమనస్సునకు తోచుభావజగతి కవి సృష్టింపఁ గలిగిన దే. విశ్వహృదయాంతరాంతరములకు మునిఁగి భావరత్నముల వెలారింపఁగఁ కవిగీతు లన్నియు భావబంధురములై విశ్వహితములై యుండును. సౌందర్యసృష్టి యొ నచ్చినందనోద్యానము నవనిపై నాటఁగలిగిన వాఁడు కవి. మానవజీవితాబ్ధిని మథించి హాలాహలగర్భమునుండి అమృతభాండము నీవలకుఁ దెచ్చుట కట్టివాని కొక కష్టమైన కార్యము కాదు. ప్రకృతి కవియైనచో, కవి విమర్శకుఁడు. ఈతని విమర్శనమున వసంత వైభవము లేయుగాంతమునైన చెడవు. ప్రకృతి సిద్ధములైన చంద్రికలు మేఘావృతములై మెఱుఁగుమాయునేమో కాని, ఈ కాల మాకాల మనునది లేక కవిభావములలోని వెన్నెలలు నిత్యములై విశ్వమునకు వెండిపూఁత లిడుచుండును. ఇంతటి యౌన్నత్యముగల వగుటచేతనే కవికావ్యములు కాలమునకే యందములు దిద్దుచుండును.

ప్రపంచమునఁగల ప్రతిసమస్యయు కవి కిఁదోఁచినట్లుగ నితరులకుఁ గన్పట్టదు; కవికిఁ గలదృష్టివైలక్షణ్యమే యిందులకు హేతువు. పరస్పరవిరుద్ధములగు ననంఖ్యాక సంఘట్టనములతో మానవజీవితము కవియెదుట ప్రత్యక్షమగును. అందలి సత్యాసత్యవిచక్షణ కవిహృదయదర్పణమున ప్రతిబింబించి, శతసహస్రరూపములతో జగ మంతయు నావరించును. కవిహృదయ ద్వారము నుండియే జనులు జగతిలోఁ బ్రవేశించుట. ఆతని హృదయదర్పణమునందే ప్రపంచ ప్రతిబింబములు, మానవజీవితచ్ఛాయలు దృష్టిగోచరమగుచుండును. 'తళుకుటద్దంబు

త్కృపులమనసు' అన్న కవివాక్యము భావనను దూరదూరములకుఁ దీసికొని పోవుట పైనత్యముచేతనే. భారత సంహితాది కావ్యములం దున్న దేమి? జగములకు వెలుఁగిచ్చు భావమరీచీజాలము. తీవ్ర ప్రపంచసమస్యలు కవిహృదయరంగమున రేపిన సంఘటనజ్వాలలు. అధ్యాయములుగ వివరింపఁబడి ప్రదర్శింపఁబడిన మానవజీవిత ప్రకృతి. ఈముఖ్యసూత్రములచే బంధింపఁబడి నది కావ్యకర్త హృదయము. ఈసూత్రములను ఆహ్లాదకరముగ చిత్రించునది లేఖిని. పొంగిపొంగి చల్లఁబడిన పాలనుండి వచ్చు మీఁగడతరకవలె శతాబ్దముల ప్రపంచ చరిత్రచే మథింపఁబడి మంజులమైన కవి యంతరాత్మనుండి జగతికి ప్రాణప్రతిష్ఠఁ జేయఁజాలు భావామృత ముదయించును. తదమృతాస్వాదనము ప్రజల యభిరుచుల కొలఁదియు, కోర్కెలకొలఁదియు, పూనికల కొలఁదియు నుండును. ఈఁతనెఱుఁగని మానిసి సముద్రజలములఁ బడి యసువుల విడుచు నటుల, కావ్యజలధిలోఁబడి దిక్కుఁ దరి గానక చేతనారహితు లైనట్టివా రనేకులు గలరు. సమర్థునకు సముద్రగర్భమున కాంతిపుంజములగు రత్నఖనులు దొరకునట్లు, ఆర్ద్రహృదయులకు కవితలోఁగల యందంపు గనులు గోచరమగును.

ఒక్కొకదో సౌందర్యసృష్టిచే హృదయమునకు దివ్యానందము గలుగఁజేయుకవి, ప్రకృతిప్రదర్శనముచే వేఱొకయెడ మానస వికాసము గలుగఁజేయును. ఆనందమూర్తియై అమృత వాహినులు కట్టినకవి, ప్రవక్తయై మహాప్రబోధము కావించుచుండును. చేసిన సృష్టికి, సొంపులు దిద్దుటగూడ కవికి నిత్యకృపి.నైనది. సాహితీకేదారములందు కవి పండించినపంటలు యుగయుగములకుఁ గూడ లోకముల యాఁకలి తీర్చుచున్నవి. ఒక కావ్యము కాదు, ఒక గీతమైనను తుద కొక పదమైనను కాంతికిరణమువలె నిశితమై విశ్వమంతయుఁ దిరిగి లోకము నంతను ఒక్కత్రుటిలో వెలుఁగున ట్లొనర్చును. లేఖనీరేఖలలో వన్నెలు దిద్దుకొనిన యక్షరములు కవినే మన కనులముందు సాక్షాత్కారము చేయును. ప్రభాకరుని కిరణపరిరంభణమున వెలుఁగొందెడి లోకమువలె, అనంత విశాలమైన ప్రకృతి కవికనులు దాటిపోవు. ప్రకృతి ప్రతియణువును పరిశీలించి జీర్ణము కావించుకొనిన కవి భావోజ్వలుఁడై, మహోన్నతపదస్థుఁడై ఆత్మవల్లకిపయి తన దివ్యవాణిని మ్రోయించి అవనికి నమృతప్రబోధము కావించును. లేఖనీముక్తమైన ప్రతిపదము గూడ రమణీయార్థప్రతిపాదకమై జగతినే యానందపులకిత మొనర్చును. ఒకదో కవిప్రయుక్తమైన యొకపదమైనను పఠితను భావసీమలో ననంత వీథుల త్రిప్పి జీవితప్రకృతిని ప్రదర్శింపఁ గలదు. కవిపదము వసంతకుసుమ కోమల సదృశము, ఆపదమే వేఱొకచో అశనిపాత కర్కశము కూడను. ఒక పదమైనను భావబంధురమై, ఒకప్రపంచమునే సృష్టింపఁగలిగి యుండును. ఉదాహరణ కీ క్రింది పద్యము గైకొనవచ్చును :

నీవు సుభద్రకంటె గడునెయ్యము, గారవముం దలిర్పఁగాం
భావనసేయుదు; దిట్టినను పంజరశాఖ! యొకం డు రాజమా
యావబృగంబునందు కుదిర్చెనుపంచనవేణి వట్టి యీ
యేపున జూడగా సభకు నీడ్చె సులాంగనలింతలో ద్రుకే.

"ఉద్యోగపర్వము"

రచనలోని రమణీయత నటుంచుడు. ఈ ప్రత్యేకసందర్భమున ద్రౌపది పలికిన "ఒకండు" అనుపదములో నామె జీవితమే యిమిడిపోయి రూపవైవిధ్యముతో వెలువడు చున్నది. 'ఒకండు' అనునొక్క మాటలో నెంతటి కవితయు, గొప్పదనము నిమిడి యున్నవి! ఆ మాట తలఁచుకొనినంతలో, నిత్యశోకమున గడ్డకట్టిన యొకానొక కాంత హృదయవేదనారేఖ, బహుళ బాధాపథాలలో తపస్వినియైన యొక కాంతతీవ్రవాక్కు, దుఃఖదూషితమైన జగతినే సృష్టించు నొక భావపరంపర, వెతవేఁడిఁలో మాడి కుమిలి పోయిన వనితతలఁపురాపిడుల నుదయించిన నిరసన, గ్రంథముల నావరింపఁజాలు పూర్వగాథ, దుర్భరమై హృదయగహ్వరమున నుండి వెలువడు వేదనా జీవితజ్వాల - ఇన్ని పొడగట్టుచున్నవి. ఆ పదమున కున్న బరువు భూగోళమునకు లేదు. దానికున్న నైశిత్యము మెఱపునకు లేదు.

ఇటులనే బంధురభావములచే నొకానొక సంఘట్టనాపూర్వకమైన జీవితగాథను విశ్వహితముగా నొనర్చుటతో కవి రససిద్ధుఁడగు చున్నాఁడు. కవి ఒకకాలమునకును, ఒక దేశమునకును చెందనివాఁడు. భావజీవియై కల్పాంతమువరకుఁ గూడ నీయుర్వపై మనఁగలఁడు. వ్రాయు ప్రతి విషయమును విశ్వజనీనముగ నొనర్చి విశ్వహితుఁడైన వాఁడు కవి. అతని కలముచాలులలో విశ్వమే తన హద్దులు సరిచేసికొనును. అతని కావ్యములలో విశ్వవీణాధ్వనులు శ్రుతి నెన్నుకొనును. అతని భావప్రకాశములో విశ్వమునకు వెలుఁగు మాయదు. రసస్నిగ్ధ హృదయముతో కవి సృష్టింపఁగలిగినది కావ్యము. కావ్యమున కాత్మయైనది భావవైశిష్ట్యత. కవిభావవిశిష్టమైనది కవిత. కవి భావసృష్టిలో అనంతములైన జగత్తులు నిర్మితములు. ప్రకృతిప్రతిబింబమైన కవిభావసృష్టి శాశ్వతమై కవిని నిత్యయౌవను నొనర్చి విశ్వప్రియునిఁ జేయుచున్నది.

---

# ప్రార్థన

శ్రీ శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

ఈ మహోన్నతపద మధిష్ఠింపగాన
నిబిడతమ తమోవృతుడనై నీవె యిట్లు
కనికరపుత్రాడు గట్టి యీగాలి పడగ
నెగురవేసెడి ప్రభుడవం చెరుగనైతి.
విసుగు పుట్టి త్రాడొకకొంత వీడితేని,
మొగి రెగిరి, తారుమారయి, యించుకైన
దారి తెలియక, మెంతేని తల్లడిల్లి
ప్రబలకంటకావృతభూమి బడుదునేమొ.

నీకరము నానియుంట బంధితుడనంచు
తలచెదనుగాని అదియె స్వాతంత్ర్యమహిత
మని గ్రహింపగలేక అల్లాడుచుంటి
త్రాళ్లు మరికొన్ని తమప్రక్క లాగికొనగ.
ఇంత ముస్తాబుచేసి రచించినట్టి
గాలిపడగను జాగ్రత్తగా ధరించి
ఇటునటుం దూలిపోకుండ నెగురవేయు
చుండు మోస్వామి యేప్రొద్దు నుత్సుకతను.

# కథకచక్రవర్తి - ప్రేమచంద్

శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావు

ప్రపంచచరిత్రలో ప్రతి దేశంలోనూ మేధాసంపత్తిగలవర్గం సామాన్యమానవ సమాజం (Proleteriat)తో జోక్యంలేక దూరంగా ఉండడమే సామాన్యంగా కానవచ్చే విషయం. తన్మూలంగా విద్యావంతులకూ విద్యావిహీనులకూ వ్యత్యాసం స్థిరమయింది. కాలవాహినిలో అప్పటప్పట ఆత్మానుభవంగల మహాపురుషులు అవతరించి యీ వ్యత్యాసాన్ని తమ ఆత్మజ్ఞానంతో దైనందిన ప్రచారాన్ని మేళవించి సర్దుబాటుచేసేవారు. కాని, ఇట్టి తాత్కాలికసంవిధానం యిట్టివిషయాల్లో శాశ్వత ఫలితాలని చేకూర్చలేకపోయింది. కారణం, బుద్ధి వస్తుతః ప్రత్యేకకులీనత కలదిగనక.

భారతదేశంలోకూడా ఈ విద్యావంతులకూ విద్యావిహీనులకూ గల కృత్రిమ వ్యత్యాసం గత కొన్ని దశాబ్దాలనుంచీ హెచ్చవుతోండేది. కాని గతశతాబ్దంలోని చివరరోజుల్లో జాతీయతృష్ణ వ్యాపించి మానవ సమత్వభావాలకు దోహదముచేయజాలింది. భారతజాతీయ జీవనరంగంలో అపుడే గాంధీ మహాత్ముడు ప్రవేశించి విద్యావంతుల జీవనాదర్శాలలో సారస్వతకళావ్యవహారాలలో స్పష్టమైన ప్రజాహితదృష్టిని సృష్టించాడు. ఈ మహాత్త్వభావాన్ని పొంది, తమసారస్వత జీవనాన్ని ఆ వరవడిలో దిద్దుకున్నవారిలో ప్రప్రథమ హిందీకథానికారచయిత, ప్రేమచంద్ మహాశయు డొకడు.

ప్రేమచంద్ జననం క్రీ.శ. ౧౮౮౦ లో. చిన్నపుడు ఇతన్ని 'నవాబ్ రాయ్'అని పిలిచేవారు. కాశీ సమీపాన్నున్న 'పండేపూరు' జన్మస్థలం. తండ్రి తపాలాగుమాస్తాగా నెలకి ఇరవైరూపాయిలు తెచ్చుకొనేవాడు. సనాతనాచారపరుడు కాబట్టి ప్రేమచందుకు - విద్యార్థిదశలోనే—పదిహేనోఏట వివాహం చేశాడు. పిమ్మట ఏడాదిలోగా కాలం చేశాడు. అందుమూలాన్ని కుటుంబభారం ప్రేమచంద్ మీద పడింది. దరిద్రబాధాహతుడైనా, విజ్ఞానతృష్ణగల యువకు డవటంచేత, ప్రేమచంద్ గ్రంథపఠనం నిరంతరాయంగా సాగించేడు. తనకష్టసుఖాలన్నీ సంతోషంగానే భరించాడని, ఆపిమ్మట తనమిత్రు డొకడికి వ్రాసిన వాంశాన్నిబట్టి తెలియవస్తుంది. "అదృష్టదేవతా, ప్రకృతీకూడా నాయందు దయఉంచినందుకు సంతోషం. నాజీవితం నిర్ధనులసేవకు అంకితమయింది. వారిసేవ ఒకటే మితిలేని సంతృప్తి నిస్తుంది!"

ఇంతలో ప్రేమచంద్ జీవనరంగంలో నూతనాధ్యాయం ప్రవేశించింది. మొదట నెలకు పద్దెనిమిదిరూపాయల ఉపాధ్యాయవృత్తిలో చేరి, కాలక్రమేణ స్వశక్తివలన సబ్ డిప్యూటి ఇన్స్పెక్టర్ పదవిని సంపాదించేడు. తరవాత గోరక్‌పూరులోని నార్మల్‌స్కూలులో ప్రవేశించాడు. అసహాయోద్యమపు మొదటి రోజుల్లో ఈపదవికి రాజీనామా ఇచ్చి, శేష జీవితాన్ని సమగ్రంగా సారస్వతసేవకే అంకితంచేశాడు. ఈమహత్తర విప్లవం అతని

జీవితంలో కలగడానికి మూలం గాంధీజీసందేశమే. ౧౯౨౦ లో గాంధీజి గోరఖ్‌పూరు రాక, ప్రేమచంద్ జీవితంలో నూతనాదర్శాలని రేకెత్తించి ధన్యతను చేకూర్చిందని అతడే ఒకచోట పలికాడు.

౧౯౨౦ సం॥కు ముందుకూడా ప్రేమచంద్ కొంతసారస్వతసేవ చేస్తూనే ఉండెను. ౧౯౦౨ సం॥లోనే కొన్ని కథలూ, ఒకటి రెండు నవలలూ ఉర్దూలో వ్రాశాడు. ౧౯౦౮ సం॥లో ఇతని ప్రథమకథానిక సంపుటం గ్రంథరూపాన్ని వెలువడ్డది. 'సోజీ వతన్' Soz-i watan) అనే శీర్షికతో ఉన్న ఈగ్రంథానికి అధికారుల దురాగ్రహాన్ని చూరగొనే గౌరవం దక్కింది కాని, సమకాలికులైన ఉరుదూ రచయితలు దూరదృష్టితో ప్రేమచంద్‌ను సారస్వతప్రపంచంలో ఒకగొప్ప కాగల రచయితగా గుర్తించారు. ప్రేమచంద్ అప్పటి నుంచీ, తన జీవితాంతంలోగా పన్నెండు నవలలూ, రెండునాటికలూ, సుమారు మూడు వందలు కథానికలూ రచించాడు. పైగా టాల్‌స్టాయికథలూ, గాల్స్‌వర్దీనాటికలూ కొన్ని అనువాదంచేశాడు. మొదటిది ఉర్దూభాషలో వ్రాసినా, తరువాత రచనలన్నీకూడా ప్రజాసామాన్యానికి బోధపడే హిందీభాషలోనే వ్రాశాడు. ప్రేమచంద్ ఈరీతిగా హిందీ సారస్వతంలో కథకచక్రవర్తి అని అమరకీర్తి గంచాడు. ౧౯౩౬-వ సంవత్సరం శరత్కాలంలో పరమపదించాడు.

అధునిక హిందీసారస్వతంలో ప్రేమచంద్‌కున్న ఉన్నతస్థానం కథానికారచయితగానే. వంగసారస్వతంలో రవీంద్రుడు శతాబ్దికి పూర్వమే కథానికారచన ప్రారంభించినా, హిందీలో కథానికారచనమాత్రం ఇరవయ్యోశతాబ్దంతోనే ప్రారంభమయింది. బహుశా, ప్రేమచంద్ రవీంద్రుని రచనల వల్ల కథానికారచనావిధానాన్ని (technique) గ్రహించిఉండవచ్చును; కాని, అతడు 'కథానిక'ను గొప్పనేర్పుతో రచించి, మలిచి జీవం పోశాడు. అతని రచనలే ఇందుకు తార్కాణ.

ప్రేమచంద్ తనహిందీరచనల్లో వాడిన భాష విద్యావంతులూ సామాన్యులూకూడా అవగాహన చేసుకోగలిగినదే. ఈవిషయం నిమ్నోన్నతవర్గాలకు మధ్యనున్న వ్యత్యాసాన్ని తొలగించడానికి సహాయపడుతుంది. కాని, అన్నిటినీ మించిన దివ్యవిషయం, అతని రచనలు భారతజాతి ఆత్మను ప్రతిబింబిస్తాయి; భారతవర్షంలోని జానపదుల సుఖదుఃఖాలూ, ఆశయాలు, ఇందు ప్రతిఫలిస్తాయి. అతని రచనలు భారతజీవనస్రవంతికి ప్రతిబింబాలుమాత్రమే కావు; అవి మానవుల్లోని శాశ్వతత్వాన్ని నిరూపిస్తాయి భారతజాతీయ జీవనంలోని పవిత్రమాధుర్యమూ, ఐక్యతా, యుగయుగాలనుంచీ ధారావాహినిగా వస్తున్న ఆధ్యాత్మికవాతావరణమూ-వీటిని బహుముఖాల ఘోషిస్తవి ఇతని రచనలు.

ప్రేమచంద్‌దృష్టిలో, ఆదర్శకథానిక జీవితస్వరూపాల్లో ఏదో ఒకదానిని చిత్రించాలి; సామాజిక నిబంధనాలని ధైర్యంగానూ, నవిమర్శకంగానూ పరిశీలించాలి. మానవుని ఆంతరంగిక ప్రవృత్తులను 'సత్యం, శివం, సుందరం' అనుదివ్యస్థితిలో లయం చేయాలి. మానవుని ఔత్సుక్యాన్ని అభివృద్ధిచేయాలి. ఈ ఆదర్శాలని ఇతని కథానికలు అందు కొన్నవి.

కథానికారచనలో వంగసారస్వతంలో రవీంద్ర శరచ్చంద్రులకున్న స్థానం, హిందీ సారస్వతంలో ప్రేమచంద్‌కు ఉన్నది. గై డీ మూఁపాసా, ఎడ్గార్ ఏలన్ పో, టాల్‌స్టాయి, చెకవ్ — మొదలైన పాశ్చాత్యకథకులకు తీసిపోని రచనామాధురి ప్రేమచంద్ రచనల్లో ఉన్నది. భాష, విధానం (technique), వస్తువు (theme) — అన్నిటిని ఆదర్శ రీతిని సమ్మేళనంచేసి సమకాలిక భారతజాతీయ జీవితాన్ని ప్రావీణ్యముతో చిత్రించి, భారతీయ సారస్వతానికి ప్రపంచ వాఙ్మయంలో ఉన్నతస్థానం చేకూర్చడానికి తోడుపడ్డాడు. భారతీయసాహిత్యానికి ఖండాంతరఖ్యాతిని తెచ్చిన రవీంద్ర శరచ్చంద్రాది మహాశయుల పంక్తిలో ప్రేమచంద్ తన స్థానాన్ని ఆక్రమించుకున్నాడు.

ప్రేమచంద్ రచనలు భారతదేశంలో ప్రముఖ మాతృభాషలలోనికి భాషాంతరణమవుతున్నాయి. ఇటీవల భారతి, ఆంధ్ర వారపత్రిక, కృష్ణాపత్రిక, వీణ మొదలైన పత్రికల్లో ఇతని అనువాదాలు ప్రచురింబడడం ముదావహం. స్వతంత్రరచనకుకూడా ఇతనిరచనలు నమూనాలుగా ఉండదగిన లోగడ 'భారతి'లో శ్రీశివశంకరశాస్త్రి ఒకటిరెండుకథలు అనువదించారు. ఇంకా పలువురు హిందీనేర్చిన యువకులు తెలు పత్రికలలో తరుచు ప్రేమచంద్‌రచనల వాదాలు ప్రకటించడం ప్రేమచంద్ ర ప్రతిభ ఆంధ్రులకు తెలియడానికి తోడ్ తుంది. ఇట్టిప్రయత్నాలు అంతరాష్ట్రీ భాషాసారస్వతాభివృద్ధికి దోహదం క వని ఈ వ్యాసరచయితవిశ్వాసం.

---

# ఆ ర్త నా ద ము

శ్రీ గుఱ్ఱం వేంకట సుబ్రహ్మణ్యము

ఏల, యింక జాలు డాగుడుమూత బాల
అలసి లావెల్ల దఱిగి శోషిలెడువాఁడ
అడుగులుడుకెత్తు, సర్వేంద్రియములుసుడియు
కనలి కంపిలుఁ జివురల్లు కాయమెల్ల
ఒక్కలఘుపాత, యింక లేచు టుండఁబోదు
క్షణ ముపేక్ష నిరుక్త సంశయము నాకు.
వినియు నాదైన్యగీతి దీనిని స్వయంబ
సీమయింగు పిడి పరుగెత్తి నెనరుమీఱ

వ్రాలుసన్నట్టి కయిసత్తి, ప్రాపొసంగి
పోలుచు సాన్నిధ్యరోచిస్సు మొలకనవ్వు
తోడ నన్నుఁ దేర్చి, పెక్కలల తోడుతో
నీవ కరఁగి నావశమయి నీప్రసాద
మునను మూర్ధాభిషేకభాజను నొనర్చి
మిగులఁ గరుణింపవేని నే మిగులఁబోన
ఇపుడ యిప్పుడ రావలె నింక నెపుడు!
గతియొ యగతియొ యిదియె నిశ్చితము నా

---

# ఇంటి దొంగ

డాక్టర్ అయ్యగారి వీరభద్రరావు

## మొదటి రంగం

[పద్మనాభంగారి యిల్లు. సావిట్లో పద్మనాభంగారూ, భార్య రామాయమ్మగారూ విచారంగా మాటాడుతూంటారు.]

పద్మ — (విసుగ్గా) కాని, ఇంత అజాగర్త ఉండకూడదు మనుష్యులకి. అబ్బే! ఎన్నిమాట్లు చెప్పితే నేంలాభం. పెట్టె తీసి పెట్లో వేసిందాకా ఓపిక లేకపోతే ఎలా అఘోరిస్తుంది. ఏదో పోనీ రూపాయో అర్ధో వస్తువు కనక నా.

రామా — లేదండీ. బాగా జ్ఞాపకం — అలమారులో పెట్టి తలుపు తాళంవేశానుకూడాను రాత్రి. ఏమిటో పని చేసుకొచ్చేసరికి బద్ధకంవేసింది. ఇప్పుడు దుద్దులు పెట్టుకోవాలా అని మాట్లాడకుండా పడుకున్నాను. పొద్దున్నే పనితొందరని చూడలేనేలేదు. వెండిపళ్లాలు కుర్రాణ్ణి తెమ్మన్నాను. తరవాత తలుపు మళ్లీ తాళం వెయ్యలేదు కాబోలు.

పద్మ — ఊఁ – నీజాగర్త యింత బాగుందీ – కుర్రకుంక తాళం వెయ్యలేదని వాణ్ణి అంటావు. కాకా, యీఆడవాళ్లపని ఎప్పుడూ యింతే. కొన్నదాకా మాత్రం ప్రాణాలు తీసేస్తారు. జాగర్త పెట్టుకోవడాలు తెలియవు. మనవ్వే కక్కుర్తివే కాదు, వెనకటికి మావదినా అంతే. కాలిపట్టాసీల ఊడిపోతూవుంటే ఎవరన్నా చూసి చెప్పాలి. పని మించిపోతుంటె, అపట్టా గొలుసు కాస్తా పెట్లో పడేసేలోపుగా. అది తీసి దాచడం నావంతు.

రామా — దాచమని ఎవరు చెప్పారు, మళ్లీ దప్పు… వెవరన్నారు? పోనీ దాచకపోతే మానెం… లేకపోయారు.

పద్మ — అవును, అవును. అల్లాగే. మీకే… ఊరుకోవలసిందే. మళ్లీ మర్నాడు కొనిత… ల్సిందేగా. ఇప్పుడు నీకు మళ్లీ దుద్దులజత … మాడొద్దూ.

రామా — నాకేం మీరు కొనిపెట్టక్కరలేదు. మా… ళ్లిచ్చిన డబ్బుతో కొన్నారుకాని మీవి చే… గాదు. పోనీ నాచెవులు బోడిగా ఉం… మరి నా కేలోటు రాదు.

పద్మ — (కఠినంగా) దురభిమానం దురహంకార… పారేసుకున్నదే కాకుండా యింకా మాట్లా… తావు … మాటకి మాట. వస్తువు తీసినప్పు… మళ్లీ పెట్లో పెట్టుకోవాలని జ్ఞానముండక్క… ఇష్టమొచ్చినట్టు అక్కడా యిక్కడా పా… యింకా ఏమన్నా అంటే ఎగిసిపడిపోతావు…

రామా — (గద్గదకంఠంతో) అవును మరి లేకపో… యేమిటి. పారెయ్యాలని పారేశానా ఏమి… ఊరికేను. అసలే శుభ్రమైన దుద్దులు … యీరాయే పక్కరవారప్పాటా అని నేను … చస్తూ ఉంటేను – అడ్డమైనమాటలూ అం… ఎలా వుంటుం దేమిటి. నే నేం అ… గర్తచేశాను. తలంటి నీళ్లు పోసుకునేటప్పు… తీసి మళ్లీ పెట్టుకుందామనిదా అని … మారులో పెట్టి తాళంకూడా వేశానాయ… ఇంకులో ఏమిటి నా అజాగర్త. (కళ్ల నీళ్లు… కుంటుంది.)

* ఆల్ ఇండియా రేడియో, మద్రాస్ వారు బ్రాడ్ కాస్ట్ చేసిన నాటిక ఇది.

్మ — మొదలు నీలకంఠాయస్వాహా ... ఏమన్నా అంటే...ఊఁ. సరే. అలమారంతా వెతికావూ? తెల్లారలేదు. ఈలోపుగా ఎవరొచ్చారు తియ్యడానికి. చాకలాడు కన్నమ్మ తప్పితే యింకెవరు యింటికి రాలేదు — ఊఁ - ఏమిటి తమాషాగా ఉందే. అవునుగాని కన్నమ్మ నడిగావూ. పాపం అది అలాంటిది కాదు. కాని,

మా — రామ రామా. ఇన్నాళ్లనించి మనింటో పనిచేస్తోంది. దానిదగ్గర అలాంటిగుణం ఏమీ లేదండీ. పాపం చాకలిమాత్రం, ఛా ఛా అలా అనుకుంటేకూడా తప్పు. వాళ్లు తియ్యలేదండీ.

్మ — ఏమో! ఏకాలానికి ఏంబుద్ధి పుడుతుందో. కాస్తా కూస్తా సొమ్ము కాదాయను. ౫౦౦ పై చిల్లరయింది జత. ఊఁ ... సరే మనంచెయ్యవలసింది చేశాం. నాయుడుగారికి కబురుచేశాను రమ్మని. ఇంక హడావిడి, విచారణ...

మా — అదేమిటి పోలీసుకి కబురు చేశారా ఏమిటి. పాపం కన్నమ్మని నానాతిప్పలు పెట్టేస్తారు, పాపం వెర్రిముండ ... కన్నమ్మా ...

న్న — (దూరాన్నించి) అమ్మా .. (ప్రవేశించి) దుద్దులు దొరికాయాండి అమ్మగారండీ ...

మా — లేదే. ఇం కేమిటి దొరికేది. ఎవర్లో కాజేశారు నిక్షేపంవంటి జత. (మెల్లిగా) చూడు కన్నమ్మా! నిజం చెప్పు, ఇంతవరకు నీమీద నా కెప్పుడు అపనమ్మకం కలగలేదు. నువ్వుకాక ఇం కెవ్వరూ యింట్లో లేరుకదా...

న్న — నాకు తెల్దుం డమ్మగారండి! సత్తెప్రమాణికంగా చెపుతుండాండి అమ్మగారు.

్మ — నిజం చెప్పు. తీస్తే యిచ్చెయ్యి. నువ్వు ఎప్పుడూ యిలాంటి పాడుపని చెయ్యలేదు. ఏముంది, ఎప్పుడు ఎలాంటి బుద్ధి పుట్టుతుందో. నిజం చెప్పావంటే నిన్నేం చెయ్యను.

న్న — (భయంతో) నిజంగా నేనండి బాబయ్యా. నే తియ్యలేదుండి. నే సచ్చినంతొట్టండి. అబద్ద మాడితే పుచ్చిపురుగులోడిపోతానండి. పైన బగమంతుడు సాచ్చి బాబయ్యా! నాకు తెల్దుండి.

చాక — బాబూ ఇనస్పెట్రుగొరొచ్చిన్రండి.

పద్మ — ఆఁ. ఒస్తున్నా ...

కన్న — (కళ్లనీళ్లతో) మీకు దణ్ణమెడతానం డమ్మగారండీ. నే నే మెరగనండి అబ్బాయిగార్ని అడగండి. నే నాగది తుడిసెల్లిపోయానండి. (ఏడ్పు). యిన్నాల్నుం చున్నానుగందాండి, ఎప్పుడేనా ఒక్కానిసబ్బు ఎత్తుకెల్లానాండి?

రామా — అది కాదే మరీ... యింటి కెవ్వరూ రాలేదాయను. ఎవ్వరూ తియ్యకపోతే ఎక్కడికి పోతుంది మాయం కాదుగదా. నువ్వు తియ్యవని నాకు తెలుసును. పెద్దవస్తువు- ౫ వందలు పోసి కొన్నామాయను. ఏ ముహూర్తాన్ని కొన్నామోకాని, పట్టుమని ఏడాదిపాటయినా పెట్టుకోలేదు. కాకా, పెట్టుకొనే అదృష్టం ఉండాలి.

కన్న — నన్ను కోట్లో పారెత్తారాండి? అబద్ద మాడనండి. నే తియ్యలేదం డమ్మగారండి... యియ్యాల పొద్దుటా లేసి యారి మొకం సూశానో నారాయణమూర్తి తండ్రీ! అనుమానం నామీదే ఉంటాదండి. యింట్లో కెవరూ రాలేదుకదాండి, ఏమోనమ్మా ఆపాపం పున్నెం ఆబగమంతుడికి తెలుసునమ్మా!

(లోపలినుంచి: కన్నమ్మా!)

పోలీసోరు చంపేత్తారు... ఆఁ, ఒస్తున్నా బాబయ్యా!

రామా — పాపం అమాయకపుముండ.

## రెండవ రంగం

[పద్మనాభంగారి కచేరీ సావిడి. పద్మనాభంగారు, యినస్పెక్టరు నాయుడుగారు కుర్చీల్లో కూర్చుని ఉంటారు. కానిస్టేబుల్ కొంచెం పక్కగా నుంచునిఉంటాడు. ఇనస్పెక్టరుగారి

చేతులో ఒకచిన్న నోటుబుక్కు. చేతులో పెన్సిలు. పీధులో ఎవరో ఒకరిద్దరు కిటికీలోంచి తొంగిచూస్తూ ఉంటారు.]

పద్మ — పాపం అది అలాంటిది కాదండి. నాలుగేళ్ల నుంచి మాయింట్లో పనిచేస్తోంది. ఎప్పుడూ ... నిజంగా యింటోమనిషికన్నా చాలా యిదిగా ఉంటుంది.

నాయు— మీకు తెలియదు పంతులుగారూ! ఈవెగ వలు — అంతా నటన — సమయం దొరికితే సరి.

కన్న — (వచ్చి) దణ్ణాలండి బాబయ్యా!

కనిస్టే — (కఠినంగా) అక్కడ నుంచో. నీపేరు ?

కన్న — కన్నమ్మ బాబూ!

కని — (యినస్పెక్టరుగారితో) కన్నమ్మండి. (కన్నమ్మతో) నీ దేవూరు?

కన్న — మాఅయ్యవోళ్లు సిన్నప్పట్నించీ ఉండేది పోలిపాడు బాబయ్యా - నేను మాపిన్నమ్మగారింటో పెరిగానండి.

కని — ఏవూరు?

నాయు — అక్కరలేదు. (వెల్లిగా) ఈవూళ్లో ఎన్నాళ్లనుంచి ఉన్నావు?

కన్న — బాబయ్యా!

కని — (గట్టిగా) నువ్వు ఈవూళ్లో ఎన్నాళ్లనించి ఉన్నావు?

కన్న — మాపిన్నమ్మపెనిమిటి సచ్చిపోయినకాడి నుంచీనండి.

కని — ఎన్నేళ్లనుంచి?

కన్న — ఆరేళ్లయిందండి.

కని — మీయిల్లెక్కడ?

కన్న—సాలిపేటలో బాబయ్యా! ఆపింత సెట్టుప్రక్క సందులో రెండిళ్లుకాక మూడోయిల్లుబాబయ్యా!

నాయు— ఈవూ రొచ్చినతరవాత ఏఏయిళ్లల్లో పని చేశావు?

కన్న — ఈవూరు రాంగానే పనేం దొరకలే బాబయ్యా! సున్నంమోతలో చేరామండి. కా ఆ డాక్టేరోజు లుండలేదుండి. ఆమెంగోళ్ల పనిసెయ్యడం, అళ్ల యాలాకోలాలు సూస్తే కేటో బాగులేదు బాబయ్యా! మానేశాను. ఆ రాగంలో బామ్మర్లింటో యంకమ్మగారం ఆరింటో యేడాదిపా టున్నానండి. ఈయిం కొచ్చేముంద రాన్నెల్లు పనిలేదండి బాబయ్యా

నాయు— వారింట్లో ఎందుకు మానేశావు?

కన్న — ఆరింటో ఉండ బుద్దెయ్యలేదండి. పనం పని సెయ్యించుకోవాలెగానండి—మాటలు రానిచ్చేవోరండి. గతిలేక యిలా గొచ్చాగానం మాదీ పెద్ద కుటుంబమండి. అంతా చితికిపోయి రండి. మాయయ్య మాయమ్మ అమ్మోర్లో సచ్చిపోయారుండి.

అయినా కొన్నాలు నేశానండి ఆరింటో ఓరోజున ఆరింటో ఏదో సిన్నెండిగిన్నె పోయి దని నా నాగిడవ నేశారండి. నే తీశానని నా తిట్లు తిట్టారండి. కావలిస్తే జీతంలో పట్టు మన్నానండి అంతే అనుమానముంటె, కా మాట లొద్దన్నానండి. కోపం ఒచ్చి జీత మి కుండా తగిలేశారండి.

కనిస్టే — ఇంకేం ఇదివర కోమాటు అయిందీ?

కన్న — గిన్నె దొరికింది బాబయ్యా! తరవాత. అ బ్బాయిగారే తీసి దాచారండి (వెల్లిగా) పే టకి డబ్బు బాకీ వుండి యారికాడో పెట్టార టండి. నాకు మాత్రం జీతం యివ్వలే బాబయ్యా! పోనీ బాబయ్యా! ఆబగమంతుడ లేడాండి.

కని — అయితే ఈ వస్తువుమా టేమిటి?

కన్న — అదేమో బాబయ్యా! నాకు తెల్దండి.

కనిస్టే — నీకు కాకపోతే ఎవరికి తెలుస్తుంది. యింట్లో నువ్వు కాకపోతే ఎవ రున్నారు?

కన్న —ఎవరూలేరు బాబయ్యా ! కాని నే తియ్య దుండి. పాపం పున్నెం ఆ బగమంతుడి తెలుసు బాబయ్యా!

నాయు — (కోపంగా) భగవంతుడు గిగవంతుడు కాదు. నిజం చెప్పు. అబద్దమాడితే నాలిక చీరేస్తాను.

కన్న — (ఏడుస్తు) లేదు బాబయ్యా! నాను తియ్య లేదండి.

నాయు — ఆ గది తుడిచావా పొద్దున్న?

కన్న — తుడిచాను బాబయ్యా!

నాయు — ఎవ రున్నా రక్కడ అప్పుడు?

కన్న — ఎవరూ లేరండి. తుడిచెయ్యడం అయాక, అబ్బాయిగోరు ఎండిపళ్లాలకోసరం అలుమారు తీశారు బాబయ్యా!

నాయు — తరవాత మళ్లీ అలమారుదగ్గిరకి ఎందుకు వెళ్లావు నువ్వు?

కన్న — నే ఎల్లలేదు బాబయ్యా!

నాయు — (కఠినంగా) వెళ్లావు. వెళ్లి తలుపు తీశావు. ఏకో కొంనువ మూటకట్టావు. నిజం చెప్పు?

కన్న — రామ రామ. పత్తెప్పమానికంగా నే నెల్లలేదు బాబయ్యా! ... ఆగది తుడిశాక కూరల కెల్ల మంటే బజారు కెల్లి వొచ్చాను బాబయ్యా! మల్లొచ్చే తలికి ... అమ్మగారు బుద్దులకోసం వెలుకు తున్నారు బాబయ్యా!

నాయు — ఇంకేం మరి. బుద్దులు జేరేశావు. (గట్టిగా) ఏమోయ్ కానిస్టేబిల్ దీనిల్లంతా సోదాచే యిందు. అదుకోటంవాడినిక్కూడా రిమాండులో పెట్టు, చెపుతా వీళ్లకి యిలా కాదు. కొరడా దెబ్బలు తగిలేటప్పుడుకాని దారిలోకి రారు.

కన్న — (ఏడుస్తూ) నే నే మెరగనండి బాబయ్యా! ఇన్నాళ్లయి ఈరింటో ఉన్నాను బాబయ్యా! ఒక్కానిడబ్బైనా పోయిందాండి. కూటికిలేక చేరి యిల్లాంటిపనులు చేత్తానా బాబయ్యా!

పద్మ — పాపం యి దెప్పుడూ అలాంటిపనులు చెయ్యలేదండి. చాలా నమ్మకంగానే వుంది పాపం.

నాయు — మీకు తెలియదు సార్! ఈ వెధవలంతా యింతే. నెమ్మదిగా అడుగుతే లాభం లేదు. నిలుచోబెట్టి చర్మం వొలిపించెయ్యాలి. జాలి తలిస్తే లాభం లేదు.

కన్న — నాకు తెల్దు బాబయ్యా! అబద్దమాడితే నేను పుచ్చి పురుగులోడిపోనా బాబయ్యా! నే నెరుగనండి. పాపం పున్నెం బగమంతు డున్నాడు బాబయ్యా! (ఏడ్చును.)

నాయు — ఛా! నోరు ముయ్యి. దొంగేడుపులు ఏడుస్తావు. పో అవతలకి. కానిస్టేబిల్! దీన్ని తీసుకుపోయి, లాకప్‌లో ఉంచు సాయంత్రం దాకా. అప్పుడు చెపుతా.

కన్న — రచ్చించండి బాబయ్యా! నే తి య్యలేదండి.

కని — చుప్ పద. మొట్టమొదట అడిగినప్పుడే యిచ్చేసుంటే.

కన్న — నాకు తెల్దు బాబయ్యా! (కానిస్టేబులతో కన్నమ్మ బయటికి వెళ్లిపోతుంది.)

పద్మ — అది తియ్యలేదండి పాపం. చాలా నమ్మకమైన మనిషి.

నాయు — (అనుమానంగా) అది తియ్యకపోతే ఏమయి నట్టు. మీచాకలి ఎన్నిగంటలకి వచ్చాడు. చాకలీ...

చాక — (ప్రవేశించి) చిత్తం బాబయ్యా!

నాయు — నువ్వు పని కెన్నిగంటల కొచ్చావు?

చాక — ఎనిమిదిగంట లవుద్దండి.

నాయు — నువ్వు వచ్చేటప్పటికి ఏం చేస్తున్నారు?

చాక — అమ్మగారు అయ్యగారు అంతా ఇంగారు పడుతుండారండి. రాంగానే అబ్బాయిగారు సెప్పారండి, అమ్మగారిబుద్దులు పోయాయని. అప్పుడిల్లంతా వెతికామండి.

నాయు — కన్నమ్మ రోడ్డుమీద నీతో ఏమిటి మాట్లాడింది?

చాక — (ఆశ్చర్యంగా) ఎప్పుడండి?

నాయు — పొద్దున్న, నువ్వు యిక్కడికి కొస్తూంటే.

చాక — నాను సూడందేనండి కన్నమ్మని రోడ్డుమీద.

నాయు —సరే, పో. సాయంత్రం స్టేషనుకిరా ౫గంటలకి.

చాక —(అవమానిస్తూ) నే నెందుకండి బాబయ్యా!

నాయు —(చిరాకుగా) పో. అయిదుగంటలకి స్టేషనుకి రా.

చాక — చిత్తం బాబయ్యా! ఒత్తానండి.

నాయు — పంతులుగారూ! శలవు. మళ్లీ సాయంత్రం కలుసుకుంటాంగా. చాలా తమాషాగా ఉందండి ఈ కేసు.

పద్మ — పాపం కన్నమ్మ తియ్యలేదండి, ఎలా పోయిందో నే చెప్పలేనుకాని ...చాలా బాధ పడిపోతుంది పాపం. చాలా అభిమానస్తురాలు.

నాయు — చూద్దాం. శలవు.

రామా —(తలుపుచాటునించి బయటికొచ్చి, ఆత్రంగా) ఏమండీ! ఏమంటారు నాయుడుగారు?

పద్మ —ఏమో. ఏమీ తెలియదు. ఆశ్చర్యంగా ఉంది.

## ౩-వ రంగం

[పద్మనాభంగారి యిల్లు. వంటింట్లో టీ కలుపుతూంటుంది రామాయమ్మ. పద్మనాభంగారు డ్రెస్సు వేసుకుని లోపలి కొస్తాడు.]

పద్మ — రైట్ మయింది. ౫ గంటలకి స్టేషన్‌కి ఒస్తానన్నాను. కాస్త టీ కలిపి యియ్యి.

రామా — పాపం కన్నమ్మని వాళ్లేం బాధపెట్టకుండా చూడండీ. పోనీ వస్తువు పోతే పోయింది. పాపం అంత మంచిమనిషిని అనుమానిస్తే పాపంకూడాను.

పద్మ —నాకేం అర్థంకావడం లేదు. ఎలా పోయింది యిది.

రామా —(టీ కలుపుతూ) ఇన్నాళ్లనించి చేస్తోంది ఒక్క దొంగతనంకాని వెధవతనంకాని ఏమీ లేదు. ఎంత మర్యాద! నాలుగేళ్లయింది. పరాయివెగా ఖైవరేనా వస్తే . . తలవంచుకుని వంటినిండా బట్టతీసుకు మరీ ఎదరబడుతుంది. అదేనా అవుసరం వుంటేనే. నిజంగా మనింట్లో అజాగ్రత్తకి అది కాబట్టిగాని.

పద్మ — ఆమాటే నీవంటే కోపమొస్తుంది. ఏగూట్లో చూసినా డబ్బులే. ఏగట్టుమీద చూసినా డబ్బులే . . .

రామా — ఏమన్నా పోయాయా యిన్నాళ్లూ ? . .

పద్మ —(ఆశ్చర్యంగా) అన్నట్టు నీముక్కుపుడకేదీ? అ దెక్కడ పారేశావు? ఏకిటికీలోనో –

రామా —(విసుగ్గా) యింతోటి ముక్కుపుడకా ఎక్కడికీ పోదు. ౫, ౬ వందల ఖరీదుపోయింది. పదిరూపాయల ముక్కుపుడక ...

పద్మ —పారేయ్! అదికూడా ... దుద్దులతో పాటే.

రామా — ఏం పారెయ్యలేదు. అలాంటేనే ఊరికేను. సీల ఒదులయిపోయిందని అలమారులో పెట్టి తాళంవేసి యిదిగో తాళాలు వెండిని పెట్టుకు తిరుగుతున్నాను.

పద్మ — తాళం వేశావా? అసలు.. చాకలీ ... అబ్బాయ్ ...

చాక —(దూరాన్నుంచి) బాబయ్యా!

పద్మ — చూడు అలమారుతాళం వేసుందో లేదో.

రామా — అంత అనుమానంఅయితే ఎలాగండీ. నాకు మాత్రం అంత ఒళ్లు తెలియదా ఏమిటి.

[దూరాన: హోయిహోయి హోయిహోయి అనికేకలు]

పద్మ — అదేమిటిరా ?

చాక —(పరుగెత్తుకొచ్చి) బాబుగారండీ! అమ్మగారి ముక్కుపుడక చీమ' లెత్తుకెల్తున్నాయండి. చూడండి బాబయ్యా!

పద్మ —ఏదీచావు ...

చాక — లేదు బాబయ్యా! అబ్బాయిగోరు మాస్తున్నారండి అక్కడ - గాజుతలుపుల అలమారులో.

[అంతా గదిలోకి పరిగెడతారు. గాజుతలుపుల అలమారు. అందులో చిల్లర వస్తువు లుంటాయి. గోడమీద ౧౦ అంగుళాల ఎత్తున

చిన్న చీమలు ముక్కు పుడక ఎత్తుకుపోతూం టాయి. ఒకపాతిక చీమల కుంటాయి. అంతా ఆశ్చర్యంగా చూస్తారు.]

పద్మ — తమాషాగా ఉందే. అరెరె. గోడమీదించి పాకుతూ తీసుకుపోతున్నాయే.

రామా — చిన్న చీమలు ఎన్ని ఉన్నాయో. అన్నీ కలిసి మోసుకుపోతున్నాయి. వాటికి ఇ దెందుకు చెప్మా.

పద్మ — ఎందు కేమిటి. వంటిని ఉన్నది కాబట్టి ఆవాస నకి............

చాక —దుద్దులుకూడా సీమ లే............

పద్మ—అవునవును. చీమలు కాకపో తే ఎలకలు. మొన్న ఎలకకన్నంకూడా చూశామ. అలమారులో ఈ మూల చాకలీ వెతుకు.

[కప్పులు, సాసర్లు తీసి అలమారులో మూల ఉన్న ఎలకకన్నం తవ్వతాడు.]

రామా — (ఒక్కగంతేసి) అవుగో దుద్దులు. అవుగో దుద్దులు - తళతళలాడుతో - ఎలక్కన్నంలో.

పద్మ — ఏపీ, ఏపీ! రామ! రామ! ఇంక చీమలూ, ఎలకలూకూడా దొంగతనాలు చేస్తే యింక చెప్పే దేమిటి.

రామా —(ఆత్రంగా) చాకలీ! పాపం స్టేషనుకుపోయి చెప్పరా దుద్దులు దొరకాయని. పాపం కన్న య్యని ఏడిపించి పారేస్తారు వెళ్లు, ఇది మేం తీసు కుంటాంలే.

పద్మ — వెళ్లు ముందు వెళ్లు.

చాక — చిత్తం బాబయ్యా! (నిష్క్ర.)

[దుద్దులజత దొరికింది. ఆ జత చేతులో పెట్టుకు కళ్ల నీళ్లెట్టుకుంటుంది రామాయమ్మ.]

రామా — పాపం కన్నయ్య తియ్యలేదని చెప్పలే. అది ఎంత బాధపడింనో. దాని కేదేనా, పాపం ముట్టచెప్పాలండి. రేపు పండుక్కి ఖర్చైన చీర తెచ్చి పెట్టండి పాపం.

పద్మ — మాశావా ఆనుమానం ఎలా వెళ్లకుంనో. చీమలు ఎలకలు దొంగ లేమిటి......యింటి దొంగని యీశ్వరుడైనా పట్టలే రన్నారు. ఇంటి దొంగలే యివికూడానా ?

రామా —(వేళాకోళంగా) మాశారా నాముక్కు పుడక మళ్లీ అలమారులో పెట్టకపోతే యిది తెలిశేదా?

పద్మ —(ఉక్రోషంతో) చాల్లే నీ తెలివి తేటలకి సం తోషించాము.

రామా — (మొహం అటు తిప్పి) టీ చల్లారిపోతోంది.

పద్మ — చిత్తం.........



# 'లిరికల్ పొయెట్రి'*

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

అన్నివిషయములందువలెనే సారస్వత శాఖావిభాగములోకూడ పాశ్చాత్యుల విభాగవైఖరి వేరు. బాహిరకవిత్వము ఆంతర కవిత్వము (Objective and subjective poetry) అన్నది మనదేశములో పుట్టిన మాట కాదు. వాళ్ల ఆంతరకవిత్వములో Lyrical poetry ఒకభాగము. ఈశబ్దవ్యుత్పత్తికి దాని స్వరూపలక్షణాలకు ఏమీ సంబంధం లేదు. ఆంధ్రభాషలో ఈ కవిత్వాన్ని గురించి చెప్పవలెనంటే, ఇక్కడ ఆవిభాగమే లేదు. కనుక ఇంగ్లీషు కవిత్వంలో ఈపేరుతో చెప్పకోబడే కవిత్వంయొక్క లక్షణాలవంటి లక్షణాలు కలిగిన మనసారస్వతభాగాలు తీసి అవి Lyrical poetry అని చెప్పవలె. ఆంగ్లేయ సారస్వత విమర్శలోకూడా ఈకవిత్వంయొక్క స్వరూపం ఇది యని నిశ్చయముగా సూత్రించి చేసిన ఫణితి లేదు. మృదువులైన శబ్దములు కొన్ని చోట్ల కూర్చినచో అది Lyrical కవిత్వమనవచ్చును. కవి తన అనుభవమును గూర్చి వ్రాసినది యీ కవిత్వమని అందురు. కాని కవి యెవ్వడైనను తనయనుభవమునే వ్రాయును. కనుక కవిత్వ మంతయు కవియనుభవమే యైనప్పుడు ఇట్టివిభాగము తదనుభవవైలక్షణ్యాన్నిపట్టి ఏర్పడుతుందికదా! వర్ణనలు, కథ మొదలైన వానికంటె భిన్నమైనది కవియొక్క మానసికమైన ఇతరములైన శక్తులను గూర్చి చెప్పునది ఇట్టికవిత్వ మనవచ్చును. కాని యాంగ్లేయభాషలో వస్తువివక్షత లేకుండనే ఒకవైలక్షణ్యము కలిగిన సర్వకవిత్వమును Lyrical poetry అని చెప్పుదురు. ఈ వైలక్షణ్యము సహృదయహృదయవేద్యమేకాని ఇదమిత్థమని చెప్పుటకు వీలులేదు. ప్రధానముగా కవి భావగీతములచేత నైననుసరే కథాకవిత్వమునందైననుసరే తన ఆధ్యాత్మికములైన వ్యక్తిగతానుభవములు సూచించెనేని అది Lyrical కవిత్వ మనవచ్చును. తెలుగులో భావకవిత్వ మనుమాట పుట్టినది. కొన్ని విషయములలో ఈ శబ్దమును Lyrical poetryకి పర్యాయపదముగా వాడవచ్చును.

సామాన్యముగా నీ భావకవిత్వము తాదృగవస్థానుభూతికలవానినే రంజించును. జనబాహుళ్యమును రంజించదనే చెప్పుదురు. కవిత్వములో రంజన రెండు భాగములుగా నుండును. కూర్చిన శబ్దముల అర్థసన్నివేశముల మనోహరత్వము తెలిసికొనుటవలన కలిగేరంజన యొకటి. అందలి భావముయొక్క మనోజ్ఞత్వము తెలిసికొనుటలోని రంజన యొకటి. మనస్సును వాక్కును సమదశాప్రాప్తి పొందిన కవికి యీ రెంటికి భేదము లేదు. వాఙ్మనోవిషయముల సరిగా నటువంటి పరిపాకము పొందిన పాఠకునకును

* ఆల్ ఇండియా రేడియో, మద్రాస్ వారి అనుమతిని.

ఆరచన అంత యానందము నిచ్చును. కవిలో నున్న భిన్నశక్తులు సమానావస్థ పొందుట యరుదు. పాఠకునిలోకూడ నట్లే. సామాన్యునకు స్థూలమైన భావ మర్థమగును. స్థూలమానవదృష్టికి సహజమైన సుఖదుఃఖాదులు కష్టసుఖములు కవియొక్క శబ్దజాలము తెలియకపోయినను అర్థము చెప్పినప్పుడు సులభగమ్యములై అందఱు నానందింతురు. ఇట్టి సుఖదుఃఖాదులకన్న భిన్నమైనది శాస్త్ర విషయము. శాస్త్రబుద్ధి లేనిచో నధికభావము స్ఫురించదు. శాస్త్ర మనగా విషయపరిశీలనము. ఇవి గ్రహించుటకు అధికమైన మనశ్శక్తి కావలయును. కవి తనకు సహజమైన ఒక ఆధ్యాత్మిక, లేదా, నైతిక అనుభవమును చెప్పును. ఈ అనుభవము సర్వమానవులకు కలుగదు. అట్టి యనుభవము జీవితములో పొందినవాడో మనసా అనుభవించినవాడో వా రిద్దరే ఆనందించగల్గుదురు. ఎంత అనుభవమైనను ప్రత్యక్షముగానే యనుభవించ నక్కర లేదు. మనస్సుచేత నాలోచించి యనుభవములోనికి తెచ్చుకొనవచ్చును. సర్వమును ప్రత్యక్షముగానే యనుభవింపవలెనన్న ఈ లోకమునందలి పరిస్థితులు చాలవు. మన జీవితములు చాలవు. అందుచేత సర్వానుభవములు మనసుచేత నధిగమించుట భావుకుడు చేయవలసిన పని. కవిత్వము భావుకుడైనవా డనుభవించగలడు. భిన్నకవితానుభవవిషయములలో భిన్నభావుకత్వము సమకూడుచున్నది. అందుచేత భావకవిత్వముచేత రంజిల్లు మనుష్యుడు ప్రత్యేకముగా నున్నాడు. ఈ భావకవిత్వముకూడ బహువిధములైనది. భావకవిత్వ మనగా వ్యక్తిగతానుభవమునుగూర్చి చెప్పునది యనునుద్దేశ్యముతో చెప్పుచున్నాను. మన శతకములు, స్తోత్రములు, చాటువులు మొదలైన వన్నియు భావకవిత్వముక్రిందికి వచ్చును. ఇవికాక భారతములోని గోపికాగీతికలు, భ్రమరగీతలు, మఱి యెన్నో ఘట్టాలు భావకవిత్వము క్రిందికి వచ్చును. కాని వీనియన్నింటిలోనను కల యనుభవవిశేషములు భిన్నములుగా నుండును. పోతన్నగారు తన హృదయగతమైన భక్తిని గోపికలయం దారోపించి వ్రాసినా డనుటకు సందేహము లేదు. ఈఘట్టమే సంస్కృత భాగవతములో చదువుచుండగా భావకవిత్వము చదివిన ట్లుండదు. శాస్త్ర విషయము చదువుచున్న ట్లుండును. కవి, తాను వ్రాయుచున్నదానియందు తన్మయీభూతుడైనచో అతడు వాడుశబ్దములు పాఠకునకు తన్మయీభవనయోగ్యతాప్రాప్తి గలుగజేయును. ఇటువంటి ప్రాప్తి కలిగించు భావమును శబ్దమును సమకూడినప్పుడు దానిని భావకవిత్వ మందురు. పాఠకుడు తన్ను దా విస్మరించుకొని తాను కూడ తత్పద్యగతానుభవ సన్నిధత్త మనస్కుడైనచో, అది భావకవిత్వము. మఱి ఇవి సర్వకవిత్వములకు లక్షణముగదా యని యనవచ్చును. లక్షణమే కాని, అనుభవములో విశేషమున్నది. ఒక వైలక్షణ్య మున్నది. రాముడు రావణునితో యుద్ధము చేయుట వర్ణితమైయున్నది. ద్రౌపది తన భంగపాటు కృష్ణునితో చెప్పుట యున్నది. కవి యీఘట్టము లెంత రమ్యముగా వ్రాసినను పాఠకుని హృదయములో కలుగు ననుభవవిశేష మెట్టిదనగా అది ఇతరు లనుభవించు సుఖదుఃఖములయందు తాను తాదాత్మ్యము కలి

గించుకొనుటకు ప్రయత్నించుచున్నది. కాని గోపికాగీతలు చదువునప్పటి యనుభవ విశేషమెట్టిది ? అది గోపికలు భగవంతుని కోసము చేయువిలాపమువలె గాక పాఠకుడు తనయంతట దాను గోపికలలో లీనుడై గోపిక యొకటి తాను ఒకటి యను రెండు పదార్థములే లేకుండపోయి ఒకటే స్వరూపము గోచరించి తానే భగవంతుని కొఱకు అంగలార్చుచున్నట్లు అనుభవించును. ఇది భావకవితానుభవ వైలక్షణ్యము. సరే కాని ఈ భేదము కవితావస్తువునందే యున్నది అని యనవచ్చును. మేమును దాని నంగీకరింతుము. అందుకనియే ఆంతర బాహిరభేదములచేత కవితావిభాగముల చేసినది. బహిర్విషయముల నాశ్రయించి కలిగిన యూహల పద్ధతి వేఱు. అంతర్విషయముల నాశ్రయించి వచ్చెడు పద్ధతి వేఱు. అంతర్విషయగ్రహణము కష్టము. అందుకనియే అంతర్విషయములు వస్తువుగా తీసికొన్న కవితానుభవము కష్టమైనది. అది కొద్దిమందికే తెలియును.

అని సర్వభావకవిత్వము సర్వనిషేవ్యము కాదనిలేదు. భావకవిత్వము ఒక్కొప్పుడు బహిర్విషయోపాధికమై యుండును. స్తోత్రములలో నెక్కువ భాగము దేవాదుల విభూతి వైభవములు సౌందర్యవిశేషములు సామాన్య భక్తిభావములు వర్ణించబడును. ఇవి యందఱకును దెలియును. కాని అవి చదివి పొందు నానందములో కూడ నొక వైలక్షణ్య ముండును. పాఠకునకు ఆ దేవతయందు ప్రీతి, కవి పోయిన ఆ పోకడలయందు మనస్సు అనుకూలించుట ఇవి లేకుండ ఆస్తోత్రములును రుచింపవు.

రుచించిన తరువాత అతడు ఇతరము
కథలు, కథానకములు విని, చదివి పొ
ఆనందమునకు ఈ స్తోత్రములు చ
పొందు నానందమునకు భేద ముండ
ఇతరకవిత్వము చదివి పొందు ఆనం
లో మనస్సు బహిర్ముఖముగా నుండు
భావకవిత్వము చదివి పొందు నానందము
మనస్సు అంతర్ముఖముగా నుండును.
ములు కూడ నిట్టులే. ఒక నీతియో
దేవతా వైభవమో, ఒక లోకస్వభావ
వానియందు వర్ణితములై అప్పుడు
యానందము కల్గించును. ఉత్తమమైన
కవిత్వము స్థూలముగా చూచినచో
యందు వస్తువు లేనట్లు కనిపించును. ఒక నా
కుడు — నాయికయో ప్రతినాయకుడో
రును కన్పించరు. కవియొక్క ఒక అవి
వాంఛాంకూరము, ఒకఅంతర్నిగూఢతా
ఒక చిన్న కావ్యములో ఊదబడ
కావ్యమే చిన్నది. శబ్దములే అల్పము
వస్తువు విస్పష్టమైనది కాదు. చెప్పిన
ఏవ్యంగ్యమునో యాశ్రయించును. ఇక
సామాన్యపాఠకుని బుద్ధి ప్రసరించదు.
యందు సంపూర్ణమైన సానుభూతి లేని
అతడొక విషయము చెప్పునప్పుడు అ
ప్రత్యేకత యెట్టిదో నీవు పరిశీలింపనిచో
యందలి యర్థము నీకు గోచరము కా
పండితుడు రసజ్ఞుడు వేఱు, వేఱు! పండిత
కవియొక్క కావ్యము మెచ్చుకొనుటకు
వును. తన కిష్టము లేనిచో తిట్టుటకు
వును. రసజ్ఞుడు కవియొక్క కావ్యమ
తా నానందించుటకు చదువును. తెలిం
చో అందలి యానంద మెట్లు లభ్యమగ
విచారించును. లోకములో చాలవ

కు తెలియనిదానిని నిరాకరింతురు.
కవి తనహృదయమును ఎచ్చటనో గుప్త
గా నుంచును. దానిని గ్రహించుటకు
కుడు ప్రయత్నించవలెను. ఇందుచేత
కవిత్వము సర్వదా అంతర్విషయ బోధ
మాత్రమే యుండునని తలచరాదు; ఏల
గా నొకకవి తనదేశమును గూర్చి, తన
సాంప్రదాయమును గూర్చి, ఒకజాతి
దర్శమును గూర్చి వ్రాయును. ఆవ్రా
పద్ధతిలో నొకమార్దవ మున్నచో నదియు
కవిత్వమే యగును. ఒకభక్తుడైన కవి
క భక్తిభావము చెప్పినచో ఒకజాతీయ
పూరితుడైన కవి అట్టిభావము అట్టిపాత్ర
కు ఇచ్చువేళ మనసు అంతర్ముఖమై
నంద మనుభవించును. పద్ధతి గోచరిం
నో అదియును భావకవిత్వమే యగును.
స్సు బహిర్ముఖమగుట అంతర్ముఖమ
అని నేను వాడినమాటలు తీసివేసి
పాశ్చాత్యులును Lyrical poetry ని
చెప్పినారు. Dante తన "యీనీడ్"
గ్రంథములో బోలెడంత భావకవి
ము చూపించినాడు. Dante కవి తాను
ించిన స్త్రీ తనకు కాకపోవుటచేత తన
కథ యంతయు తన కథానాయకుడైన
స్'నందు డైడోవియోగమునందు
పించి భావకవిత్వమును వెదజల్లినాడు.
కృతమున ముద్రారాక్షస నాటకకర్త
సునియం దారోపించి తన వియోగ
చెప్పినట్లు అనుమానించదగియున్నది.
టకమున రాక్షసమంత్రి తనమిత్రుడైన
నదాసునకు ఉరిశిక్ష తప్పించవలయు
మహానందుల రాజధానిని, బహిర్వన
వరించిన వైఖరి ఆలంకారికముగా

ధ్వని యనియో వ్యంగ్య మనియో చెప్పకొనినను భావకవిత్వముగా కనిపించుచున్నది. ఈ సంగతి వేఱే చెప్పదగిన విషయం.

అందుచేత కావ్య పురాణాదులయందు భావకవిత్వ ముండదని చెప్పుటకు వీలులేదు. కవి తనలో తనకైన విషయములందు రసించి, వానిని ఎందైనగాని తన కవితామార్గమున విరచించనేని అందు తప్పకుండ లోనైన భావము తదనుగుణ మృదురచనయును గనిపించును.

భావము ఏతాదృశము కాకపోయినను మృదువై, అమితసుకుమారమై ఒకవిలక్షణమైన దగుచో అది భావకవిత్వ మనిపించును. ఆధునికులలో పిలకా గణపతిశాస్త్రిగారి ఒక చిన్నపాట: "శ్రీఉమసిచరణ మంజీరాల విడివడిన చిన్ని బంగరుపిచుకలారా" అన్నది భావకవిత్వము. ఇందు ఉత్ప్రేక్షా రూపకముల సంకరాలంకృతి యున్నది. ఇంకీ యలంకార మున్నదని లాక్షణికుడు చెప్పుమాట; కాని అన్నియలంకారములున్నచోటను ఇంతటి సునిషితమైన భావ ముండదు. ఈ భావమునందలి సౌకుమార్యములోని వైలక్షణ్యము దీనిని భావకవిత్వ మనిపించుచున్నది, అనగా భావకవిత్వమును భావకవిత్వమని చెప్పుట ఒక లాక్షణికమైన నిర్వచనము కాదు; ఆలంకారికమైన నిర్వచనము కాదు; ఈ నామము శబ్దార్థ విషయకమైన బాహిరమైన పరిజ్ఞాన దృష్టితో కల్పించినది కాదు. కవితానుభవముయొక్క మనోహృదయములందలి భావపరిస్పంద వైలక్షణ్యమును పురస్కరించుకొని వచ్చినపేరు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'పల్లకీ' అను ఖండ కావ్యము ఇంతి

కన్న సువ్యక్తమైన భావకవితాపద్ధతులు వెలయించుకొన్నది. శ్రీ. శ్రీ గారు చాల గీతికలు వ్రాసెను. క్రొత్త పోకడలు పోయెను. ఆయన పద్ధతిలో భావకవితాపద్ధతి యీదృష్టితో చూచినచో తక్కువగా నున్నది. ఆయనరచనలో ప్రబంధవైఖరి యెక్కువ. వృత్తము ప్రాబంధికమే కాదు, ఉపయోగించు మాటలు ప్రాబంధికములు కావు. అలంకారములు మొదలయినవి తెలుగుభాష నెరుగనివి. చంద్రుడు మెడతెగిన ఒంటెవలె నున్నాడనుట, కొండ చచ్చిన యేనుగవలె నున్న దనుట క్రొత్తయలంకారములు; కాని వీనియందు ఒకప్రాబంధిక ఉదాత్తత కనిపించుచున్నది. ఈయనగారి రచన యంతయు విప్లవభావములచేత పూరితమై యుండును. కాని సౌకుమార్యముచేత నిండియుండదు. అందుచే భావకవిత్వము కాదు, అనగా Lyrical poetry గా చెప్పుటకు వెసులుబాటు లేదు. ఇట్లన్నానని ఆయనకవిత్వమందు ఒకభావకవితాముద్ర లే దనను. ఈ ఆంతర బాహిర కవిత్వముల లక్షణముల యొక్క నిష్కర్ష చేయుట సాధ్యము కాదని మొదటనే చెప్పితిని.

వేదులవారి కవిత్వము భావములు చూచినచో పూర్తిగా భావకవిత్వము. ఆయన వృత్తమును వదలిపెట్టి పాటలు వ్రాసినను తన కలవాటయిన అక్షరసన్నివేశమునందలి ఒకనిండైన మాధుర్యమును పరిత్యజించి వ్రాయలేదు. కూలంకషమైన ఆరీతి సౌష్ఠవము సర్వత్ర ప్రాబంధిక సౌష్ఠవమును నిరూపించుచు, శబ్దగతమైన భావకవితావైలక్షణ్యమును దూరముచేయుచుండును. ఇంగ్లీషుల "గ్రే" వ్రాసిన కవిత్వము Lyrical poet అనినచో వేదులవారికవిత్వమును భావకవి మనవచ్చును. నాయని సుబ్బారావుగారి క త్వము, అచ్చముగా భావకవిత్వము. వైద రీతి లోకమున మిక్కిలి యిష్టమైనది, అం కనియే తిక్కన ఉత్తరరామాయణముకం కంకంటి పాపయ్యగ్రంథము ప్రశస్తి పొందు హరివంశముకన్న భాగవతము ప్రశ పొందుట. చాలమంది నేటికవులు వైదర్భీ నలవరచుకొనినవారు. నాయని కవిత్వము ఈరీతి లేదు. కనుక కొందరు బాలురైన క లకు ఈకవితలోని అందము తెలియ గుండె తరుముకొను భావమును, ఆ భావ నుకూడ తేనె పూసిన మెత్తని కత్తులల తరుగునటువంటిది. దాని కనుగుణమైన బ లో చెప్పినప్పుడు ఈరెంటియొక్క సా రస్యము కుదురుట ఒకానొక కవియొక ఒకానొకపరిపాకవిశేషము. ఈ లక్షణ నాయని సుబ్బారావు గ్రంథమునం దున్న ఇతని కవిత్వము చక్కని గ్రాంథికభా ఇది భావకవిత్వము కాదు అందురా ? భా కవిత్వమనగా వాడుకభాషలో నుండు ముత్యాలసరములలో నుండును, క్రొ వృత్తములలో నుండును అని యనుకొన పొరపాటు. గ్రాంథికమో వాడుకభాషయె వృత్తములో ముత్యాలసరాలో చె భావములోని మెత్తదనము ఆ భావానురూ మయిన మాటల పొందిక మెత్తదనము వీనియొక్క ఒకానొకమేళనము భా త్వము. ఇది సహృదయహృదయైకవేద్య

# భూగోళపటమున ఖాళీస్థలము

భూగోళపటములను వ్రాయునప్పుడు, సంగతి దర్శకులు తెలియని ప్రాంతములను ఖాళీ నే విడిచిపెట్టిరి అట్టి ప్రదేశములు ప్రస్తుతము తగా లేవు.

పరిశోధకులకు ఎక్కువగా లాభించు ప్రదే ములలో న్యూగినియా ఒకటి. గ్రీన్‌లెండు, నీ ప్రపంచమున పెద్దద్వీపములు. వీటిని యించిన ప్రపంచమున పెద్దద్వీపము లో గినియా ఒకటి.

16 వ శతాబ్ద ప్రారంభమున పోర్చుగీస్ వారు ని కనిపెట్టిరి. ఈ ప్రాంతములోని వారికి ర్చుగీస్ వారు పెట్టిన 'పాపన్సు' అను పేరే నే గూడ వ్యవహరింపబడుచున్నది. ఇక్కడ లభిం సుగంధద్రవ్యములు మరెచ్చటను లభింపవు. ఈ ప్రాంతములోనివారు ప్రస్తుతము గృహ ణమున చేర్పరులై యున్నారు. వీరిజీవిత గూడ మరికొన్ని విశేషాంశములు గలవు లో నున్న నరమాంసభక్షణ మున్నగు దురా ములను ప్రభుత్వమువారు నిషేధించిరి.

చాలమంది ప్రజలు పచ్చబొట్లు పొడిపించు దురు. వెండ్రుకల అలంకారమునకు ఎక్కువ వహింతురు. తదితర విషయములందు చాల అపరిశుభ్రముగా నుందురు వీరికి చర్మ ములు విస్తారము. నంజు, మలేరియా మున్నగు ములు గూడ ఉన్నవి. న్యూగినియాలోని వ్యాధుల బాధనుండి తప్పించుకొనుటకు తగు శ్రద్ధ వహించుచున్నారు.

మలేరియా వ్యాధి రాకుండుటకు గాను వ్యాధి రేప దినములలో ప్రతిదినము 6 గ్రెయి వంతున క్వైనైన్ సేవింపవలెనని నానా సమితి మలేరియా కమీషన్ వారు సిఫా చేసిరి. రోగులకు మొదటి 5-7 దినములు నకు 15-20 గ్రెయినుల క్వైనైన్ ఇవ్వంగ . తదితర మను మందులకు వైద్యుల యము అవసరము. క్వైనైన్ సేవించుటకు ము అట్టి సహాయము అవసర ముండ దని రియా కమీషన్ 1938 సం॥ నివేదికలోని వ పుటలో గలదు.

M. No. 128.

# శ్రీ రామారావు సంస్మృతి*

శ్రీ పి. గణపతిశాస్త్రి

ఓసౌందర్యమయ ప్రపంచనిలయా! ఓ శ్రీకళా దేవతా
వాసీభూత హృదంతరా! మహితభావా! చిత్రకారాగ్రణీ!
ఈసాయంతనవేళ మాకరములంకీ కావ్యపూజాంజలి
న్నీసాన్నిధ్య మలంకరింపగఁ బ్రభల్ నిండార విచ్చేయుమా!

కలకలలాడు రేఖల వికాసములో, మృదువర్ణచంచల
జ్వలనములన్ రచించితివి శాశ్వత సుందరతా ప్రపంచము
ల్గలలవలె న్నిరంతర మఖండతపోనియతిం భజించి, ఓ
లలితకళాతపస్వి! సఫల మ్మిలలో భవదీయ జన్మమే!

సుందర వర్ణచిత్రముల శోభల నాంధ్రకళాధిదేవతా
నందవిచిత్రలాస్యము లనంతములై మెరయున్ మెరుంగులై;
అందని దా కరాంగుళి కళాద్భుతకౌశల మొక్కసారి మి
న్నంది, నశించిపోయెగద! ఆంధ్రుల ఆశలతో క్షణమ్ములో!

ఓకమనీయ తారసమహోదధి! నీరచనల్ గనంగ జా
లై కరగుం హృదంతరము లంతన శాంతనిమీలితమ్ములై;
లోకము మాత్ర మేక్షణములో నొకమూల్యము గట్టిపోవు నే
వో కొలబద్దలం గొలిచి యూహల కందని నీ మహత్త్వమున్.

ఇది కలగించు మావది నొకేవిధి నీమహనీయచిత్ర మే
యదియొ రచింప బూనుకొనునంతనె ఆవిధి మ్రింగిపోయెన
న్నది సవిషాదచింత; ఒక ఆశయమేని ఫలింపనోచుకో
నిదికద! ఆంధ్రజాతి; యిది ఏదురదృష్టమహావిపాకమో!

* * *

* ఈపద్యములు, అధిక శ్రావణంలో రాజమహేంద్రవరమున జరిగిన శ్రీదామెర్ల రామారావు గారి స్మారకోత్సవసందర్భమున సాయంకాలమున చదువుట కుద్దేశింపబడినవి.

చింతల కేమి లే! విధివిచిత్రము! మాయిహలోకదుఃఖ మె
క్కింతయు జేరనేరని మహేంద్రదివమ్మె భవన్నివాసమో!
వంతలతో విషాదకరవాంఛలతో స్మరియించినాము; మ
న్నింతువుగాక! నీ మది గణింపకె మా అపరాధలేశమున్.

నీవు గతించినా వనువినిశ్చితబుద్ధి వహించి, లోక మా
యావిధు లందలంచు నినునంటియగాక; కళాతపోవిధిం
భావిత సుందరేశ్వర విభావము నీ మహితాత్మమృత్యుసం
భావనకైన సందదనుమాట జగ మ్మెరుగంగనేర్చునో!

ఒకపరి నామహోమయ మహోన్నతలోకమునుండి వచ్చి నీ
వికసితకౌముదీరుచిరవీక్షణ మెల్లెడ బర్వినంత, మా
సకలహృదంతరమ్ములు వెసం గళలన్ వికసించిపోవ, సా
ర్థక మొనరింపు మీస్మృతి కరమ్ము మహోత్సవముం గృపామతిన్.

---

## సవరణ

సెప్టెంబరు "భారతి" "కవిహృదయము" అనువ్యాసము ౬౭౧ పుటలో ౨౦ వ పంక్తినుండి "ఈవిధముగాఁ గవివాక్కు రసపర్యవసన్నమయిననేకాని దానికిఁ జరితార్థతలేదు." అన్నవాక్యముపిమ్మట దిగువ వ్రాసినభాగము ననుసంధించుకొని చదువవలయును.

"………… అందుకే ప్రధానమైన రసమును దృష్టియందుంచుకొని కవి కావ్యనిర్మాణముం జేయవలెననుట. కవిహృదయము రసచ్యుతమైనచో కావ్యసామగ్రి పెచ్చు పెరిగి యాత్మనాశముం గూర్చును.

ఉన్నదున్నట్లు నిరూపింపకుండుటలోనే కవిత్వము అనేకప్రయోజనములను గూర్చిపెట్టుచున్నది. పై నాయికవిషయములో నీకుఁ గోపము గల్గుట అసహజము అని మాత్రము పలికినచో నామె మనసు మెత్తపడదు. ఆ మాట ఆనందదాయకమును గాదు. చంద్రుని యుపమానముం జూపి ప్రకృతికోమలమైన నీ హృదికిఁ గోప మసహజమనుటచే నామెకుఁ దనలోనియౌన్నత్యము, శాంతభావము వ్యక్తమై క్రోధముం బోకార్చుకొని సుప్రసన్నయ యగుట కవకాశ మున్నది. ఇప్పుడు "నీకుఁ గోపము ప్రకృతివిరుద్ధము" అన్న మొదటి మాటయే కవితాచిత్రితమై ఈ విధమైన ప్రయోజనమును సంపాదించినది. అయినఁ గవిత్వమున నన్ని తావుల నిట్టి ప్రయోజనము లుండునా యను ప్రశ్నము కలుగవచ్చును. కొన్నింట నిట్టి ప్రయోజనములున్నఁ గొన్నింట నానందమాత్రప్రయోజన మున్నది. సరసబోధ యన్నింటను గలదు. "సద్యః పరనిర్వృతయే" అనుటచే నంతటను ఆనందసిద్ధిరూపప్రయోజన మత్యున్నము…………"

---

# ఆంధ్రులు - సంగీతము

శ్రీ వింజమూరి వరాహ నరసింహాచార్యులు

ఇదివరలో ఆంధ్రపత్రిక ఉగాదిసంచికలందు సంగీత విషయైక సంగతులు, సారాంశములు పెక్కులు తెలిపియు, చర్చించియు, వ్యాసములు రచించి యుంటిని. ప్రత్యేకాంధ్ర రాష్ట్రావశ్యకతనుగూర్చి మనము మన్నుల మనుటయు, నాంధ్రపత్రిక యందులకు తోడ్పడుటయు నెఱుగుదుము. ఆంధ్రుల ప్రతిభ సమస్త కళలందును, శాస్త్రములందును ఎట్లు ప్రకాశించినదియు దెలిసికొనుట ముఖ్యావసర మగుచున్నది. అందుచే నీవ్యాసమున లలితకళలలో ప్రముఖమగు సంగీతమున కాంధ్రు లెట్లు తోడ్పడినదియు, నేమి సేవ చేసినదియు జూతము.

భారతావనియందు గానకళ తక్కుంగల లలితకళలవలె మిగుల సనాతనసిద్ధమై విలసిల్లెననియు, వేదకాలమునుండియు నీ కళ ఈ భూమియందు మానవ జీవితమున కావశ్యకముగ నెంచబడుచుండె ననియు నిదివరలో దెలిపి యుంటిని. మానవుల జీవితమునకు పరమావశ్యకమగు సంగీతకళను, ప్రాచీన కాలమునుండియు ఘనతగాంచి తమవ్యక్తిత్వమును చాటగలిగిన యాంధ్రులు కూడ తక్కిన రాష్ట్రములవారివలె ఉపాసించి భరతాచార్యులై, నాట్యవేదులై, సంగీతోద్ధారకులై చిరంతన కీర్తిని గడించియుండిరనుటకు పెక్కు నిదర్శనములు కలవు. సంగీతమునకు ముఖ్యముగ నాంధ్రులసేవ, సహాయము మిక్కుట మనియు, వారు నిర్మించిన వాఙ్మయము — పాడిన పాటలు, పోయిన పోకడలు, పలికిన నృత్యము — అపారమై, అనన్యసామాన్యమై, వర్ణనాతీతమై యొప్పి యున్నదనుట తథ్యము. ఒక్క గానకళనుబట్టియె ఆంధ్రుల నైసర్గిక ప్రతిభ, ఔన్నత్యము, నాగరికత తెల్లము కాగలదు. ఇయ్యది ఇట్లో సాంగముగ దెలుపవలయునన్న యొక చరిత్రాత్మక గ్రంథమునకు కారణ మగును. కావున క్లుప్తముగ సంగీతమునకు ఆంధ్రులు చేసిన పని, నిర్మించిన వాఙ్మయము మున్నగు అంశములగూర్చి ఇట తెలుపబడును.

## పూర్వగ్రంథములు

సంగీతమునుగూర్చి చెప్పుకొను నప్పుడు అయ్యది ప్పుడు ఉత్తర హిందూస్థాని, కర్ణాటకము అని రెండువిధములుగ మంట తెలిసికొందుము. మనకు లభ్యమగు ప్రాచీన సంగీతశాస్త్రగ్రంథములు స్వల్పములయ్యు వాని వలన నాకాలపు సంగీతమునుగూర్చి కొంత తెలిసికొనుటకు వీలుకలదు. సంగీతవాఙ్మయమున నాదిగ్రంథముగ నెంచబడు క్రీ. పూ. ౪-వ శతాబ్దమునాటి భరతముని విరచిత "నాట్యశాస్త్రము", తరువాతి క్రీ. శ. ౧౨౧౦-౧౨౪౭ ప్రాంతమునాటి శార్ఙ్గదేవుని "సంగీతరత్నాకరము" స్వతంత్ర గ్రంథములుగ వెలయుచున్నవి. ఈ కాలమువరకు దత్తిల, కోహల, నందికేశ్వర, మతంగ, కశ్యప, యాష్టిక, అభినవగుప్త, మాతృగుప్త, శంకుక, రుద్రట, నాన్యదేవ, భోజదేవ, సోమేశ్వర, మమ్మట, కీర్తిధరమన్నగు సంగీతవేత్తలు భరతనాట్యమును పురస్కరించుకొని వ్యాఖ్యానములు, గ్రంథములు రచించి తమతమ మతములుకూడ అందు ఉల్లేఖించుచుండిరి. అంతేకాక తమ గ్రంథములను భరతాంకితముగ నెలయించుచుండిరి. నాన్యభూపాలుడు తన గ్రంథమును "భరతభాష్య" మనెను. నందికేశ్వరుని "భరతార్ణవము", అభినవగుప్తుని "అభినవభారతి" మున్నగునవి ఇట్టివే.

కోహలుని "సంగీతమేరు", మతంగుని "బృహద్దేశి", దత్తిలుని "దత్తిలము", భట్టగోపాలుని "తాళదీపిక", శారదాతనయుని "భావప్రకాశము", భోజదేవుని "సరస్వతీకంఠాభరణము", పార్శ్వదేవుని "సంగీతసమయసారము" మున్నగు కొన్ని గ్రంథములు

స్వతంత్రములుగ గన్పట్టినను అవి భరతముని గ్రంథమున గల వివిధవిషయములలో నాట్యకళకు సంబంధించిన కొన్నిటిని ముఖ్యముగ నలంకార రసాదులను, విపులపరచియు, జర్చించియు చెప్పుట మాత్రము. పెక్కు గ్రంథములు నాట్యకళ పరమావధిని గూర్చి, అనగా రసమునుగూర్చి మన్నతతో జెప్పుట కనుగొందుము. ఎట్లైనను భరతనాట్యశాస్త్రమునగల సంగతుల ననేకములుగ జేసి చెప్పుచుంటచే నవి "సంగీతరత్నాకరము" కాలము వరకు నంతగ స్వతంత్ర గ్రంథములుగ తెలియరావు. లొల్లట, ఉద్భట, శంకుక, కీర్తిధర, అభినవగుప్త ఆచార్యుల గ్రంథములు నాట్యశాస్త్రమునకు వ్యాఖ్యానములు. కావున ౧౩-వ శతాబ్దము వరకు గల సంగీతగ్రంథములు భరతనాట్యశాస్త్రానుగుణము లనుట చెల్లు.

## పూర్వము ద్వివిధభేదము గానము

ఇప్పటివరకు తెలుపబడిన గ్రంథములందు హిందూస్థానీ, కర్ణాటకము లని ఇప్పుడు మనకు తెలిసిన ద్వివిధభేదము లేశము కానము. పైని తెలిపిన భరతాచార్యు లందఱు, శాస్త్రజ్ఞు లందఱు, శార్ఙ్గదేవుడు సహితము ఉత్తరదేశములవారి కేమి దక్షిణదేశములవారి కేమి యావన్మాన్యులుగను - గౌరవనీయులుగ నున్నారు. వీరి గ్రంథములనుండి యాకాలమున భారతావనియం దంతట ఒక్కవిధమగు సంగీతము మాత్రమే ఉండినట్లు తెల్లము. ఉత్తరదేశమువారికిని, కర్ణాటక సంగీతజ్ఞులకును సమ్మతమగు విషయములు వారి గ్రంథముల జూతుము.

భరత, మతంగ, నందికేశ్వర, దత్తిల, కోహలాదులు తమగ్రంథములందు ప్రత్యేకము ఒక్కప్రాంతపు సంగీతమునుగూర్చి చెప్పలేదనుటకును, వారి గ్రంథములు భారతావనియం దంతట సమానముగ నాదరింపబడినవనుటకును మరియొక నిదర్శనము ఆయా గ్రంథములు ప్రతిప్రాంతమునను అందందు గృహములందేమి గ్రంథాలయములందేమి కానవచ్చుటయే. ఉత్తరదేశ నివాసియగు భరతాచార్యుని గ్రంథములు దక్షిణమునను వివిధ ప్రాంతప్రాంతముల కానవచ్చుచున్నవి. ఇందుకు కారణము ప్రాంతవిభక్తత యా కాలమున సంగీతమునకు లేకపోవుటే యని తెలియగలదు.

మరియొక నిదర్శనము, జయదేవ కవి కృత "గీతగోవింద కావ్యము." క్రీ. శ. ౧౧౭౦ ప్రాంతమునందలి ఈ గ్రంథము బంగాళమున నేమి, కాశ్మీరమున నేమి, గూర్జర దేశమునేమి, తమిళ, మహారాష్ట్ర, ఆంధ్ర దేశములయందేమి ఇప్పటికిని ఆదరింపబడుచుంటయు, దీనికి పెక్కు వ్యాఖ్యానములు రచింపబడుటయు విదితము. ఆ కాలమున అందలి సంగీతము ప్రతిప్రాంతమువారిచే నాదరింపబడినది. అందు కర్ణాటక ఉత్తరదేశపు సంగీతభేదములు కానము.

ఇట్లు ౧౩-వ శతాబ్దము వరకు వెలువడిన సంగీతశాస్త్రగ్రంథములవలన నాకాలము దనుక సంగీతము హిందూస్థాని, కర్ణాటకములను రెండువిధములుగ లేదని తెలిసికొంటిమి. దేశచరిత్రయు నీ యభిప్రాయమును సుస్థిరపరుచుచున్నది. ఉత్తరదేశములు ౧౩-వ శతాబ్దమునుండియు మహమ్మదీయుల దండయాత్రలకులోనై వారిపాలనకు పాలుపడినవి. మహమ్మదీయుల దండయాత్రలవల్ల భారతావనియందలి ధనమును కొల్లవడినది. భారతీయుల దేవాలయములు, నాగరికత, కళలు మార్పు చెందినవనుటకు తార్కాణములు కలవు. వారిలో కొందఱు ఢిల్లీ రాజధానిగ సామ్రాజ్యమును స్థాపించుకొని భారతీయ కళలకంటె పారసీకము, అఫగనుస్థానము మున్నగు తమ దేశములకళల నాదరించుచు వచ్చిరి. అందుచే నుత్తరదేశమునందలి కళలు విదేశీయ కళతో కొంత మిశ్రమమయ్యె నందును పరదేశరాజులు వారి పాలనకు లోబడిన యీ దేశమున వారి స్వదేశాభిమానమువలన నచ్చటి కళారాధకుల నీభూమికి రప్పించి వారి మతము నిట బాదుకొల్పిరి. ఇట్లు ఉత్తరమున సంగీతముకూడ పారశీకము, అరేబియా, అఫగనుస్థానము మున్నగు దేశములందలి పద్ధతులకులోనైనది. ఇందుకు దృష్టాంతముగ 'హమ్మీర్' అను రాగము "హమ్మీర్ ఖుస్రూ" అనుపారశీకుని పేరున సంగీతమున ప్రవేశించుటయు, బెహాగ్, సారంగ్ మున్నగు దేశీయేతర నామములు

రాగములకు కలుగుటయు జెప్పవచ్చును. ఈ రాగము లిప్పుడు కర్నాటక సంగీతమునను కందుము.

## కర్నాటక సంగీతము.

ఇట్లు భారతీయసంగీతము శార్ఙ్గదేవుని కాలము నుండి ఒక్కవిధముగ నుండెను. అనంతరము ౧౩ లేక ౧౪-వ శతాబ్దములనుండి ఉత్తరదేశమునను, దక్షిణాపథమున కర్నాట ప్రాంతములందును భేదములు జొడ చూపినవి. దక్షిణదేశమందలి సంగీతము కర్నాటక నామాంచితమైనది. ఇదెట్లు కలిగెనదియు, నందులకు సహాయ మెవరు చేసినదియు దెలిసికొనుటకుముందు కర్నాటకపదమును గూర్చియు, ప్రదేశమును గూర్చియు ఇంచుక తెలిసికొందము.

దక్షిణదేశపు సంగీతమును కర్నాట గానమని చెప్పిన నది యాంధ్రుల ప్రతిభను చాటుటయే యని యెఱుగవలయును. కర్నాటక మాంధ్రమా? కర్నాటకు లాంధ్రులా? అను సంశయము నివృత్తియగుట క్రిందివిషయము దెలియవలెను. కర్నాటక సామ్రాజ్య మాంధ్రులది. కర్నాటక సంస్థాన స్థాపనమునకు పూర్వము, అనగా హరిహరరాయలు, బుక్కరాయలు మొదట విజయనగర స్థాపనము చేయుటకు పూర్వ మాంధ్రులు తమ సామ్రాజ్యమును ఉత్తరమున కళింగదేశమునుండి దక్షిణమున కంచివరకును, పడమట యాదవరాజ్యమునకు ముఖ్య పట్టణమగు దేవగిరివరకును వ్యాపింప జేసికొనిరి. చాళుక్యులవలనను, కాకతీయుల వలనను, వరంగల్లు గణపతిరాజులవలనను, నెల్లూరి సీమ రెడ్డిరాజులవలనను తెనుగువాఙ్మయమేమి, తెనుగువారి శాస్త్రములేమి, కళలేమి, పురాణములేమి అన్నియు బాగుగ బోషింపబడి మహోన్నతదశకు వచ్చినవి. కాల మహిమచే కాకతీయరాజ్యము భగ్నమయిన పిదప మహమ్మదీయుల యొత్తిడివలన విజయనగరరాజ్యము స్థాపింపబడె నని చరిత్రజ్ఞులు చెప్పుదురు. విజయనగర సామ్రాజ్యము కన్నడదేశమునను వ్యాపించియుంట విదితము. కల్లినాథుడు (క్రీ.శ. ౧౪౫౦) కర్నాటక రాజ్యము కృష్ణాతీరమునుండి దక్షిణమున కావేరివరకు వ్యాపించియుండెనని ఇట్లు తెలిపినాడు.

"ఆస్తే కర్ణాటదేశః సువిమలయశసాపూరితాశః పృథివ్యాం
కావేరీకృష్ణవేణీతరళతరతరంగార్ద్రితదక్షోత్తరాంశః॥"

శ్రీకృష్ణదేవరాయల కాలమున కర్ణాటక రాజ్యము కళింగదేశమునుండి తమిళదేశాంతమువరకు దక్షిణాపథమంతయు వ్యాపించినది.

ఆంధ్రులు విజయనగరము రాజధానిగ సంస్థాపించిన సామ్రాజ్యమునకు కర్నాటక రాజ్యమను పేరు తమిళులు పెట్టియుందురని చరిత్రజ్ఞులు అభిప్రాయపడుచున్నారు.

మరియు చాళుక్యులకాలము నాటికి భారత, రామాయణాది పురాణేతిహాసములు కర్ణాటభాషలోని కనుక దింపబడి అనుసరణీయముగ నుంటచే నట్టి వాఙ్మయ నిర్మాణ మావశ్యక మని యెంచి తెలుగు కవిశేఖరులు నన్నయ, తిక్కన, భాస్కరాదులు తమ భారత, రామాయణములను తెలుగున వెలయించిరి. చాళుక్యుల కన్నడప్రఖ్యాతిని గుర్తించి గాబోలు ఈ దేశమునకు చేరువనుండిన తమిళులు ఆంధ్రుల రాజ్యమునకర్ణాటకముగ చేర్కొనిరి.

ఈ కారణముచే గాబోలు మన కవి సార్వభౌములును తెనుగును కర్ణాటక మని చెప్పుకొని గర్వించిరి. కర్ణాటక మన ఆంధ్రమని చెప్పుట కిట్లు చారిత్రాత్మక సారస్వతాత్మక నిదర్శనములు పెక్కులు కలవు. శ్రీనాథకవి సార్వభౌముడు తన తెలుగు పలుకు తెలుపుచు,

"పలుకునుడికారమున సాంధ్రభాష యందు
రెవ్వ రేమన్న నందురుగాక కొంత
నాకవిత్వంబు నిజము కర్నాటభాష"

అని వచించెను.

కర్నాటకరాజ్య మాంధ్రుల స్థాపితము. అయ్యది ఆంధ్రుల ప్రతిభామూలకము. ఆంధ్రుల యనన్య సామాన్య విజ్ఞానమునకు మూలకందము. తమిళ, కేరళ, కర్నాట వాటీవాసుల కాదర్శకస్థానము. ఈ రాజ్యమున విలసిల్లిన కళలు, శాస్త్రములు తక్కిన దేశస్థులు, ప్రాంతమువారు భావించి, అనుసరించి, నేర్చుచుండి రనుటకు సంగీతమే నిదర్శనము.

కర్నాట దేశమునందలి సంగీతము అట ఉద్గ్రహాలతో చేరుటచే దెనుగు కర్నాటక మెట్లాయెనో యట్లే తెనుగువారి సంగీతము కర్నాటక సంగీత మాయెను. కర్నాటదేశ ప్రాబల్యమువలన నచ్చటి సంగీతము కర్నాటక నామమును దాల్చినది. ఇయ్యది తమిళులేమి, మలయాళీలేమి, కేరళ దేశము వారేమి, కన్నడులేమి అంగీకరించి తమతమ సంగీతము నావిధముగ కర్నాటకసంగీతముగ జేర్కొని గర్వించుచున్నారు.

'కుడిమియామలై' మున్నగు శాసనములవలన తెలియు విధమున తమిళులకు స్వీయ సంగీత ములవడినను కర్నాట సంగీత ప్రశస్తిని కనుగొని కాలోలు వారు తాముకూడ నా పేరును చెప్పుకొని యాకళ నట్లుపాసించుచుండిరి. తమ వ్యక్తిత్వమును పోనాడుట కియ్యకొనియు గర్నాటక సంగీతము నుపాసించుట యాంధ్రుల ప్రతిభ - సంగీతమహిమ తెలియుటలేదా? తుద కాంధ్రనాయకరాజులు తంజావూరు, మధుర రాజ్యముల నేలుచు నాంధ్రకళల నచ్చట వర్ధిల్లజేయుటచే నచ్చటి యువకులు ఆకళల నభ్యసించి, యందు కుశలతను సంపాదించి ఇప్పుడు ముఖ్యముగ సంగీతమున మన ఆంధ్రసోదరులకుకూడ ఆదర్శకులైరి. ఆంధ్రుల కర్ణాట సంగీతమును వీరు ఆదరించుటయు సుస్థిరము గావించుటయు మనకు మరావహము కాకపోదు.

కొంతకాలమునకు విజయనగర కర్నాటక సామ్రాజ్య మస్తమించినను తత్ సమ్రాట్టులకు లోబడిన తెలుగు నాయకులకు అరవదేశమందలి మధుర, తంజావూరు రాష్ట్రములు స్వాధీనములై యుండుటయు వారా ప్రాంతముల కాంధ్రావనినుండి పెక్కురు శాస్త్రజ్ఞులను, కళారాధకులను, వాగ్గేయకారులను, భరతాచార్యులను, నర్తకులను రావించి యాంధ్రుల కళలను అట సుస్థిరము గావించుటయు విదితము. ఇట్లు తెనుగువారు పెక్కురు రెండు శతాబ్దముల క్రిందటి వర కాంధ్రదేశమునుండి తమిళ దేశమునకు వెళ్లునుండి రనుటకును, అట స్థిరవాస మేర్పఱచుకొనుచుండి రనుటకును చరిత్రాధారములు పెక్కులు కలవు. తెలుగువారు అరవదేశముల కిట్లు వెడలి తమ సంగీత గరిమ నట బాదుకొలుపుటచే నావృక్షము కొంతకాలమునకు అట మూలమూలలకును తన వేళ్లను విస్తరింపజేసి మహాశాఖోపశాఖాన్వితమై వర్ధిల్లుటచే నావృక్షపుఫలిత మన కిప్పుడు అవశ్యకముగ నుండినదనిన నాశ్చర్య మేమి? ఆ తియ్యపండ్లు మనకు రుచించునదిగ నున్నదనిన మనకు పైత్రే లిడుట ఏల? ఆ పాదపము నిత్తిన మాంధ్రులది కాదా? అద్దానికి దోహదము చేసి రసము నిచ్చినది ఆంధ్రులు కారా? పండ్లకు దీపి నొసగూర్చిన దాంధ్రులు కారా? ఇందుచే గర్నాటక సంగీతము కన్నడులవలన పోషితమైనందువల్ల యా పేరు కలుగలేదని తెలియగలము.

## కర్నాటక రాజ్యమునకు పూర్వమునను ఆంధ్రులు సంగీతజ్ఞులు

పైన తెలిపిన సంగతులవలన కర్నాటక సంగీతము విశిష్టమై ౧౩, ౧౪ శతాబ్దములనుండి, అనగా కర్నాటక సామ్రాజ్య స్థాపనానంతరమునుండి వర్ధిల్లినట్లు తెల్లము కాగలదు. అంతకు పూర్వమునను కొండటు తెనుగు ఏలికల - చాళుక్యరాజుల, కాకతీయ రేడుల కాలమునను సంగీతకళ నాంధ్రు లుపాసించినట్లు తెలియును. ఆకాలమున నిది ద్వివిధముగ నుంటమాత్రము తెలియదు. ఆంధ్రులు భారతావని కంతకు ఒక్క విధమును కళరాయ కల దనునట్లు గ్రంథములు రచించి యుండుట ఎఱుగుదుము. ఈ కాలమున ఆంధ్రులు రచించిన గ్రంథములలో నాట్యశాస్త్రోక్త విషయములు, అలంకారము, రసమువున్నగువానిగూర్చినవి యున్నట్లు విందుము.

సోమేశ్వరుడను చాళుక్యరాజు క్రీ. శ. ౧౧౩౧ ప్రాంతమున "మానసోల్లాస" మను గ్రంథము రచించెను. ఇందు సంగీతముగూర్చి పెక్కువారము చెప్పబడియున్నది. కాకతీయ గణపతినృపతి గజసాధనికుడు జాయసేనాపతి అనునాయన క్రీ. శ. ౧౨౫౩ ప్రాంతమున "నృత్తరత్నావళి" అను సంగీత నాట్య గ్రంథమును రచించెను. హమ్మీర మహీమహేంద్రుడు క్రీ. శ. ౧౨౮౩ ప్రాంతమున "సంగీత శృంగారహార" గ్రంథమును రచించెను. గోపాలనాయకుడు తన యసమాన గానచాతురిచే అల్లాఉద్దీన్ ఖిల్జీవలన (క్రీ. శ. ౧౨౯౬-౧౩౧౬ ప్రాంతము)

చెప్పబడెను. యతని ప్రోత్సాహమున నుత్తర దేశమునకు వెడలి యచ్చటి అమీరు ఖుస్రుతో సంగీతచర్చ గావించెను. ఇతడు పారశీకము మున్నగు పరదేశముల గానముకూడ నేర్చి పెక్కు గేయములు వెలయించినట్లు తెలియుచున్నది. హరిపాలదేవుడు "సంగీతసుధాకర" మను గ్రంథమును ఈ కాలముననే రచించి ఘనత గాంచెను. ఈ మొదలగు గ్రంథకర్తలవలన విజయనగర రాజ్యస్థాపనమునకు బూర్వమునుండియు నాంధ్రులు సంగీతవేత్తలై యాకళయందు ప్రఖ్యాతిని బడెసిరని తెలియుచున్నది. విజయనగరమున నూతన ఆంధ్రరాజ్య స్థాపనముతోగూడ కర్ణాటక సంగీతమునకు అంకురార్పణ జరిగినది. ౧౪-వ శతాబ్దమున కర్ణాటాంకితమైన సంగీతము కాలక్రమమున కర్ణాటకాధిపతులచే దోహదము నొంది గొప్పవృక్షముగ బెరిగి దక్షిణదిక్కుద మంతట శాఖోపశాఖలను జెంచి సుమనఃపుష్పితమై రసవత్ఫలభారశోభితమై దేశదేశాంతరములవారికిని ఖండ ఖండాంతరములవారికి నాశ్చర్యజనక మగునంతటి మహోన్నతస్థితికి వచ్చుట విదితము.

## కర్ణాటకసంగీతమున కాంధ్రుల కృషి

ఇక కర్ణాటక సంగీతమునకు ఆంధ్రు లెట్టి పోషణ, ఎట్టి కృషి. చేసినది తెలిసికొనుట యావశ్యకము. కాని యీపని అంత సులభమైనది కాదు. పెక్కు శతాబ్దములకు వెనుక సంగీత మెట్లున్నదియు తెలిసికొనుటకు పాశ్చాత్యులకువలె మనకు చరిత్రలు లేవు; మన ప్రాచీన శాస్త్రజ్ఞులును మన కీ విషయమున తోడ్పడరు. అచ్చటచ్చట మనకు లభ్యములగు సంగీతశాస్త్ర గ్రంథముల వలననైనను ఆ రచయితల దేశకాలములగూర్చి సవిస్తరముగ తెలిసికొనుటకు కూడ ఆధారములు లేవు. వారివారి గ్రంథములు తాళపత్రములమీద లిఖించి దాచి యుంచుకొన్న వారి గ్రంథములును, తగినన్ని లభ్యము లగుట లేదు. విశాలమగు భారతభూమియందు ఇటీవల అందందు గ్రంథాలయములకు జేర్చినవి మన కందుబాటున లేవు. ఈ సంగతులవలన మనకు సంగీత చరిత్రరచన కొంత కష్టతరముగ నున్నది.

మరియొక సంగతి. శాస్త్రరచయిత, కళోపాసకుడు తనవిద్యను శిష్యులకు పరంపరగా నేర్పుచువచ్చుటచేత గ్రంథములు తగినన్ని బయలుపడకున్నవి. గురుశిష్య పరంపరగా వచ్చిన మనసంగీతము గ్రంథస్థ మొనర్పబడక పోవుటచేతగూడ మన సంగీత చరిత్రరచన సులభముగ నగుట లేదు.

మరియు సంగీతమునకు సాహిత్యము చెలికత్తె యగుటచే సాహిత్య వాఙ్మయ నిర్మాతల గ్రంథముల నున్న సంగీత విషయైక సంగతులు సారాంశములు తెలిసికొనుట ఆవశ్యకము. ఇతరవిషయములు, అనగా పైన తెలిపిన అలంకారభాగము, రసభాగము, ఆహార్యము మున్నగువిషయములనుగురించి ప్రత్యేక గ్రంథములు రచించిన వారిని గూర్చియు తెలిసికొనవలసి యున్నది.

అట్లయ్యు నీచిన్ని వ్యాసమున సంగీతమునకు ఆంధ్రు లెవరెవరు, ఏ యే గ్రంథములు రచించి దాని కెట్లు పుష్టి కలుగజేసినది మాత్రము తెలిసికొందము. మనకు కావలసిన గ్రంథములు వేలువేలు ప్రాంతములం దుంటచే వాని సమగ్ర గ్రహణమున సంగీతచరిత్ర రచించుటకు వేరొకమారు ప్రయత్నింతును.

పదుమూడవ శతాబ్దమునుండి నేటివరకు మన కర్ణాటక సంగీత చరిత్రను వ్రాయుటకు కూడ ఈ వ్యాసమున వీలు కాకున్నది. అందుచే నప్పటినుండి పందొమ్మిదవ శతాబ్దమువరకు గల ఆంధ్ర సంగీత వాఙ్మయ నిర్మాతల గూర్చియు, వారి గ్రంథముల గూర్చియు నిట తెలుపువాడను.

## సంగీత రత్నాకరము

శార్ఙ్గదేవునివలన రచింపబడిన ఈ గ్రంథముమీద పెక్కు వ్యాఖ్యానము లున్నవనియు, వానిలో నాంధ్రకృతములు జనసమ్మతము లగుచుండెననియు తెలియుచున్నది. అట్టి ఆంధ్రవ్యాఖ్యాతలలో ముఖ్యులు చతుర కల్లినాథుడు, సింహభూపాలుడు, కుంభకర్ణ భూమీశుడు మున్నగువారు. ఒప్పర్టు దొరగారు తమ సంస్కృత వ్రాతగ్రంథములలో "సంగీత రత్నాకర చంద్రిక" అను వ్యాఖ్యానమును చెప్పెను. గ్రంథకర్త పేరు తెలియదు. కేశవ అను బ్రాహ్మణుడు మరియొక వ్యాఖ్యానము రచించినట్లు "సంగీతసుధ"యం దిట్లు తెలియుచున్నది.

" ఏనాం స్ఫుటీ కర్తు మిహా ప్రవృత్తో,
యా బ్రాహ్మణో కేశవ కల్లినాథో,
టీకాద్వయే నాపి కృతేన తాభ్యాం,
అబోధితా స్పష్టపదార్థ భేదామ్॥"

తెనుగు వచన రూపమున రచింపబడిన గ్రంథ మొకటి మద్రాసు గ్రంథాలయమున కలదు. అరవమునను పద్యముల చొప్పున రచింపబడిన యొక ప్రతి తంజావూరు గ్రంథాలయమున జూడుము.

## రాగార్ణవము

క్రీ. శ. ౧౬౦౯-వ సంవత్సరమున ఆంధ్ర భరతాచార్యుడగు సోమనాథ్యుడు రచించిన "రాగవిబోధ" యందీగ్రంథము గూర్చి తెలియుచున్నది. పదునాలుగవ శతాబ్దము మధ్యమున రచింపబడిన "సారంగధరపద్ధతి" అను గ్రంథమున కీరాగార్ణవము తోడనుదహరించినట్లు అందు తెలియుచున్నది. గ్రంథకర్త తెలియ రాకపోయినను ఈ గ్రంథ మాంధ్రవాగ్గేయులచే నాదరింపబడుటచే నిది యాదేశము వారివలన రచింపబడె నని యూహింతుము.

## హరిపాలదేవుని సంగీత సుధాకరము

ఈ గ్రంథము మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకాలయమునను, తంజావూరు గ్రంథాలయమునను కలదు. గ్రంథకర్తయయిన హరిపాలదేవుడు భూపాలుడని గ్రహింతుము. చాళుక్యరాజులలో హరిపాలుడు అను పేరుకల డనియు, నీ గ్రంథకర్త యాయనయైయుండు ననియు నిట్లు మానవల్లి రామకృష్ణ కవిగారు ఎంచిరి. ఈరాజు సంగీతమును లక్ష్యలక్షణముగ నెఱిగినట్లు తెలియుచున్నది. ఈయన శ్రీరంగక్షేత్రమున కరిగి యచ్చటి నటీనటులకు వారికోరికపై సంగీతము నేర్పినట్లు గ్రంథమున చూడుము. వారి చెప్పిన మతము "సంగీతసుధాకర" గ్రంథము ననుసరించు ననియు దెలిపినాడు. తాను పెక్కు గ్రంథములు రచించినట్లును వాకొనెను.

"అన్యాన్యా రసనిర్భరానివిధిరే యేన ప్రబన్ధాః శతమ్".
"సర్వవిద్యాశ్రమమేదినీనాం గోపాయితా భూజన
చక్రవర్తీ,
యద్యస్త్ర సంగీతసుధాకరాఖ్యం ప్రబన్ధ మాలోడిత పూర్వ
శాస్త్రః."

కదాచి ద్రంగనాథస్య భోగిపర్యంకశాయినః,
చరణాంభోరుహద్వన్ద్వ వన్దనోత్సుకమానసః.
చోలా నలంకరోతిస్మ హరిపాలః సురోపమః.
శ్రీరంగే విహితావాసం శృంగారైకనికేతనం
ఏనమభ్యర్థయామాసుః నటనర్తకగాయకాః
ఇదం (నృత్తం) లోకహితార్థాయ యథావత్ ప్రతి
పాద్యతాం,
ఏవ మభ్యర్థిత స్తైస్తైః హరిపాలమహీపతిః,
ప్రబన్ధమాత్మ విహితం స సంగీతసుధాకరం
సర్వలక్షణసంపన్నం అశిక్షయ దనుక్రమాత్."

ఈ గ్రంథమున గద్య ఇట్లున్నది:

" ఇతి విచారచతురముఖ శ్రీ హరిపాలదేవ విరచితే సంగీతసుధాకరే పంచమం గీత ప్రకరణమ్. "

మరియు నీ గ్రంథమున నీయన పేరు "హరిభూమిపః" అనియు జెప్పబడెను.

"నీతా సంస్కృతకౌశలః సుమనసాం
రక్త్యైకదీక్షాగురుః
చక్రే శ్రీహరిభూమిపః ప్రకరణం
గీతాశ్రయం శాశ్వతమ్. "

ఇందుచే "సంగీతసుధ" యందు

"గ్రంథాన్ విలోక్యాఘనికైః హరిపాల
శ్రీశార్ఙ్గదేవప్రముఖైః ప్రణీతాన్."

అని చెప్పు హరిపాల్డుడు హరిపాలదేవు డనియే గ్రహింపనగును. ఈయన చాళుక్యరాజని పై సంగతి వలనను ఎంచవచ్చును. అందుచే నీయనకాలము క్రీ. శ. ౧౧౭౦ ప్రాంతము.

## శారదతనయ

శారదతనయ "భావప్రకాశ"మను గ్రంథము నాట్యకళగూర్చియు, "శారదీయము"నను సంగీతము గూర్చియు రచించెను. ఇతడు బ్రాహ్మణుడు. కాశ్యప గోత్రుడు. తన ముత్తాత లక్ష్మణ అనియు, తాత కృష్ణ అనియు, తండ్రి భట్టగోపాల అనియు నిట్లు తెలిపినాడు. ఈయన వాసస్థానము "గ్రామో మాథరపూజ్యః" అని చెప్పుటచే చెంగల్పట్టుజిల్లాయందుగల మాథూరి అను బ్రాహ్మణసంతతికి జెందిన గ్రామముగ

గ్రహింతుము. తన గ్రామమున వెయ్యిమంది బ్రాహ్మణులు కలరనియు దెలిపెను. అందుచే దెనుగు ప్రాంతమువా డనుటకు వీలగును. మరియు భావప్రకాశగ్రంథము మైసూరు ప్రాంతమందలి మేల్కోట యతిరాజువద్ద నొకప్రతియు, మద్రాసు గ్రంథాలయమున నొకప్రతియు, నిట్లు లభ్యము లగుటచే నీ గ్రంథకర్త యాప్రాంతమువా డని యెంచవచ్చునని కె. ఎస్. రామస్వామిశాస్త్రి, యదుగిరి యతిరాజస్వామిగార్లు తలచిరి.

ఈయన "మయాపి శారదీయాఖ్యే ప్రబన్ధే సుష్ఠు దర్శితమ్" అని చెప్పిన "శారదీయ" మను గ్రంథ మిప్పుడు లభ్యముగ లేదు. కాని "భావప్రకాశము" తక్కినవారి కాదర్శకముగ నుంట తెలియుచున్నది. సింఘభూపా లుడు "రసార్ణవ సుధాకరము"నను, గోపేంద్ర తిప్ప భూపాలుడు "కామధేను"వందును ఈ గ్రంథమును గూర్చి గొప్పగ జెప్పిరి. శారదాతనయుడు తన గ్రంథమున అలంకారము, రసము, గుణము, రీతి, ధ్వని మున్నగు నాట్యశాస్త్రవిషయములలో తన కాలమువరకు గల పెక్కు గ్రంథకర్తలను—ఉద్భటుడు, లొల్లటుడు, శంకుక, రుద్రట, అభినవగుప్త, భోజ, క్షేమేంద్ర, భట్టనాయక మున్నగువారిని—పేర్కొనుచు వారివారి యభిప్రాయము లందందు తెలుపుచు దన భావమును నిలుపుకొనుచుండెను. ఈయన నాట్యశాస్త్రమును నాలుగు విభాగములుగ పదియధ్యాయములందు తెలిపి నాడు. ఈ గ్రంథము ఆలంకారికులకును రసవాదుల కును మిగుల తోడ్పడుచున్నది. ఇయ్యది ఓరియంటల్ ఇన్‌స్టిట్యూటున ముద్రితమైనది.

## విద్యారణ్యుల సంగీతసారము

విద్యారణ్యులపేరు కర్నాటక సామ్రాజ్యము నందలి ప్రతివారికిని కరతలామలకము. ఈయన ఆంధ్ర బ్రాహ్మణుడు. జన్మస్థలము పంపాక్షేత్ర ప్రాంతమని కొందరు విశ్వనాథముగా నెంచిరి. కర్నాటక రాజ్య స్థాపనమునకు కారకుడై హరిహర బుక్కరాయలకు మంత్రియై సహాయుడై యుండుటచే కర్నాటక చరిత్ర నెఱుగువారెల్ల ఈయన జ్ఞప్తికి రాకమానదు. ఈయన సంస్కృత వాఙ్మయమునకు మిగుల తోడ్పడి పెక్కు శాస్త్రములందు గ్రంథములు వెలయించుటయు గలియు చును. రాజకీయ మత సాంఘిక విషయములకు పెద్ద కాలము వినియోగించియు సంగీతమును గూడ ప్రజ్ఞా వంతుడై యాకళను మాతనాన్నత్యమున వెలయింప గలి గెనని తెలియుట మన కాశ్చర్యజనకము కాకపోదు. ఈయన కర్నాటక సంగీతము సంస్కరింపజేసె ననుటకు రాగములను మేళకర్తల క్రింద క్రోడీకరించు నీయన పద్ధ తిని మనము తెలిసిన చాలును. ఈయన చెప్పిన మేళ పద్ధతియే కర్నాటక సంగీతమును ఉత్తరదేశపు సంగీ తము నుండి వేరుచేయుచున్నది. ఉత్తరదేశమున "రాగ రాగిణి" పద్ధతి యములునం దుంట విదితము. విద్యా రణ్యు లిట్లు మేళపద్ధతి నేర్పరచి ఆంధ్రుల ప్రతిభను చాటినాడు.

కర్నాటక సంగీతమున మేళపద్ధతి రామా మాత్యులు నేర్పాటు చేసెనని పెక్కురు తలతురు. కాని యీ పద్ధతిని విద్యారణ్యుల కాలమునందే (క్రీ. శ. ౧౩౨౦—౧౩౮౦) యమలునకు వచ్చెననియు, నది విద్యారణ్యుల ప్రతిభను చాటుననియు నెంచవచ్చును. మేళములను గూర్చి విద్యారణ్యులు చెప్పిరనుటకు "సంగీతసుధ" యందు గల ఈ వాక్యములు మాడవలెను.

"సంగీతసారం సముపేక్ష్య విద్యా
రణ్యాభిధశ్రీచరణప్రణీతమ్॥
కర్నాటసింహాసనభాగ్యవిద్యా
రణ్యాభిధాశ్రీచరణాగ్రణీభ్యః,
ఆరభ్య రాగాన్ ప్రచురప్రయోగాన్
పంచాశతం చాకలయే మతంగాన్"

........................ .......

రాగాస్తు పంచాశ దిహోపదిష్టాః
నట్టాదయ స్సర్వజగత్ప్రసిద్ధాః,
తేషాం మతాః పంచదశైవ మేలాః
క్రమాత్ తదుద్దేశ మిహోమనామః॥"

విద్యారణ్యులకృత "సంగీతసార" మిప్పుడు అలభ్యముగ నున్నది. బికనీరు గ్రంథాలయమున నీపేరు గల గ్రంథము మాత్రము కాని యది క్రీ. శ. ౧౫౬౫ లేక ౧౫౦౬ కాలమువాటిదిగ తెలియుటచే నది విద్యారణ్యులకృతము కాదని ఎంచవలసి యున్నది.

గోవిందదీక్షితుల కా గ్రంథము లభ్యముగనుండి యాదర్శముగనుంట సంగీతసుధయందలి పై వాక్యమునుండి గ్రహింతుము. ఇట్లు విద్యారణ్యులకు కర్ణాటక సామ్రాజ్యస్థాపనాచార్యత్వముతోపాటు కర్ణాటక సంగీతస్థాపనాచార్యత్వముకూడ సిద్ధించె ననవచ్చును.

## సుధాకలశప్రోక్త సంగీతోపనిషత్సారము

ఈ గ్రంథమునందలి గద్యలో "మలధారిగచ్ఛమండనవాదీన్ద్ర శ్రీరాజశేఖరసూరి శిష్యవాచనాచార్య శ్రీసుధాకలశ విరచితే స్వోపజ్ఞ సంగీతోపనిషత్సారే నృత్యప్రకాశనో నామ షష్ఠోధ్యాయః" అని చెప్పబడెను. మలధారిగచ్ఛప్రాంతమునకు మండనుడను యీతని గ్రంథము ధనభట్టుచే చేర్కొనబడెను. ఇద్యాది "సంగీతోపనిషత్తు"నకు వ్యాఖ్యానముగ గ్రహింతుము. గ్రంథాంతమున,

"సంగీతోపనిషత్ గ్రంథం భాష్యాగ్ని శశివత్సరే
బుధకావ్యయుగేస్వబ్దే తత్సారం చాపి నిర్మమే॥"

అని ఇతడు చెప్పుటచే నీ గ్రంథము ౧౩౮౦ శకము, అనగా క్రీ. శ. ౧౩౫౩ వత్సరమున మూలమును, శకము ౧౨౭౦, అనగా క్రీ. శ. ౧౩౪౮ వత్సరమున "సారము" రచింపబడెనని తెలియుచున్నది. మూల గ్రంథ మెవరికృతియో తెలియుటలేదు. బికనీరు గ్రంథావళియందు ౧౧౭౬, ౧౧౭౭ గ్రంథములుగ దీనిని తెలియుచున్నది.

## సింగభూపాలుడు

ఈయన 'రసార్ణవసుధాకర'మను గ్రంథమువలన విఖ్యాత కీర్తికాముడై సర్వజ్ఞబిరుదము వహించియుండెను. ఈయన "సంగీతరత్నాకర"మునకు "సుధాకర" మను వ్యాఖ్యానము రచించెను. ఈయన రేచర్ల వంశము వాడు. ఈయన గ్రంథము సమగ్రప్రతి రాజపుటానా మత్స్యపరగణాల గ్రంథావళియందు ఎస్. ఆర్. భండార్కరు ఎం. ఏ. గారు చేర్కొనిరి. ఈయనరాజ్యము వింధ్యపర్వతసంతతిమొదలు శ్రీశైలమువరకు వ్యాపించెనట. ఈయనకాలము క్రీ. శ. ౧౩౩౦ వత్సరప్రాంతమని తెలియుచున్నది.

## వసంతరాజీయ నాట్యశాస్త్రము

ఈ గ్రంథమునుగూర్చి పెక్కురచే ప్రబోధచంద్రోదయకర్త నాదిండ్లగోపన అను నాయనవలనను మల్లినాథకుమారస్వామివలనను చెప్పబడెను. ఈ గ్రంథకర్త వసంతనృపాలుడను బిరుదువహించిన కుమారగిరి. ఈయన పూర్వాంధ్రదేశమును పాలించెను. కాళిదాసు "మాళవికాగ్నిమిత్ర"వ్యాఖ్యానకర్త కాటయవేమన క్రీ. శ ౧౩౬౫ వత్సరమున బుట్టి ౧౪౦౪ వరకుండినట్లును, రాజమహేంద్రము నేలినట్లును తెలియుచున్నది. కాటయవేమన వసంతరాజీయమునుగూర్చి చెప్పినాడు.

"మునీనాం భరతాదీనాం భోజాదీనాం చ భూభుజామ్,
శాస్త్రాణి సమ్యగాలోచ్య నాట్యవేదార్థవేదినామ్.
ప్రోక్తం వసంతరాజేన కుమారగిరిభూభుజా,
నామ్నా వసంతరాజీయం నాట్యశాస్త్రం యదుత్తమమ్."

ఇతనియనంతరము కోమటి వేమారెడ్డి రాజ్యమేలినట్లును శ్రీనాథుకృతిభర్త మామిడిసింగన యితని మంత్రిగ నుండెట్లును తెలియుచున్నది. ఈయనకు హరిహరదేవరాయలు సమకాలికుడు.

## మల్లినాథకవి

కాళిదాసకృత రఘువంశము, కుమారసంభవము, గ్రంథములకు వ్యాఖ్యానములు రచించిన మల్లినాథుడు గొప్ప సంగీతవిషయైక యంశములు తన వ్యాఖ్యానములందు చెప్పుచుండెను. రాజకందర్పకృత సంగీతగ్రంథమునుండి కూడ ఉదాహరణములు చెప్పుచుండెను. ఈ గ్రంథము లభ్యముగ లేకున్నది. మృదంగవాద్యమున గలుగు 'కరణ' అను వాద్యవిధము 'రాజకందర్ప'గ్రంథమునుండి తెలిపినాడు.

"కరణైస్తాలకవశాసకైః తాడనవిశేషైః" తదుక్తం రాజకందర్పేణ—నృత్యవాదిత్రగీతానాం ప్రయోగవశభేదినాం, సంస్థానం తాడనం రోధః కరణాని ప్రచక్షతే ఇతి."

మల్లినాథకవి పదునాలుగవ శతాబ్దాంతమున నుండెను. (సశేషము)

# ఆంధ్రతేజము

(రెడ్డిరాజులకాలమునాటి యాంధ్రదేశచరిత్రాత్మక నాటకము)

శ్రీ నండూరి బంగారయ్య

(అనువృత్తము)

---

## మూడవ యంకము - మొదటి రంగము

[రంగము : ధరణికోటలో నొక పేదరాశి పెద్దమ్మ యిల్లు. ప్రవేశము: పెద్దమ్మ, పురుషవేషమున విజయాంబ]

విజ — అవ్వా! అగత్యము లేనిదే యబద్ధ మాడితివే? నేను మీపెత్తండ్రికుమారుడ నని యెందులకు జెప్పితివి?

పెద్ద — నాయనా! నీకుఁ దెలియదు ఆ వచ్చినవా రెవ్వరో యెరుగుదువా?

విజ — ఎరుగను. ఎవరు వారు?

పెద్ద — ప్రచ్ఛన్నవేషముననున్న మంత్రిశేఖరు డని నాయనుమానము.

విజ — మహామాత్యుడు రామాప్రెగ్గడ ఈతడేనా? ఈతనికీర్తి చిరకాలమునుండి వినుచున్నాను. అద్భుతప్రతిభాశాలియటగాదా?

పెద్ద — ప్రతిభాశాలియే గాని —

విజ — కాని యని యూరకుంటి వేల?

పెద్ద — తననీడ చూచుకొని తాను భయపడునంతటియనుమానగ్రస్తు డని చెప్పుకొందురు.

విజ — మిక్కుటమైన రాజభక్తి బహుశః అట్టియనుమానమునకు హేతువు గావచ్చును. ఇప్పు డీ ప్రచ్ఛన్నసంచరణమువలన ప్రయోజన మేమి?

పెద్ద — నీవు చెప్పనేచెప్పితివిగదా! రాజకార్య మనిన ఈతనికి నిద్రాహారము లక్కర లేదు. ఇవి యుద్ధదినములు గదా, ఎవరైన శత్రుపక్షమువారు మారువేషమున నగరమున బ్రవేశించిరేమో కనుగొనుటకు.

విజ — ఆలాగుననా? నా యాలోచన మంతవరకు పోలేదు. పాపము! నానిమిత్తముగ నీ వబద్ధమాడవలసివచ్చినదే?

పెద్ద — వ్రతము చెడినను ఫలము దక్కునట్లు తోచదు. నామాట నాతడు విశ్వసించినట్లు కనంబడదు. ఇంకొక్కమువూర్తమైనను నీ విచ్చట నాలసింపవలదు. ఏదోవిధముగ బయటపడవలెను.

విజ — ఇప్పు డంత భయకారణ మే మున్నది?

పెద్ద — అట్లనకుము. ఈతడు మరల రావచ్చును.

విజ — రానిమ్ము. వచ్చి ఏమి చేయును?

పెద్ద — అబ్బబ్బ! నీధోరణి నీదే కాని ఒకరు చెప్పినమాట వినవు. నిన్ను కారాగృహ మున బంధించినను బంధింపవచ్చును—చాల చిక్కు లున్నవి. నీకు తెలియదు.

విజ — నాజన్మమున చిక్కులు ఈనాడు క్రొత్తగ వచ్చిపడినవి కావు. చిక్కులతోఁ బుట్టి చిక్కులతోఁ బెరుగుచున్నాను.

పెద్ద — (విజయాంబ గడ్డము పట్టుకొని) నామాట రవంత విను నాయనా! నిన్ను చూడగ మా నాయన జ్ఞప్తికి వచ్చుచున్నాడు. ఇట్టి సుకుమారదేహము చెరసాలలో నుండగ నేను చూడలేను.

విజ — ఇంకొకపట్టణమున ప్రాసాదాగ్రమున వసించుటకంటె ఈ పట్టణమున కారాగృహ మున నుండుటమైనను సౌఖ్యప్రదమే.

పెద్ద — అయ్యో వెర్రితండ్రీ!

విజ — వెర్రి యనుము, పిచ్చి యనుము. ఈయూరిలో నడుగుపెట్టినదిమొదలుకొని నాకు గోలోకమున సంచరించుచున్న ట్లున్నది. ఈయూరనున్న రాళ్లు రప్పలు చెట్లు పుట్టలు కూడ ఆంధ్రుల ప్రాచీనవైభవమునుగూర్చి మహోపన్యాసము లిచ్చుచున్నవి.

పెద్ద — ఈయూరిలో పెరుగుచున్నాను. అరువదవపడి దాటి డెబ్బదవపడి వచ్చినది. ఇంత వరకు నాతో నొక్కరాయిగాని ఒక్కరప్పగాని మాటాడలేదే! నీకడ నేమిమాహాత్మ్య మున్నదో!

విజ — నీవు శ్రీశైల మెప్పుడైనను పోయితివా?

పెద్ద — ఏదీ మానాయన నన్ను శ్రీశైలయాత్రకు తీసికొనిపోయెద ననుచుండగనే మాయ తురకలు వచ్చి నాయనను పొట్టను బెట్టుకున్నారు. (అని కనులనీ రొత్తుకొనును)

విజ — పాపము! ఏకపుత్రమరణముకంటె కడుపుశోకమున కవధి యేమున్నది? కాని ఒక్కందులకు నీవు సంతోషింపవలెను. ఆంధ్రసామ్రాజ్యసంరక్షణార్థమయి నీకుమా రుడు వీరశయనము నందినాడు. చక్రవర్తియిప్పు డిని పెరిగినందుల కాతని ఋణము తీర్చుకొనుచున్నాడు.

పెద్ద — అలాగుననే సరిపెట్టుకొనుచున్నాను. తండ్రీ! ఎన్ని చెప్పినను కడుపుతీపిగదా! నాయనా! ఆలస్య మగుచున్నది. త్వరపడుము.

విజ — అవ్వా! నీయింటిలో నున్నది మూడుపూటలేయైనను మూడు జన్మములనుండి నీతో బంధుత్వ మేర్పడినట్లుగ మీ యిల్లు వదలుటకు బుద్ధి పుట్టుట లేదు.

పెద్ద — నాయనా! ఈ మూడుపూట లయినను నీవు సరిగా భుజించిన దేదీ? మొన్న నుపవాసమే గదా. ఇక నిన్నను ఈ దినముననైనను భోజనము నసిగా నున్నదో లేదో! పూర్వోత్తరపు వంటలే గాని ఇప్పటి పడుచువారు వండగలిగిన వంటకము లెవ్వియు నేను వండలేను. 'పలా' వని, 'కూర్మా' యని, 'కైమా' యని యేవోరకరక ముల పిండివంటలటగాదా!

విజ — అవ్వా! ఆతురకకూ ళ్లన్నిటికంటెను నీచేతిప్రసాద మెంతో శుచిగ లేదా? నిజము చెప్పిన నమ్మవు గాని మాఅమ్మ స్వర్గమునుండి దిగివచ్చి వండిపెట్టుచున్న ట్లున్నది. అందుచేతనే నిన్ను వదలలేకుండ నున్నాను.

పెద్ద — ఇదిగో! ఎవ్వరినైనను చక్కని చుక్కను చూచి పెండ్లి చేసికొనుము. వండినది వండకుండ దినమున కొకపిండివంటచొప్పున వండిపెట్టగలదు.

విజ — అవ్వా! నీమాటలు పిండివంటకంటెను రుచిగ నున్నవి.

పెద్ద — నాయనా! ఇక నాలస్యము చేయకుము. రేపుదయము రాజమహేంద్రవరము నుండి వచ్చిన పనసకాయ కొట్టించి వండవలె ననుకొంటిని. నీవు తినకుండగనే పోవలసి వచ్చుచున్నదిగదా!

విజ — అవ్వా! ఈరూకలు నీవు తీసికో.

పెద్ద — సరి! సరి! ఎంతమాటాడితివి?

విజ — తక్కువ యిచ్చితినా?

పెద్ద — నీ వొకటి మా నాయన యొకటి కాదుగదా! నీదగ్గిర నేదియు తీసికొనదలచుకొన లేదు. నాకు మనసులో నొకటి, పై కొకటి కాదు నాయనా!

విజ — పెద్దదానవు గదా! ఇంటికి వచ్చినవారి కందరకు నీలాగున నన్నదానము చేసినచో నిక నగ్గితివే!

పెద్ద — వేమునిరాజ్యములో క్షామము లేదు నాయనా! కర్పూరభోగములు గాదిలో మూలుగుచున్నవి. తినువారు లేక నేను దేవులాడుచున్నాను.

విజ — అది గాదు అవ్వా!—

పెద్ద — ఇక నీవు మారు మాటాడినచో నన్ను చంపుకొని తినినట్లే. ఇదిగో ఈ ముంత మామిడిపప్పును కంచుకములో నుంచుకొనుము.

…జ — అవ్వా! చలిపందిరివలె నున్న ఈ వేముని రాజ్యమునుండి నన్ను సాగనంపుచున్నావు గదా. ఇతరసీమలు చూచి వచ్చిన పిమ్మట నా కీకొండవీటిసీమ నందనవనమువలె నున్నది. ఇచ్చట ముక్కరకు ముత్యములేని యాఁడుది, పొగాకు పచ్చలులేని మగవాఁడు కానరారుకదా! ఏమి యీ దేశ సౌభాగ్యము! ఇప్పుడే యిట్లున్నచో కాకతీయుల కాలములో నెట్లుండెడిదో!

పెద్ద — తరువాత వర్ణింతువుగానిలే. నాకుమాత్రము నిన్ను విడువవలె నని యున్నదను కొంటివా? నాదురదృష్టము! నీ దురదృష్టము! ఏమి చేయను? కొండవీటిసీమకు రాచకొండసీమకు యుద్ధము వచ్చిపడినది.

…జ — సరే కానిమ్ము. బ్రతికియున్నచో పునర్దర్శనము. (పరిక్రమించి) ఎక్కడికి పోవలెనో ఏమి చేయవలెనో నాకే తెలియకుండ నున్నది. కొండంత యాశతో నీ కొండవీటి సీమలో నడుగుపెట్టిన నాకు తుద కిట్టిగతి సంభవించినదికదా!

ఉ. చెలువపుదీవులై తగడు సీమల కెందును కొండొకంటితో
కలయికలేని యీ తెలుగుగడ్డను బుట్టిన రోషవహ్ని నా
తలపయి నిల్పి వ్రేల్చెదవు దారుణమే కద! దాసురాలిపై
చలువలు గ్రిమ్మరింపు మిక చంద్రకలాధర! మల్లికార్జునా!

[నిష్క్రమించును.]

రెండవరంగము

[ప్రవేశము: కృష్ణాతీరమున పాదచారియయి బలిష్ఠులగు వెలఁగురు యోధులతో పోరాడుచు అనపోతారెడ్డి]

…థ — పోడు, ఈ దెబ్బతో సరి, అయ్యకు పగ ప్రారంభమయినది.

…తీ — ఏమి పగర్పు. ఇప్పటి కార్వరను బలిపుచ్చుకొనినాడు. మనము బుద్ధిపూర్వకముగ మహామారితో యుద్ధము తెచ్చిపెట్టుకొంటిమి. ఈతనిని బ్రదికియుండగఁ బట్టుకొనుట బ్రహ్మాతరమా?

…తీ — ఛీ! ఛండాలుడా! తల్లికడుపు చెడబుట్టి పిరికిమాట లాడుచున్నావు!

…రీ — అబ్బ! అబ్బ! ఎంత దెబ్బరా - జబ్బ నరికినాడు. హా రెడ్డికులదీపకా! నిన్ను దొంగపోటున హత్యగావింప వచ్చినందులకు తగినశాస్తి జరిగినది.

…థ — ఛీ మూర్ఖుడా! గట్టిగా నరవకోక! రహస్యము భంగమగునని యెరుగవా?

తురీ — తేలు గుట్టి చచ్చినంత బాధ పడుచున్నాను. నీ కేమి ? నే నింక బ్రదుకను. ఇదేదో ఒంటిపూసతేలు కావలెను. రెడ్డివీరాగ్రణీ! నన్ను క్షమింపుము......

ప్రథ — అరే! వీ డెక్కడ దాపురించినాడురా! ఛీ, పిశాచమా !

[అని తురీయుని తల నరుకును.]

అన — (తనలో) వారిలో వారికి పోరాట మారంభ మగుటచే నింతవరకు ప్రాణము నిలుపుకొనుచు వచ్చుచున్నాను, గాని లేకున్న నీవరకే నాపని సరికావలసినది. (ప్రకా)—ఓరీ దేశద్రోహులారా! ఈ దెబ్బతో మీపని సరి.

ప్రథ — అబ్బో! ఈ సొరకాయకోతల కేమిలే.

ద్వితీ — అదిగో! దూరమున నేదో కాగడాకాబోలును, మినుకుమినుకు మనుచున్నది.

తృతీ — కాగడా కాదు; కొరవిదయ్యము.

ప్రథ — కొరవిదయ్యము కాదు, మిణుగురుబురుగులు.

ద్వితీ — మిణుగురుబురుగులు కావు. మనిషి నడచిన చప్పుడు వినబడుట లేదా ?

ప్రథ — నీ గుండెదడ నీ కట్లు వినబడుచున్నది. కొట్టు ఈదెబ్బతో నయ్యాపని సరి.

ద్వితీ — అబ్బ! ఎంతదెబ్బ తీసినాడురా! యువరాజా! యువరాజా!

ప్రథ — అరవబోక! అరవబోక!

[ తెరలో ]

ఓరోరీ! దేశద్రోహులారా!

మ. నిజతేజంబున నాంధ్రరాజ్యరమకున్ నీరాజనం బిచ్చుచున్
విజయూరామవసంతుడై వెలుగు నీవీరాగ్రణిన్ జంపి ధూ
ప్రజ కెల్లన్ దరిలేని యాపదల సూర్పన్ జూతురే దుర్జనుల్ ?
స్వజనద్రోహమె యాంధ్రదేశజుల కాధారంబె ? చాలింపుడీ.

తృతీ — (ప్రథమునితో) ఏమి గతి ?

ప్రథ — ముందుగ ఈకుంటికోడు నూడగొట్టవలెనుగదా !

[అని క్రిందబడి పొరలుచున్న ద్వితీయుని నరకును. ఇంతలో కరదీపిక నొకచేత గొని పురుషవేషమున విజయాంబ ప్రవేశించును.]

విజ — (తనలో) ఆకారము చూచినను వేషము చూచినను ఈతడు యువరాజుగ గన నచ్చుచున్నాడు, వీ రిరువురును ద్రోహులు.

[అని ఖడ్గము ఝుళిపించుచు ప్రథమునిపైకి బోవును. ఆతడు పరుగెత్తును. విజయాంబ యాతని వెంటా డించును.]

అన — (ద్విగుణీతోత్సాహముతో తృతీయునితో యుద్ధముచేయగ నాతడు పలాయితు డగును.) ఈయపురూపబాంధవు డెవ్వడో నాకు ప్రాణదాన మొనర్చినాడు. ప్రాణాధిక మగు పరువు నిలువబెట్టినాడు. కాని ఈ ద్రోహిని వెన్నంటి పట్టుకొనుటకు తగినశక్తి లేకుండ నున్నది.

[ఇంతలో విజయాంబ తిరిగి ప్రవేశించును.]

విజ — ఇరువురిలో నొకనినైన బాడుదలను బట్టుకొనవలెనని చూచితిని. గానిసాధ్యము గాకపోయినది.

అన — అయ్యయ్యో, మీచేత నున్న కరదీపిక యేమైనది? మీ రెవ్వరో యించుక పరిశీలింపవలె ననుకొంటినే.

విజ — రణకర్కశు లగు ఇరువురి తలలు నరకుసంరంభమున కరదీపిక నిలుచునా? ఇంక నిచ్చట నేమాత్రము కాలవిలంబన మొనర్చినను ప్రమాదకరము కావచ్చును.. మనము శీఘ్రము గ నగరమును చేరుకొనవలయును. అది ప్రప్రథమ కర్తవ్యము. ఈ ప్రాంత మంతయు మీకు కొట్టిన పిండియే కావున నించుక దారి తీయుడు.

[ ఇరువురును కొన్ని యడుగులు పరిక్రమింతురు. ]

విజ — మహాపురుషా! ఎంతప్రమాదము తప్పినది! ఎంతప్రమాదము తప్పినది!

అన — ప్రమాదమున కేమున్నది? ఒక్కజీవి హతుడైనంతమాత్రమున సూర్యచంద్రులు గతులు తప్పరు. బ్రహ్మాండము తలక్రిందులు కాదు. ప్రళయము వచ్చిపడదు.

విజ — సామాన్యజీవుల విషయములో మీరు చెప్పినది వాస్తవమే కాని మీవంటి కారణ జన్ముల కాపద వాటిల్లినచో నది దేశమునకెల్ల నుపద్రవకరము కాదా?

అన — అతిశయోక్తి నాదరించుట సజ్జనలక్షణము కాదే?

విజ — ఇం దతిశయోక్తి ఎంతమాత్రమును లేదని మీచేతనే ఒప్పింతును. ఇంచుక తాళుడు. సనాతన ధర్మ మనిన మీకు గిట్టదా?

అన — ఎంతమాట సెలవిచ్చితిరి. నా కది ప్రాణాధికముగాదా?

సీ. కలధౌత శిఖరంబు తలదన్ని యుదయించు మిన్నెటితరగను చిన్నపుచ్చి,
నందనోద్యానంబు క్రిందుమీ దనుపించు కాశ్మీరవనమును కాల దన్ని,
వెంటలేని గనులచే నలకాధిపతి నేలు హిమవన్నగశ్రేణి నీసడించి
కామధేనుగణంబు కన్నుసన్నలం గెల్చు గంగిగోవులమంద భంగపరచి

విశ్వకల్యాణనిలయమై వెలయుచుండు
పరమమాహాత్మ్యసౌందర్యభాగ్య కలిత
యల సనాతనధర్మంబు తల ధరించి
పూజ సలుపని భారతపుత్రు డున్నె ?

విజ — ఎంత చక్కగ వచియించితిరి. మీరు చెప్పినట్లుగ భూలోకస్వర్గమని ఖండాంతరములందు ఖ్యాతి గాంచిన భరతఖండమునందలి ప్రకృతిసంపద నంతను తులదూచినను యీ సనాతనధర్మముతో సాటిరాదుసుడీ.

అన — ప్రకృతిసంపద శాశ్వతమా ! భూగర్భపరిణామమును బురస్కరించుకొని యీ దేశమునను్న నదులును, పర్వతములునుగూడ మాయమై భరతఖండ మంతయు నొక పెద్దఎడారియైన గావచ్చును. కాని ప్రాచీనఋషులు ప్రపంచమున కనుగ్రహించిన సనాతనధర్మముమాత్రము విరుగని తరుగని పెన్నిధానము.

విజ — ఆర్యా ! సత్యము వచియించితిరి. రెడ్డికులతిలకులు కవిపోషకు లని వినుటయే కాని కవు లని వినలేదు. మీ వర్ణనామాహాత్మ్యమున సనాతనధర్మము కన్నులకు గట్టిన ట్లున్నది. ఓ సనాతనధర్మదేవతా !

ఉ. వేదపురాణశాస్త్రమయవేదిక నీదగు పుట్టినిల్లు ; త్యా
గాది సమస్త సద్గుణ నికాయము సమ్రగులు తోడబుట్టువుల్ ;
భేదము లేని సత్యమయపీఠము కొల్వొనరించు గద్దె ; మో
దోదయ రాగరంజిత సముజ్జ్వలలోచన ! నీకు మ్రొక్కెదన్.

ఆర్యా ! అట్టి సనాతన ధర్మమునకు దారుణమైన గ్లాని సిద్ధింపనున్నదిగదా !

అన — అవును. నూతనముగ సత్యమును సందర్శించిన యుత్సాహముచే నుద్రేకించి మ్లేచ్ఛజాతులు ఈ సనాతన ధర్మమును సమూలముగ నాశనము చేయవలెనని చూచుచున్నవి.

విజ — ఇంతవరకు మన యాంధ్రదేశములో నైన సనాతనధర్మమునకు తల దాచుకొనుటకు తావు దొరకెడిది.

అన — ఇప్పు డా యవకాశముకూడ లేకుండ బోవుచున్నదిగా ! అంతఃకలహములచే నాంధ్రదేశము శమంతపంచకమువలె నున్నది.

విజ — అట్టిచో నీ యంతఃకలహము లన్నిటిని అడచివైచి యాంధ్రసామ్రాజ్యమును స్థాపించి సనాతనధర్మమునకు కల్యాణమంటపము నిర్మింపగల మీవంటి వీరపురుషుల జీవితములు దేశమున కెంత యమూల్యములో వేరుగ వివరింపవలయునా ?

అన — ఆంధ్రులకు సామ్రాజ్యభాగ్యమా ? అది కలలోనివార్త !

విజ — అటు లనకుడు. ఆంధ్రమాత యిప్పుడు నెలలు నిండిన చూలాలివలె నున్నది. నేఁడో రేపో సామ్రాజ్యోదయము కాక తప్పదు. ఈ చూలాలిని సంరక్షించుకొనవల సిన భారము మీవంటి శూరాగ్రేసరులపై నున్నదిగదా!

అన — (తనలో) ఈతని స్వరములో స్త్రీజనోచితమగు లాలిత్యము గనవచ్చుచున్న దే! చిత్రముగనే యున్నది. (ప్రకాశముగ) మిత్రమా! నేటి ఈ యుపద్రవమును నేను దాటుటవలన దేశమున కెట్టి యుపకృతి జరగినను జరుగకున్నను మీవంటి యపురూప వ్యక్తుల మైత్రి లభించుటవలన నా జీవితకుసుమమున కొక నూతనసౌరభము సిద్ధించినది.

విజ — ఆర్యా! నే ననవలసిన మాటను మీ రనుచున్నారు.

అన — కాదు, కాదు.

ఉ. చీకటిఁ జీల్చి నాహృదయసీమను దోఁచ్చి గలంచి యాడు ది
వ్యాకృతి, మానవాభ్యుదయబంధుర గానరసాన్వితంబు గాఁ
బైకొను గాత్రమాధురి, యపారవిలాసము జిల్కు పల్కులున్
లోకము లేలఁజాలు నతిలోకమహత్త్వము జాటి చెప్పెడిన్.

నా కీ దినమున నెన్ని యోజన్మములు కలసిమెలసి తిరిగిన ప్రాణమిత్రుని — వియోగానం తరము — మరలఁ గలసికొనిన ట్లున్నది గాని క్రొత్తవ్యక్తిఁ గలసికొనినట్లు లేదు.

విజ — (తనలో) హృదయమా! అప్పుడే పొంగిపోకుము. ముం దున్నది ముసళ్ల పండగ. (ప్రకాశముగ) ఆంధ్రజాతియాభ్యుదయమున కాశాంకురములై రెడ్డిరాజ్య స్థాపనకు వంశాంకురము లయిన మీవంటివారు మావంటి నిరుపేదల సహవాసము నింతగఁ గొనియాడవచ్చునా? అతిశయోక్తి నాదరించుట సజ్జనలక్షణము కాదే?

అన — (తనలో) ఆహా! ఏమి యీ గళమాధుర్యము.

ఉ. చల్లని నారికేళఫలసారములై యలరారు నీరనుల్
మల్లెలతో వసించి యసమానపరీమళయుక్తమాధురిన్
జల్లి నరీతి నీ స్వనము సౌఖ్యము గూర్చును పల్కుపల్కునన్
తెల్లము జేడు మాకు కులదేవత లిట్లు ప్రతిధ్వనించెడిన్.

(ప్రకాశముగ) మిత్రమా! నీ వాక్యరచనాపాటవము న న్నెచటికోఁ దీసికొనిపోవు చున్నది.

సీ. ఆకాశవీథిలో నాటలాడుచు నున్న తారకానన్యక్యంబు ద్రచ్చి తెచ్చి,
రజతాద్రిశిఖరిపై రాజ్య మేలుచునుండు నీహారధావళ్య మాహరించి,
ఊర్మిమాలికలలో నుయ్యాల లూగెడు నెలయేటిచలువతోఁ జెలిమి నెరపి,
పుష్పసంతతులతో పొరలి పొంగి చరించు నవవసంతంబుతోఁ బవరమాడి,

ప్రాథగుణముల నొప్పు నీ వాక్యరచన
మస్మదీయ మనోవీథి నవతరించి
జ్ఞప్తి కొదవించు నెన్నియో జన్మములను
వర్ధనము నొందు సౌహార్దవైభవంబు.

నీ స్వరూపమును సరిగా గ్రహించుటకు వీలు లేకుండ నీ కటికిచీకటి యడ్డు వచ్చుచున్నది గదా!

విజ — ఒక్కమీకు నాకు ననసేల ? ఆంధ్రజాతి కంతకును ఇదే యడ్డువచ్చుచున్నదిగదా!

[ ఇంతలో కొందరు భటులు కరదీపికలతో ప్రవేశించి యనపోతారెడ్డిపాదములపై వ్రాలుదురు. ]

ప్రథ — మహాప్రభూ! ఇంత యాలస్యము చేసితి రేమి? మిమ్ముఁ జూచువరకును మా బొందిలో జీవుడు లేడు.

ద్వితీ — అమాత్యశేఖరులు మీకయి పడుచున్న యారాటమునకు మేర లేదు.

తృతీ — అందరిని అన్ని దిక్కులకు బంపినారు. మా యదృష్టవశమున మేము మిమ్ము కనుఁగొనగలిగితిమి.

అన — నా యదృష్టవశమునను ఈ యాపద్బాంధవుని సాహాయ్యముకతమునను నేను మిమ్ము మరల చూడఁగల్గితిని. అయ్యయ్యో! నా నిమిత్తమయి మహామంత్రు లెంత శ్రమపడవలసి వచ్చినది! ఇదిగో పట్టము సమీపించితిమి.

ప్రథ — తమ గుఱ్ఱ మేమయినది?

అన — అన్నియు సావకాశముగఁ జెప్పెదనుకాదా! అశ్వారూఢు లయి యా వచ్చుచున్నది యమాత్యశేఖరులు గారా? (తనలో) భగవానుడా! ఏమిగతి? ఈ యాపద్బాంధవునికూడ వా రంగీకరింపరేమో?

విజ — (తనలో) తిరిగి తిరిగి మరల మొసలినోటిలోనికే వచ్చి పడితినే! ఏమి గతి? ఈతని నిప్పు డెట్లయిన తప్పించుకొనవలెను — (ప్రకా) మహాపురుషా! నాకు సెలవు దయచేయుడు. మరల రేపుదయమున తమ దర్శనమునకు వచ్చెదను.

అన — ఇంతవరకు నాకాశపురాణములతో కాలక్షేపమయినది గాని యవ్యాజమిత్రు లగు మీ పూర్వోత్తరముల నయిన దెలిసికొనఁజాలకపోయితిని.

విజ — క్షణభంగురము లగు తనువులనుగూర్చి యెంత తెలిసికొన్న నేమి ప్రయోజనము? మన మిప్పు డనశ్వర మగు నాత్మసంబంధ మేర్పచుకొంటిమి చాలదా?

అన — వేదాంతవాక్యములతో విందు చేయుటకు నేను సమర్థుడను గాను. మీరు నా యందు దయయుంచి కొన్ని దినములయిన నా యాతిథ్య మంగీకరింపవలయును.

విజ — అంతకంటెనా ? కాని ప్రకృత మీాయూర మా పినతల్లికూతు రుండుటచే నామెకు ప్రాణము మీాదకు వచ్చిన దనువార్త వచ్చి బయలుదేరితిని. అందుచే నా మనస్సు మనస్సులో లేదు – నన్ను పోనిండు.

అన — మీా పినతల్లికూతురా ? ఎవ రామె ?

విజ — అన్నియు రేపు సావకాశముగ నాయంతట నేనుగ వచ్చి మీాకు మనవి చేసి కొందును – ప్రస్తుతము నాకు సెలవు దయచేయుడు.

అన — మీా కంత యాత్రతగ నున్నపుడు నేను నిలుపరాదు. సదా కృతజ్ఞుడను.

[ విజయాంబ నివర్తించుచుండగ రామప్పెగ్గడ ప్రవేశించును.]

రా — ( విజయాంబవంక నిదానించి చూచుచు ) కుమారా! ఎవ రీ క్రొత్తవ్యక్తి ?

అన — ( వినిపించుకొనక తదేకదృష్టితో విజయాంబ నీక్షించుచు ఆత్మగతమున ) ఇంత వరకు చీకటి మైపోయినది గాని ఇప్పు డీ దీపసమీాపమున నీ వ్యక్తిని సందర్శింపగనే విద్యుల్లత మెరసిన ట్లయినది. ఏమి యీా మనోవికారములు !

చ. చకితము లైన భావములు చంచలనంబును నొందు ఆత్మయున్
వికలము లైన చేష్టలును పెక్కుపమై రొదు రీదు రాగమున్
ద్రికమక పెట్టు కోరికలు త్రెంచుకపోవగనీనిబంధమున్
సకియలపట్ల పూరుషుల సంభ్రమమున్ దలపించె నిత్తరిన్.

ఛీ! ఛీ! ఈ తుచ్ఛభావములను నిర్మూలింపవలెను.

రా — కుమారా! ఎవ రీ క్రొత్తవ్యక్తి ?

అన — ( ఉలికిపడి ) ఓహో అమాత్యశేఖరులా ! నమస్కారములు. మీా మాట పెడచెవిని బెట్టినందులకు తగిన శాస్తి యయినది. అంతయు సావకాశముగ మనవి చేసెదను.

రా — అటులే కానిమ్ము. కాని ఎవ రీ క్రొత్తవ్యక్తి ?

అన — ప్రకృతము నాకు ప్రాణదాన మొనర్చిన మహోపకారి యని మాత్రము చెప్ప వలసియున్నది. అంతకంటె నేనును చెప్పజాలను.

రా — ఆలాగునసా? పాపము ! నీవు చాల బడలియున్నట్లు కనంబడుచున్నది. అలయిక దీర్చుకొనినవెనుక సావకాశముగ ముచ్చటించుకొందము.

అన — అమరేశ్వరుఁడు మాపాల నున్నాడు. లేకున్న ఈసరికి నే నేలోకమున నుండ వలసినదో ? రండు మనవి చేసెదను.

[అందరును నిష్క్రమింతురు.]

## మూఁడవ రంగము

[ప్రదేశము : ధరణికోటలో ననపోతారెడ్డి యభ్యంతర మందిరము. ప్రవేశము : సుఖాసీనులయి, రామా ప్రెగ్గడ, అనపోతారెడ్డి.]

రా — ఈ క్రొత్తవ్యక్తిని గూర్చి నా కంతయు ననుమానముగనే యున్నది. తుదకు స్త్రీవ్యక్తియో పురుషవ్యక్తియో నిర్ణయించుటకూడ కష్టసాధ్యముగ నున్నది.

అన — సాంద్ర మగుననురాగమునకు తోడినీడనై యనుమానము సంచరించుచుండును. మా వంశముపై నున్న వాత్సల్యముచే మీ కిన్ని యనుమానము లుదయించుచున్నవి.

రా — నాయనుభవములో నే నెన్ని చూచినాను గాను? మొట్టమొదట మనకు విశ్వాస ముదయింపజేయుటకై ఏదో స్వల్పమైనయుపకృతి చేసి మన మెప్పును గడించి మన రహస్యము లన్నియు గనిపెట్టి శత్రుకార్యమును సాధించువారు లేరా?

అన — ఉండవచ్చును. కాని ఈతడు మనకు చేసిన యుపకృతి స్వల్ప మయిన దందురా? అదిగాక ఈ వ్యక్తిముఖము చూడగనే ఈతని కట్టి కౌటిల్యము అసాధ్య మని తోచుచున్నది. హృదయమునకు గవాక్షమువలె నున్న యా కన్నులలోనుండి అంతరంగమునందలి పవిత్రత ప్రత్యక్ష మగుచుండుటలేదా?

రా — నే నెక్కుడుచనవు తీసుకొనుచున్నందులకు మన్నింపవలయును. ఆ చూపులలో నొకవిధమయిన బెదరున్నది. ఆ నడకలో నొకవిధమయిన యొయ్యార మున్నది. ఈవ్యక్తి అచ్చముగ స్త్రీలు నవ్వినట్లు నవ్వును. నన్నడిగినచో నాతనిలో నంతర్భూతమైయున్న స్త్రీత్వము మిమ్ము గాఢముగ నాకర్షించుచున్నదేమో యని నా సంశయము.

అన — (తనలో) కా దని నేనును చెప్పజాలను. (ప్రకాశముగా) హరిహరీ! పురుషులను పురుషులు వలచుట ప్రకృతివిరుద్ధము కాదా! పోనిండు. వాదమునిమిత్తము మీరు చెప్పినదే సత్య మని యొప్పుకొన్నను అతనికి ఈ దినమున మనము చేయబోవుచున్న పట్టాభిషేక మెద్దియును లేదుకదా. తుద కింతవరకు నాతనిని కోటలో నడుగు పెట్టనీయనైనను లేదు.

రా — అత డీ నగరమున నుండుటయే నాకు సమ్మతము గాదు.

అన — మనకుఁ బ్రాణదాన మొనర్చిన పరమోపకారికి ప్రత్యపకృతి నగరము వెడల నడిపించుటా?

రా — రాజకీయములలో అనుమానమే ప్రమాణము.

అన — అనుమానమున కేదైన నాధార ముండవలదా?

రా — తీర నేదైన నపకృతి జరిగినచో చేయఁదగిన ప్రతీకార ముండకపోవచ్చును.

అన — ఈతీరున ననుమానింపఁ గడగినచో మన యొక్క మిత్రునయిన గణింపలేము. నన్ను మీరు, మిమ్ములను నేను అనుమానించుకొనుచు కూర్చుండవలసివచ్చును.

రా — నా యనుమానము అంత హాస్యాస్పదముగ నున్న దందువా?

అన — ఈమాత్రము సాహసమునకు నా కనుజ్ఞ నిండు. ఇంతమాత్రమున మించిపోవున దిలేదు. అతడు మన నగరమున నడుగుపెట్టినదిమొద లీ నగరమునకు నొక నూతన వికాసము వచ్చినట్లుగఁ దోచుచున్నది.

రా — నీ యిష్టప్రకారమే కానిమ్ము. కాని కడు జాగరూకతతో మాత్రము మెలగ వలయునుసుమా! మీ యింట నేదేని యొకటి పుట్టినచో అది నాతలనే నిలుచును.

[ ప్రవేశము ద్వారపాలకుడు. ]

ద్వా — దేవా! మాదాసీనియొద్దనుండి యభ్యంతర సందేశహారి వచ్చి వాకిట నిలువఁ బడి యున్నాడు.

అన — మహామాత్యు లిచ్చటనే యున్నారు, రమ్మని చెప్పుము.

ద్వా — మహాప్రసాదము.

[ నిష్క్రమించును. ]

అన — ఇప్పు డీక నభ్యంతరసందేశ మొందులకో!

రా — ఇది యంతయు నొక నాటకము. నీకు తరువాత చెప్పెదనులెమ్ము.

[ సందేశహారి ప్రవేశించును. ]

రా — ఓయీ! నీ వాయాసనమున నాసీనుఁడవు కమ్ము.

సం — చిత్తము. (అని యాసనమును చేతితో స్పృశించి నిలువబడియేయుండి) దేవా! శ్రీమన్మహామండలేశ్వర, రేచర్లగోత్రచింతామణి, జగనొబ్బగండ, రాయగండభేరుండ, రాయబందీవిమోచక, కాకతీయరాజ్యస్థాపనాచార్య, సోమకులపరశురామాది జగత్ప్రసిద్ధ

బిరుద నామధేయ ప్రశస్తి సహితులయిన శ్రీ సింగమనాయని యనపోతనాయనింగారు సెలవిచ్చిన యభ్యంతరసందేశమును సావధానచిత్తులరై యవధరింప బ్రార్థితులు.

రా — ఓయీ! యువరాజులుంగూ రసహితచిత్తులై యున్నారు. నీ తెచ్చిన సందేశమును సాకల్యముగ విశదీకరింపుము.

సం — "ఆంధ్రక్షమామండలేశ్వరుల మగు మాయాజ్ఞను దిరస్కరించి మాకోపాగ్నికింధనములు గాకుడు. సోమకులపరశురాముల మగు మాయాగ్రహమునకు గురియైన జల్లిపల్లిలో రాజవంశముల కెట్టిగతి పట్టినదో మీ యెరుగనిది కాదు. శ్రీసింగమనాయనింగారివధలో మీరుగూడ కొంతచేయిచేసుకొన్నట్లుగ ఇటీవల మాకు దెలియవచ్చుచున్నది. దాని కపరాధముగ మీరు ధరణికోటను మాకర్పించినచో మీ నేరము క్షంతవ్యమగును. ఎప్పటియట్లు సార్వభౌమునికిఁ గట్టవలసిన కప్పమును గట్టుట కంగీకరించినచో ఆనెగొందెనాయకుడగు హరిహరరాయలను జయించి కప్పము గ్రహించు నధికారము మీ కొసంగబడును."

దేవా! నా తెచ్చిన సందేశమును నేను వినిపించినాడను.

రా — ఓయీ! ఇప్పుడు నీసందేశములో రెండు నూతనాంశములు గోచరించుచున్నవి. అందు మొదటిది - సింగమనాయనివధతో మాకుగూడ సంబంధము కల్పించుట. ఇది యభూతకల్పనము. ధరణికోటపై దండయాత్రకు సక్రమమయిన హేతువు లభింపక పోవుటచే లోకమును వంచించుటకు ఎత్తిన యెత్తు. ఇట్టి నీలాపనిందలు మోపుటవలన ప్రయోజన ముండదని నిష్కర్షగ చెప్పుము. ఇక రెండవయంశము-ఆనెగొందెను జయించి వారికి సమర్పించినచో కప్పము గైకొనునధికారము మా కనుగ్రహింతు రనుట. ఎంత యుదారస్వభావము! మా సేనలతో, మాశౌర్యముతో, మాధనవ్యయముతో నానెగొంది సీమను జయించి తమకు స్వాధీనపర్చునధికారమును మాకు గృపచేయుచున్నారా? తమ రానెగొందెను జయించి మావశము చేసినచో మేమే తమ కట్టి యధికారమును ప్రసాదించెద మని చెప్పుము. ఇట్టి శుష్కసందేశముల యంతరార్థము మేము గ్రహింపక పోలేదు. నీవు సెలవు గైకొనవచ్చును.

సందే— (అనపోతారెడ్డిమొగమువంక జూచును.)

అన — మహామాత్యులవారు మామనస్సును పూర్ణముగ విప్పి చెప్పినారు. ఇక మేము వేరుగ చెప్పవలసిన దెద్దియును లేదు.

సందే— దేవా! పనివినిమెదను.

[నిష్క్రమించును.]

రా — అభ్యంతర సందేశముపేరు చెప్పి మనప్రయత్నములను దెలిసికొనవలెనని వారి యాశ.

స — అవును. తెలియుచునేయున్నది; కాని మన జాగ్రత్తలో మన మున్నాముగదా! దానికేమిగాని సోమకులపరశురాములట వింటిరా?

౦ — పది చప్పిడిపద్యము లల్లి "కవిరాజకంఠీరవు" డని బిరుదువహించుట యెంత అందముగ నుండునో పదిమంది భట్రాజులను వధించి సోమకులపరశురాముల మను కొనుటయు అంతే యందముగ నుండును.

స — రాయబందీవిమోచకులట!

౦ — ఆటంకే మేమి? ఇతరు లొనర్చిన పరాక్రమకృత్యములను స్వకీయములుగ భావించుకొనుట కెంతటి సమబుద్ధి యుండవలయును?

స — కాకతీయరాజ్యస్థాపనాచార్యులట.

౦ — ఇంతకంటె శార్దూలము హరిణరాజ్యస్థాపనాచార్యబిరుదము వహించిన నుచిత ముగ నుండును.

స — ఇంకను కాకతిసామ్రాజ్యస్థాపన మెక్కడ? తనంత తానుగ వలచివచ్చిన భాగ్య దేవత మనమనస్పర్థలకు నిలువజాలకుండ నున్నది.

ఉ. భారతమాతృగర్భమునఁ బండిన రత్నము లాంధ్రలక్ష్మికిన్
గౌరవకంఠహారముగ గానుక దెచ్చిన భాగ్యదేవతా!
జారెదవేల సిగ్గుపడి? చావఁగ లేరు తెనుంగుభూమిలో
పౌరుష మింతవట్టునకు; భావిగతిం దలపోయ నేటికిన్?

౦ — నీవు చెప్పిన ట్లున్నంతలోఁ బౌరుషము నాశ్రయించుకొని ప్రయత్నింపవలసి నదేకాని విచారించినచో లాభము లేదు.

అదిగో! కాసెకోకలు బిగించుకొని యాంధ్రవీరులు యుద్ధసన్నద్ధు లయి నిలువబడి యున్నారు.

స — (ఆసనమునుండి లేచి దృష్టి సారించి) ఆంధ్రదేశసేవాపరాయణులగు నో మహా వీరులారా!

సీ. హస్తిబృంహితముతో నమరేశ్వరుని పాద ఘంటికానినదంబు గడలుకొనగ,
భేరీరవంబులో వీరగాథాపూర్ణ ప్రాచీనభారతి ప్రతిరవింప,
జయపతాకములపై జాతీయవీరుల నిర్నిద్రరేఖంబు నృత్యమాడ,
కరవాలరుచులచే దరహాసకాంతితో దులపించు జయలక్ష్మి పులకరింప
రక్తనాళంబు లదుకెక్క రణవినోది
ఖేలనాసక్తి లీలమై క్రేళ్లువార
ధర్మసంస్థాపనార్థమై ధాన్యవాటి
నాంధ్రపుత్రులు రణసీమ కరుగుడయ్య.

[నిష్క్రమింతురు.]

# కవితా! ఓకవితా!

శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు

కవితా! ఓకవితా!

నా యువకాశల నవపేశల
సుమగీతావరణంలో
నిను నే నతిసుందరసుస్పందనమందున
దూరంగా వినువాకుల్లో విహరించే
అందని అందానివిగా,
నీకై బ్రతుకే ఒక తపమై
వెనుకాడే నిమిషాలందు నిషాలందున
ఎటు నే చూచిన చటులాలంకారపు
మటుమాయల నటనలలో
నీరూపం కనరానందున,
నాగుహలో, కుటిలో, చీకటిలో
ఒక్కడనై స్రుక్కినరోజులు లేవా?

నీ ప్రాబల్యంలో
చిరదీక్షాశిక్షాతపస్సమీక్షణలో
నిశ్చల సమాధిలో
స్వర్గద్వారపుతోరణమై వ్రేలిన నా
మస్తిష్కంలో
ఏవేవో ఘోషలు భాషలు
దృశ్యాల్ తోచాయో
నే నేవో చిత్రవిచిత్రశ్యమంత
రోచిర్నివహం చూశానో
నాగీతం ఏవేవో శక్తులలో ప్రాణ
స్పందన పొందిందో
నీకై నే నేరిన వేవేధ్వనులలో
ఏవేవోమూలల వెదికిన ప్రోవుల
ప్రోవుల రణన్నినాదాలో
నడిరే యాకస మావర్తించిన
మేఘా లావర్షించిన
ప్రచండఝంఝా ప్రభంజనం
గజగజ లాడించిన
నడిసంద్రపు కెరటాల్లో మ్రోగిన
శంఖారావం ఢంకాధ్వానం,
ఆరాత్రే కారడవుల్లో
లయాతీతమై విరుతించిన
నానా జంతుధ్వనులలో,
నక్షత్రాంతర్నిబిడ నిఖిలగానం,
భూకంపాలు, విప్లవం, యుద్ధం,
ప్రభుత్వపతనాలు, అన్నీ నీచైతన్యం!
నీ విశ్వరూప సాక్షాత్కారం!
మరి నిన్ను స్మరిస్తే
నా కగుపించే దృశ్యాలా?
వినిపించే భాష్యాలా ?
అగ్నిసరస్సున వికసించిన వజ్రం!
ఎగిరే లోహశ్యేనం!
ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం!
ఇంకా నే నేం విన్నానా ?
నడిరేనిద్దురలో
అపుడే ప్రసవించినశిశువునెదద నిడుకొని
రుచిరస్వప్నాలను కాంచే
జవరాలి మనఃప్రపంచపుటావర్తాలు,

సువు చిత్రనిద్రలో ప్రాచీన
స్మృతు లూచే చప్పుడు,
వైద్యశాలలో
స్త్రకారుని మహేంద్రజాలంలో
చావు బ్రదుకుల సంధ్యాకాలంలో
కన్నులు మూసిన రోగార్తుని
రక్త నాళ సంస్పందన,
కాలువ నీళుల్లో జారిపడి
కదలగనైనా చాలని
త్రాగుబోతు వ్యక్తావ్యక్తాలాపన
ప్రేలాపన,
కడుపు దహించుకు పోయే
పడుపుగత్తె రాక్షసరతిలో
అర్ధనిమీలిత నేత్రాల
భయంకర బాధల పాటల పల్లవి,
ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం,
ఉన్మాది మనస్సినీవాలిలో
ఘూకం కేకా, భేకం బాకా,
సమ్మెకట్టిన కూలీల
సమ్మెకట్టిన కూలీల భార్యల బిడ్డల
ఆకటి చీకటి చిచ్చుల
హాహాకారం, ఆర్తారావం,
ఒక లక్ష నక్షత్రాల మాటలు,
ఒక కోటి జలపాతాల పాటలు,
శతకోటి సముద్రతరంగాల మ్రోతలు
విన్నానమ్మా విన్నానెన్నో విన్నాను.
నావిన్నవి కన్నవి విన్నవించగా
మాటలకై వెదుకాడగబోతే
అవి పుంఖానుపుంఖంగా
శ్మశానాలవంటి నిఘంటువుల దాటి
వ్యాకరణాల సంకెళ్లు విడిచి
ఛందస్సుల సర్పపరిరంభం వదలి
వడిగా వడివడిగా వెలువడినై !
పరుగిడినై ! నాయెద
నడుగిడినై !
ఆచెలరేగిన కలగాపులగపు
విలయావర్తపు
బలవత్ ఝరవత్ పరివర్తనలో
నే నేయే వీధుల్లో
చంక్రమణం చేశానో
నా సృష్టించిన గానంలో
ప్రక్షాళితమామకపాపపరంపర
లానందవశంవదహృదయుని జేస్తే
నీకొరకై మేలుకొనిన
సకలేంద్రియములతో
ఏది రచిస్తున్నానో చూస్తున్నానో
ఊపిరి తీస్తున్నానో
నిర్వికల్పసమాధిలో
నాప్రాణం నిర్వాణం పొందిందో
అటు నను మంత్రించిన
సమ్ముగ్ధం కావించిన ఆగాంధర్వానికి
తారానివహప్రేమసమాగమంలో
జన్మించిన సంగీతానికి
నానాడుల తీగలపై సాగిన
నాదబ్రహ్మపు పరిచుంబనలో
ప్రాణాపానవేళాజనితం
నానాగానానూనస్వానావళితం
బ్రదుకును ప్రచండభేరుండగరు
త్పరిరంభంలో పట్టినగానం
సుఖదుఃఖాదిక ద్వంద్వాతీతం

అమోఘ మగాధ మచింత్య మమేయం
ఏకాంతం ఏకైకం
క్షణికమై శాశ్వతమైన దివ్యానుభవం
బ్రహ్మానుభవం కలిగించిన
నను కరగించిన కవనఘృణీ!
రమణీ! కవితా! ఓకవితా!

నాజనని గర్భంలో
ఆకారం లేకుండా నిద్రిస్తూన్న
నా అహంకారానికి
ఆకలి గొల్పించిననాడో
నా బహిరంతరింద్రియాలలో
ప్రాణం ప్రసరించగ నేనీ భూలోకంలో పడి
సుఖదుఃఖా లేవేవో
వస్తూంటే తలదాలిచి
ప్రపంచపరిణాహంలో
ప్రయాణికుడనై
పరివ్రాజకుడనై
విహ్వలంగా వర్తించేవేళ
అభయహస్తముద్రతో నను దరిసిన,
నన్ను పునీతుని
కావించిన కవితా! లలితలలిత
కరుణామహితా! అనుపమితా!
అపరిమితా! కవితా! ఓకవితా!

నేడో నా ఊహాంచల
సాహసికాంసం కప్పిన నా
నిట్టూర్పులు వినిపిస్తాయా
నే నేడో విరచిస్తానని
నా రచనలలో లోకం ప్రతిఫలించి
నా తపస్సు ఫలించి
నా గీతం గుండెలలో ఘూర్ణిల్లగ
నా జాతిజనులు పాడుకొనే
మంత్రంగా మ్రోగించాలని
నా ఆకాశాలను లోకానికి చేరువగా
నా ఆదర్శాలను
సోదరు లంతా పంచుకొనే
వెలుగుల రవ్వల జడిగా,
అందీ అందకపోయే
నీ చేలాంచలముల విసరుల
కొనగాలులతో నిర్మించిన
నా నుడి నీ గుడిగా
నా గీతం నైవేద్యంగా హృద్యంగా
అర్పిస్తానో
నా విసరిన రసవిస్మృమర
కుసుమపరాగం
ఓహో ఓరసధుని! మణిఖని! జననీ!
ఓ కవితా!
కవితా, కవితా, ఓ కవితా!

---

# చర్చ

## "కవిత్రయమువారు అఖండయతి పాటింపలేదు"

### శ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీ గిడుగు వేంకట సీతాపతిగారు ౧౯౩౯ సం ఆగస్టు నెల భారతిసంచికలో 'కవిత్రయమువా రఖండయతిని పాటించినారు' అను శీర్షికతోఁ బ్రకటించిన వ్యాసమున గతవత్సరములో జూలై నెల భారతి పత్త్రికయందు నాచే ననుమతములు నసంగతములని నిరూపింపఁబడి శ్రీ గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారిచే 'అప్పకవీయ విమర్శన మున' నఖండయతి సందర్భములో పరిష్కర్తలు పరిష్కరించుటచే కొన్నిచోట్ల అర్థము పాడయినది. 'నీలశీ తాంశు నీల నాత్మేసించి, నల్లనై తోఁతెంచు నట్టి తను వు' అని ఉంటే 'అట్టితనువుకు బదులుగా 'నల్లగృహము' అనిఅచ్చువేయించినారు. దీనికి అర్థమేమి?" అని వ్రాయఁ జేసిన వ్రాఁతలెల్ల ప్రమాదములని స్పష్టముగా జెప్పికొని నారు. ఇఁక సీతాపతిగారీ వ్యాసమునఁ బూర్వలాక్షణి కులనుండి సంగ్రహించుకొనినవియు భారతము నెల్లఁ బరిశోధించి తా మేర్చి కూర్చినవియుఁ దెలుఁగుపత్త్రి కలో నిదివఱలో నుదాహరించినవియుఁ గవిత్రయము వారిలో నఖండయతి గలదను తమసిద్ధాంతమున కెల్ల నాధారభూతము లగునవియు మొత్తము భారతము నుండి యఖండయతిపాఠములఁ బండ్రెండింటి నుదాహరించి సమాధాన మీయవలసినదిగాఁ గోరిరి. పంతులుగారు వానిలోఁ గొన్నిఁటి నుదాహరించి అప్పకవీయ విమర్శనమున "పండితమ్మన్యులగు పరిష్కర్తలు వ్రాఁతప్రతులను పరిశోధింపక గ్రంథములనెల్ల దిద్ది తారుమారొనరించి" రని వ్రాసిరి. ఇప్పుడు సీతాపతిగారును నిట్టియభిప్రాయమునే వెల్లడించినారు. పరిష్కృతములని వీరు చూపిన పాఠములు 'ఓరియంటల్ లైబ్రరీ'లోని వ్రాఁతప్రతులలో బహుళముగానే యున్నను మచ్చున కొకటి రెండు ప్రతులు మాత్ర ముదాహరించుచు నాయా పాఠముల సందర్భమున సీతాపతిగారి వ్రాఁతల నవసరముగు నంతవఱకు ననువదించి సమాధానము వ్రాసెదను. "  " ఇట్టిగుర్తులలో నుండునవి వీరి వ్రాఁతలు.

౧. "కొడుకుం ద్రిలోకవిజయుం
బడయుటకని ఘోరమగు తపం బొనరింపం
దొడఁగె సురరాజు నెడలో
నిడికొని యేకాగ్రబుద్ధి నిష్ఠాత్ముండై"

—ఆది. ౫ఆ., ౧౨౧ప.

"నిష్ఠాత్ముండై" అనుటకు బదులుగా 'నేకాంత మునఁ' అని అచ్చులో మార్చినారు "నిష్ఠాత్ముండై" అని కవిహృదయమైనట్లు దాని తరువాతి వచనములో 'ఇట్లతినిష్ఠ నేకపాదస్థితుండై' అని ఉండడమువల్ల స్పష్టము."

పై పద్యమునఁ బాలప్రతులు పరిశోధించితిని. వీ రచ్చులో మార్చినారని వ్రాసిన 'ఏకాంతమునఁ' అనుపాఠమే వ్రాఁతప్రతులలో నాకగపడినది. (చూ. ౧౦-౫-౬, ౧౧-౧౫-౮ ప్రతులు. భారతము లక్ష్మీపతి సోమయాజులవారి తాళపత్త్రిగ్రంథములోఁగూడ 'ఏకాంతమునఁ' అనుపాఠమే కలదు. నా పరిశోధించిన ప్రతిలో నొకచో మాత్రము 'నిష్ఠాత్ముండై' అను పాఠము కలదు. అప్పకవీయవిమర్శనమున వీ రిట్టి పాఠమునే యుదాహరించి యఖండయతికి లక్ష్యముగాఁ జూపిరి. ఇప్పు డీపాఠమునే కొందఱు 'నిష్ఠాత్ముఁడు'గా సంస్కరించిరి. పైపాఠమున యథాశ్రుతముగా 'ఇష్టాత్ముఁడ'ని గ్రహించుచో నఖండయతి కిది లక్ష్యము గాఁజాలదు. ఇఁక 'ఏకాంతమునఁ' అనుపాఠ మేదోషమును నెట్టిసంస్కారా

ప్రతిలోను వావిళ్లవారి ప్రతిలోను ముద్రితపాఠ మున్నది. సీతాపతిగా రుదాహరింప మెంచినారు. అప్పకవీయ ములోమాత్రమీ పద్యము "......సం॥ పారఁ జనుచున్న గాని దివిజారి..." అని యుదాహరింపఁబడినది. ముద్రిత ప్రతి పాఠ మని పైని నాయుదాహరించినపాఠమే వ్రాఁత ప్రతులలోను గనఁబడినది. (చూ ౧౩-౩-౨౨, ౧౧-౧౫-౬.) ఈపద్యముక్రిందఁగూడ వీరు చూపిన యాశ్వాససంఖ్య సరిగా లేదు. ఇది ఆఱవయాశ్వాసము లోనిది. వీరి యప్పకవీయవిమర్శనమునఁగూడ నీపద్య మట్టి ప్రమాదముతోడనే ప్రదర్శింపఁబడినది.

౬. "అనుజపక్షముగ్రలే నిమ్మహోచలమున
వాఁటఁగోలె నెచ్చటికి నరుగనేర.
—అర. ౭-౭౧.

'వాఁటఁగోలె నెచ్చటికిఁ జనంగనేర' అని ఒక తన్ను, 'అంతఁగోలె నెచటికి నరుగనేర' అని ఒక తన్ను దిద్దినారు.

పరిష్కృతము లని వీ రుదాహరించిన పాఠము లో మొదటిపాఠము వ్రాఁతప్రతులలో నున్నదియే. (చూ. ౧౧-౧౫-౬, ౧౩-౩-౨౨,).

రెండవ పాఠమైనను బరిశోధించిన యేప్రతిలోనైన నుండకపోదు.

౭. "విమలమతీ నీకొడుకునట్టు లరయఁగఁజనుఁడే.
—ఉద్యో. ౨-ఆ. ౭౪ ప.

'విమలమతిం గన్నకొడుకుల ట్లరయఁదగుఁడే' అని ముద్రితప్రతుల పాఠము."

వీటిలో యిచ్చట సీతాపతిగా రీముద్రితపాఠము నుదాహరించి దిద్దినారని వ్రాయకమానినారు. ఈముద్రిత ప్రతులలోని పాఠమే నాపరిశోధించిన ప్రతు లన్నిట నేకరూపముగాఁ బొడకట్టినది. ఒకచోమాత్రము '... విమలమతిం గన్నకొడుకుల ట్లరయఁదగుఁడే" అని కలదు. ఈపాఠమున యతి పోయినది. లేఖకులు ప్రమాదమున 'ం' ను 'ఁ' చేసినారు. భారతము లక్ష్మీపతి సోమయాజుల గారి వ్రాఁతప్రతిలోను వ్యాఖ్యలోనుగూడ ముద్రిత పాఠమే కలదు. ఈపాఠము కేవల మఖండయతికొఱకే యిట్లు మార్పఁబడియుండును.

౮. "వడికి తోడన హరిమేను వరనిమొదలు...
—ద్రోణ. ౩ ౫౯.

'నరునిమొదలు' అని దిద్దినారు" దిద్దలేదు. పురాతనతాళపత్త్రప్రతులలోఁగూడ నిట్లే యగపడినది. ఇక్కడ వీరిపాఠమున 'అతఁడె'ను తన్నుబ్రమ సన్ని హితహరిశబ్దార్థమును కృష్ణునే బోధింపఁదగియున్నది. ఇట్లనుచోఁ బునరుక్తి సిద్ధము. కావున వీరు చూపిన యఖండయతిపాఠ మీసందర్భమున సంగతము నన్వితము నగకలిరకున్నది. ఇఁక 'నరునిరొమ్మొదలు' అను ముద్రితపాఠమే ఈరెండు సాధుపాఠము కాఁదగినది. వ్రాఁతప్రతులలో నీపాఠము కలదు. (చూ. ౧౩-౩-౨౫, ౧౦-౫-౧౨.) అఖండయతికొఱ కెవరైని పైరీతిని మార్చియుందురు.

౯. "వామనమూర దీని గనినప్పుడె సంతసమయ్యె.
—సౌప్తి ౨, ౯౬.

'గనినం గడుసంతసమయ్యె' అని దిద్దినారు." వీ రుదాహరించిన పైపాఠము వావిళ్లవారి ప్రతి లో: గ్రింద నుదాహరించినారు. వీరు దిద్దినారనిచూపిన పైపాఠము వావిళ్లవారు ప్రధానముగా గ్రహించినది. వీరేశలింగముగారి ప్రతిలో దిద్దుబడక వీరు చూపిన పైపాఠము గలదు. కాని, తిం. వేవప్పెరుమాళ్లయ్య గారి ప్రతిలోమాత్రము "దీని గని నందముఁ బొందితి నింతె చాలు" అను పాఠ మున్నది. ఈ సందర్భమున లైబ్రరీలోని వ్రాఁతప్రతు లన్నిటిని బరికించితిని. అన్ని టను 'నందము బొందితి నందము నొందితి' 'నింతె చాలు' 'నింత చాలు' అనియే కనఁబడినది. లక్ష్మీపతిసోమయా జులవారిప్రతి పాఠముకూడ నిట్లే యున్నది. దీని కి పై పద్యమున ముద్రితప్రతులలో 'సత్కృతరైన యాతోయ జాక్షి' అని యున్నను, వ్రాఁతప్రతులలోను, భార తము లక్ష్మీపతి సోమయాజులగారి వ్రాఁతప్రతిలోను, 'నందితరై పుల్లతోయజాక్షి' అనియున్నది. ఇఁక నిక్కడి రచనానుగుణమగు సాధుపాఠ మిదియే యని వేఱుగా నిర్వచింప నక్కఱలేదు.

౧౦. "నీవును దల్లులు బంధుజ
నావళి పురజనులు హస్తినాపురమునకుఁ"
—ఆశ్వ. ౪-౯౩.

'బంధుజ|నావళియుం బరిజనములు హస్తిన గరికేఁగ' అని దిద్దినారు."

వీరు దిద్దినారనిన యీపాఠము వీరేశలింగముగారి ప్రతిలోనిది. శేషప్పెరుమాళ్లయ్యగారి ప్రతిలోఁగూడ నిది యిట్లే యున్నది. "...జ| నావళియును బరిజనములు హస్తిపురికిఁ జే..." అని స్పష్టముగా భారతము లక్ష్మీపతిసోమయాజులవారి తాళపత్త్రగ్రంథమునఁ గలదు. ౨౫-౪-౪ సెం. ప్రతిలోఁగూడఁ గొంచెముమార్పుతో నిట్టి యఖండయతిరహితపాఠమే కలదు.

౧౦. "అని మది నిశ్చయించి......

౧. ...........................మా
కొనరిన సైన్యము పదునొకొంటికి"
— ఉద్యో. ౩ ఆ, ౨౧౧."

౨. "పాండవులవలనఁ గీడొ
క్కొండును లే దధిప నీదుకొడుకులు..."
— స్త్రీ. ౧ ఆ. ౬౩ ప.

ఇక్కడ 'ఒకొక్కండు'శబ్దమును ఒక్క + ఒండు గా స్వీకరించుచోఁ గ్రిందిపద్యమున హల్లుతో యతికూర్చుట యసంగతము. 'ఒకొండు' అని యవ్యుత్పన్నముగానే దీనిని గ్రహించుచోఁ బైపద్యమున నచ్చుతో యతి చెల్లించుట యనుచితము. ఇఁక నిక్కడ నఖండయతి సిద్ధము అని వీరి యాశయము.

అప్పకవీయవిమర్శనమున నీపద్యములే యుదాహరించి యిట్టియాశయమునే పంతులుగారును వివరించి వివరించి వ్రాసినారు. సుకవిమనోరంజనమున నప్పకవి నాక్షేపించుచుఁ గూచిమంచి వేంకటరాయఁడును నిట్టి యభిప్రాయమునే వెల్లడించి వీరికి మార్గదర్శకుఁడైనాఁడు. మొత్తముమీఁదఁ బూర్వలాక్షణికులకును వీరికిని నఖండయతిప్రాసాదనిర్మాణమున కిది యొకమూల స్తంభము. కూచిమంచి తిమ్మకవియు నొకొక్కండు శబ్దమున కుదాహరణముగా నీస్త్రీపర్వపద్యమునే చూపియున్నాఁడు. అతని కుద్యోగపర్వములోని పైపద్యభాగమున చేదేని పాఠాంతరము దొరకియుండును. లేదా, క్రచ్చఱ మొదలగువానివలె దీని నుభయయతికి లక్ష్యముగా నతఁడు భావించియుండును; లేనిచోఁ కవిత్రయమువారిలో నఖండయతి లే దని యాతఁడు వ్రాయఁజాలఁడు.

ఇఁక దీనిని గొంత పరామర్శింతము.

'ఒకొక్కండు' ఒక్క + ఒండు, గానే తిక్కనార్యుఁడు దీనిఁ బరిగ్రహించినాఁడు. తెనుఁగుశబ్దముల కిదమిత్థమని వ్యుత్పత్తి నిర్ణయింపఁదగు సాధన సామగ్రి సమకూరని యీ కాలమున వీరైన నిది ప్రమాద మనఁ జాలరు. అనినను సాహసము కాకపోదు. ఇక్కడఁ బాఠాంతర మిట్లున్నది.

"పాండవులవలనఁ గీడొక,
కొండొక లే దధిప నీదుకొడుకులు..."

ఇది వ్యాసుఁడు ధృతరాష్ట్రునకుఁ జెప్పు సందర్భములోనిది. ధృతరాష్ట్ర! పాండవులవలన 'ఒకకొండొక = ఒకకొంచెమును గీడు లేదు అని సమన్వయింపఁ దగియున్నది. 'న హి తే పాండవా స్స్వల్ప మపరాధ్యన్తి తే నృప' అని మూలము. వ్రాఁతప్రతులలో నిట్టి సాధుపాఠమును గలదు. (చూ. R. ౨౫-౨౩-౩). ఈపొత్తము పైభాగమున 'పృథుచరిత్రము'ని వ్రాయఁబడియున్నది. కాని యిందు భారతము స్త్రీ పర్వమును బృథుచరిత్రమును గూడఁ గలవు. ఈ పద్యమున నీ పాఠమే యప్పకవికిని దొరకియుండును. కావుననే యతఁడు 'అని| మది నిశ్చయించి......మా| కొనరిన సైన్యముల్ పదునొకొంటికి...' అను పద్యమును స్వరప్రధానవడికి లక్ష్యముగా నొసఁగెను. ఈ సందర్భమున వీరివలెనే వ్రాఁతప్రతులను దిసరీతిని బరిశోధింపక వేంకటరాయఁడు సుకవిమనోరంజనమున నప్పకవి నాక్షేపించినాఁడు. తక్కిన ప్రతులలో నైనను నీ పద్యము '...కీడొ| క్కండును లే దధిప నీదు కొడుకులు...' అనియే కలదు. ఇట యతిభ్రంశమును సవరించుటకుఁగా 'ఒక్కండును' 'ఒకొక్కండు' గా సంస్కర్తలు సంస్కరించినారు. ఈ సంస్కరణము 'కొడుకులు' అనుచో జరుగవలయునో లేక యిక్కడనే జరుగవలయునో నిర్ణయింపఁజాలము. ఇట్లు సంస్కరణాపేక్షమై సందిగ్ధవిషయమగు వీరిపాఠమునకంటె సర్వవిధముల నిర్దోషమును నామూపిన యీ పాఠము పరి

గ్రాహ్య మనక తప్పదు. కావుననే పై పద్యము నప్పకవి స్వరప్రధానవడికి లక్ష్యముగా నుదాహరించుట తప్ప కాఁజాలదు. ఉద్యోగపర్వపద్యమున వీరేశలింగము గారి ప్రతిలోను, తం. వేంకటపెరుమాళ్ళయ్యగారి ప్రతిలోను "...మీర శ్రీ| రమణీయ సైన్యములు పదునొకొంటికిని" అని కలదు. ఈ పాఠమున నిది యఖండ యతికి లక్ష్యమే కాఁజాలదు. ఈ పాఠమే ప్రాఁతముద్రితగ్రంథములలోను లక్ష్మీపతిసోమరాజుల వారి తాళపత్త్రిగ్రంథములోను గలదు. కావున నిది యుభయయతియే కాఁదగియున్నది. కనుకనే తరువాతి కవు లీ పాఠముల ననుసరించి తమ గ్రంథములలో నీయొక్కొండుశబ్దమున వచ్చుతోడను, హల్లుతోడను నుభయ సాధారణముగానే యతి చెల్లించిరి. ఇక్కడ నీ యుదాహరించిన యాశ్వాససంఖ్యయుఁ బద్యసంఖ్యయు సవరింపఁ దగియున్నవి. అఖండయతిసందర్భమున 'అప్పకవీయ విమర్శనము'నఁగూడ నీపద్య మిట్లే యున్నది. కాని సామాచివప్రతులలో నిది నాలుగవయాశ్వాసములోని నూటనలువదవపద్యముగా నున్నది.

౧౧. "వీరలు దైవశక్తి ప్రభవించిన నా
రమ లేమిసందియం,
బీరమణీయకాంతి నుపమింపఁగ..."

దీనినే యప్పకవీయవిమర్శనమునఁగూడ నుదాహరించి తమ యఖండయతిసిద్ధాంతమునకుఁ బ్రబలప్రమాణముగా వ్రాసికొనినారు....

కాని చదలవాడ సుందరరామశాస్త్రిగారి ప్రతిలో '...సందియం| బీరమణీయకాంతిని వహింపఁగ|"... అనుపాఠ మున్నది. ఈ ప్రతిలోనేకాక వీరేశలింగము గారిప్రతిలోఁగూడ నీపాఠ మిట్లున్నది. ఇది పరిష్కర్తలు పరిష్కరించి రనుటకును వీలు గాన్పింపదు. శ్రీ వీరేశలింగముపంతులుగారు తా మఖండయతి లేదనుసిద్ధాంతముతోఁగాని, కలదను రాద్ధాంతముతోఁగాని యీ పొత్తమును బరిష్కరించియుండలేదు. వ్రాఁతప్రతులలోఁ దమకు దొరకినవానిలో సాధువులు బహుళములుగాఁ దమకుఁ గనుపట్టుపాఠములనే పరిగ్రహించియుందురు. కనుకనే వీరిభారతములో నక్కడక్కడ బహుళములుగా నఖండయతిపాఠములును నుపలబ్ధము లగుచున్నవి. ఇట్టిచోట్ల నేపరిష్కర్తలైనను వ్రాఁతప్రతులలోని పాఠములనే స్వీకరించి యేది నిర్దోషమో యేది యక్కడి సందర్భమున కనుగుణమో యేది యాకవిరచన కనుకూలమో యట్టిపాఠములనే యచ్చొత్తించుచున్నారు. ఇట్టిసందర్భపరిశీలనమున నీ రొకప్పుడు ప్రమాదపడినను బనిదప్పదు.

"వల్లతమువ్వాఁకు బరులు 'అట్టికనువ్వు' అని సంస్కరింపఁ బ్రమాదము కలుగలేదా? తాళపత్త్రగ్రంథము లనేకప్రమాదములతో నిండియుండుటచేఁ దప్పని పరిగని వలంతిమార్పులను మాత్రము చేయుచున్నారు. కాని పండితులుగా రభిప్రాయపడినట్లు స్వేచ్ఛముగాఁ బాఠములనే తాఱుమాఱొనరించుటకు సాహసించుట లేదు. అట్టి వ్రాఁతప్రతులు మన కుపలబ్ధములు గానంత మాత్రమున నవి యన్నియుఁ బరిష్కర్తల పరిష్కరణములని యుపేక్షముగా వానిని నిందింపఁగూడదు. ఎన్ని ప్రతు లిప్పటికి శిథిలములైనవియో, మఱెన్నిప్రతు లేయే స్థానములలో డాఁగి మన కుపలబ్ధములు గాకయున్నవియో చెప్పుట కెవరికిని సాధ్యము గాదు. అప్పకవ్యాది లాక్షణికులైన నిట్టిగ్రోవనే యనుసరించియుందురు. ఇప్పుడు ప్రాఁతప్రతులలో లేవని మీ రభిప్రాయపడిన పాఠము లెల్లను నిట్లు తాళపత్త్రప్రతులలో నసందిగ్ధముగా దొరకుటయే దీనికి నిదర్శనము. నా కనవసర మగుటచే నంతగాఁ బరిశోధింపలేదుగాని యిక్కడి వీరేశలింగముగారి పాఠమును బరిశోధించుచో నేప్రతిలో లేని దొరకక యుండకపోదు. ఇఁక నిక్కడ నఖండయతి లేదనుట సిద్ధాంతము.

౧౨. "వేల్పంగ సమకట్టి జిలుకడ
తిగిచికొని నాగపురమున కొనరంగఁ జని...
—ఆది. ౮ ఆ ౧౨౮ప.

అని ద్విపదపాఠముం డున్నది. ప్రాసయతి కనఁ బడుతూ ఉండడంచేత నిద్దలేదు. గాని వన్నియా యుద్దేశించినది యతిగాని ప్రాసయతి గాదు. అయతి అఖండ వడి యనక తప్పదు..."

పెద్దక కాడిచి పెట్టలేదు. వీరు సరిగా ముద్రితగ్రంథములఁ బరిశోధింపకొనలేరు. చదలవాడ సుందర రామశాస్త్రిగారు సంజీవనీ వ్యాఖ్యతో నచ్చొత్తించిన భార

తములో 'తిరిచి|కొని నాగపురమునకును జని నిజరమ్య| హర్మ్యస్థంబునందు నెయ్యమున నునిచి' అని స్పష్టముగా నున్నది. ఇట్టిపాఠ మీయచ్చుప్రతిలోనేకాక వ్రాఁత ప్రతులలో నెల్ల బహుళముగా నున్నది. (చూ. ౧౧-౧౫-౫, ౧౧-౧౫-౪.)

ఇక్కడ నఖండయతి యెక్కడిది? నన్నయ నియమమున కేమి భంగము కలిగినది? నన్నయనియమములు సరిగా గుర్తెఱుఁగని యఖండయతిప్రియు లెవరో యీ పాఠమును వైవిధ్యముగా సంస్కరించి భంగపఱిచినారు. ఇక్కడి రహస్య మిది. కేవల మఖండయతికొఱకే యుపయోగపడి యనవసరముగాఁ గాన్పించు నిక్కడి 'ఒనరంగ' ననునదియే యిది వీరిసంస్కార మని చెప్పక చెప్పుచున్నది. పంతులుగా రిట్లే యప్పకవీయవిమర్శనమున శ్రీనాథుని కాశీఖండమునుండి కూడఁ గొన్ని యఖండయతిపాఠముల నెత్తి వ్రాసినారు. ఇంకను వారిట్లు వారిప్రతిలో వీరుదాహరింప మఱచినవి చాలఁ గలవు. అట్టిస్థలములలో నెల్ల వ్రాఁతప్రతులలో నఖండయతిరహితములు సాధువులు నవఁదగు పాఠాంతరములు దొరకియే యున్నవి. ఈ ప్రతిలో నిట్టి యఖండయతిప్రమాదములేకాక యతిభంగములు సప్రభంగములును జాలఁ జేరినవి. వీని నన్నిటిని ప్రస్తుతము నాచేఁ బరిష్కరింపఁబడి కొలఁదికాలములోఁ బ్రకటింపఁబడ నున్న కాశీఖండములో విమర్శించి చూపఁదలఁచితిని. ఇఁక వీరు తెలుఁగుపత్రికలోఁ బెద్దపెద్దకవులనుండి వందలకొలఁదిగా నఖండయతిపాఠములు చూపినామని వ్రాసిరి. చక్కఁగాఁ బరిశోధించుకొనుచో నట్టిస్థలములలో వేలకొలఁదిగాఁ జక్కని పాఠాంతరములు దొరకఁగలవు. ఇఁక వ్రాఁత ప్రతులలో లేక పండితులచేఁ బరిష్కరింపఁబడి ముద్రిత పుస్తకములలోమాత్రము కలవని వీరును బంతులుగారును నుదాహరించిన పాఠాంతరములు 'ఓరియంటల్ లైబ్రరీ'లో నిట్లు బహుళముగానే దొరకియున్నవి. సుప్రసిద్ధమగు 'మదరాసు ఓరియంటల్ లైబ్రరీ'లోని ప్రతులనైనఁ బరిశోధించుకొనక పరిశోధకులు పరిష్కర్తలనెల్ల నన్యాయముగాఁ బండితమ్మన్యులని నిందించుట వింతగా నున్నది. భాషాభేదవాది గ్రంథములలోని వీరి వ్రాఁతలిట్లే యపరిశోధనమూలములు గాఁ దగియున్నవి. చూ. శృంగార నైషధమును వ్యాఖ్యానించుచు 'తోతెంచు'నకు 'తోడితెచ్చు' అని యర్థము వ్రాసినందులకు భారతము నేని చక్కఁగాఁ జదివి యెఱుఁగ రని వేదము వేంకటరాయశాస్త్రిగారి నాక్షేపించినారు. ఉద్యోగాది పర్వములలో భారతము వ్రాఁత ప్రతులయందు 'అతనిం దోతెంచి' అని నిర్ధారకముగా 'తోతెంచు'నకు 'తోడితెచ్చు' ననునర్థము చెప్పవలసిన యవసరముగల ప్రయోగము లెన్నియో మాపట్టునున్నవి. వీనినెల్ల నిప్పుడు చర్చించుట యప్రస్తుతము.

అఖండయతిసందర్భమున నీ రిదివఱలో, నిప్పుడును, గొన్ని భారతపాఠముల వ్రాసి యభేద్యము లని వ్రాసిన వ్రాఁతలకు సమాధాన మీయఁబడినది. ఇఁకఁ గవిత్రయమువా రఖండయతిఁ బాటింపలేదని జయభేరిని మ్రోఁగింపవచ్చును.



# అశాంతి

శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

కనులఁ దెఱచితి నెచటఁ గన్గొనిన నాకు
విడిన పూలమొత్తాలె గాన్పించె నాఁడు...
హృదయ మొకపరి పొంగిపోయినది యమృత
కిరణముఁ గనుఁగొని యుప్పొంగు శరధివోలె.

కమ్మఁదేనెలఁ జిలుకు పికాలపాట
విని "యహో! జీవితమ్మెల్లఁ బ్రేమమయమె!
ఎచటఁ జూచిన నానందమే!" యటంచుఁ
బొంగిపోయితి వెఱ్ఱినై పోయి, నాఁడు.

రకరకమ్ముల పూలహారములఁ గ్రుచ్చి
పూలరాణినై నిలువెల్లఁ బులకరింపఁ
బంచమశ్రుతి గళ మెత్తి పాడుకొనుచుఁ
జివురు సెజ్జలలోన నాసీననైతి.

ఇపుడు భారమైపోయిన దీ యెడంద!
ఒంటిగాఁ గూర్చున్న న న్నారసిపట్టి
పీకుకొని కబళింపగాఁ బైకుఱుకు పి
శాచికనులట్లు దోఁచు పుష్పములు నేఁడు.

మూగవోయిన నిశికంఠమునఁ జలించు
మూలుఁగో యేమొ కోయిలజాలిపాట
చెదరి చెరరి వాయుపథాలఁ జీల్చుకొనుచు
హృదయమున వ్రాలినను వెరపించు నిపుడు.

చిదిమి చిదిమి దూరాలలో చెదరిపోవ
వినరివైచితి హారాలు విసివిపోయి;
ఎంత కాలమే నొంటిగా నిట్టు లుంట ?
ఇంతవిశ్వాన దొరుకదో శాంతి నాకు?

# సిగ్మండ్ ఫ్రాయిడ్

శ్రీ బి. కుప్పుస్వామి

సిగ్మండ్ ఫ్రాయిడ్ గొప్ప మనశ్శాస్త్రజ్ఞుడు. ఈతను ౧౮౫౬-వ సంవత్సరములో జెకోస్లోవేకియాలో నుండు మొరేవియాలో పుట్టెను. ఇతని తలిదండ్రులు యూదులు (Jews). ఫ్రాయిడ్ చిన్నతనముననే విద్య నభ్యసించుటకు వియన్నాకు వచ్చి అచ్చ



సిగ్మండ్ ఫ్రాయిడ్

టనే క్రిందటి సంవత్సరమువరకూ వుండిపోయెను. కాని జర్మను నాజీలు ఆస్ట్రియా దేశమును ఆక్రమించి, యూదులను ఆ దేశమునుండి తరిమివేసినపుడు ఈ గొప్ప మహా వైజ్ఞానికుడు కూడ తన దేశమును వదలిపోవలసివచ్చెను. అప్పుడు ఇంగ్లాండుకు పోయి మొన్న సెప్టెంబరు ౨౩-వ తేదీన చనిపోయేవరకూ అచ్చటనే వుండెను. ఇతను ౮౩ ఏళ్లు బ్రతికి ప్రపంచమునకు గొప్ప సిద్ధాంతములను వెల్లడిచేసి జీవితమును సార్థకపరచుకొనెను.

ఫ్రాయిడ్ వైద్యశాస్త్రమును చదివి, మనోవ్యాధులను బాగుపరచుటలో చాలా పేరుపొందెను. మిథ్యోన్మాదము (హిస్టీరియా-(Hysteria)ను గురించి అప్పుడు వియన్నాలోను, ప్యారిసులోను చాలా పరిశోధనలు జరుగుచుండెను. ప్యారిసులో సుప్రసిద్ధ మనోవ్యాధినిపుణుడైన షార్కో (Charcot) అనువానియొద్ద పనిచేయుటకుగాను ఫ్రాయిడ్ ప్యారిసు వెళ్లెను.

'హిస్టీరియా 'Hysteria)ను 'కనికట్టు నిద్ర' (హిప్నోటిక్ స్లీప్ - Hypnotic sleep) సహాయముచే బాగుచేయుచుండిరి. రోగిని హిప్నొటైజ్ చేసినపుడు అతడు తన జాగ్రదవస్థలో తన మనస్సులోతులలో తనకు తెలియకుండ అణగియున్న విషయముల నన్నిటిని బయలుపరచును. ఆ స్థితిలో అతనికి తగినసలహాల నిచ్చి, మందలించి చెప్పినచో కొంతకాలములో రోగము కుదిరి, అతడు బాగుపడుచుండెను. కాని ఈ విధముగా మనోవ్యాధులకు చికిత్స చేయుట ఫ్రాయిడ్‌కు నచ్చలేదు. అందరినీ హిప్నొటైజ్ చేయుటకు సాధ్యము కాకపోయెను. కొందరు మాత్రమే దానికి లొంగుచుండిరి. దానిచే రోగము పూర్తిగా పోగొట్టుటకు

సాధ్యము కాకపోయెను. పైగా కొందరికి ఉన్నరోగము పోయి క్రొత్తజబ్బు తటస్థించు చుండెను. ఇందుచే ఫ్రాయిడ్ వీటి నన్నింటినీ ఆలోచించి వేరుమార్గమును కనిపెట్టవలెనని ప్రయత్నించెను!

తాను ఫ్రాన్సునుండి మరల వియన్నాకు వచ్చి పరిశోధన ఆరంభించెను. ఇంతలో తన సహచరుడగు బ్రాయర్ అను వైద్యుడు ఈవిషయములో కొన్ని క్రొత్త సంగతులను కనిపెట్టివుండెను. అవేమన, ఒకసారి అతడు ఒకస్త్రీని రోగనివారణ నిమిత్తమై హిప్నొటైజ్ చేసినపుడు ఆస్త్రీ చాలా రహస్యమైన సంగతులు మాట్లాడుటకు ప్రారంభించి, తెలివి వచ్చాకకూడా వాటినే మాట్లాడదొడగెను. ఈమాటలను పరిశీలించినపుడు ఇవన్నియు ఆమెయొక్క సుప్తచిత్తము(unconscious) నందుండు కోరికలని తెలియవచ్చెను. ఈరీతి మాట్లాడినకొలది ఆమెయొక్క రోగచిహ్నములన్నియు అగోచరమై ఆస్త్రీకి బ్రాయరుమీద మోహము కలిగెను. బ్రాయరు ఈపద్ధతి సరియైనది కాదని, ఆరీతిగా వైద్యము చేయుట చాలించెను.

వైజ్ఞానికుడైన ఫ్రాయిడ్ దీనిని ఇంతతో విడిచిపెట్టక ఎక్కువగా పరిశోధన చేయుటకు మొదలుపెట్టెను. రోగచిహ్నములకును, రోగియొక్క అనుభవములకు సంబంధమును ఆలోచించుట మొదలు పెట్టెను. ఈసంబంధము ఆకస్మిక సంబంధమా లేక కార్య కారణ సంబంధమా? విజ్ఞానముయొక్క మూలపద్ధతి ఏమనిన, ఈజగత్తులో కలుగు అన్ని సంభవములకు (effects) కారణమును కనిపెట్టవచ్చును. తగిన కారణము లేనిదే ఏ సంభవమును తటస్థించదు. ఇట్టి కార్య కారణ సంబంధము మానసిక వృత్తులందును వుండియే తీరవలయునని ఫ్రాయిడ్ సాధింపదొడగెను; లేనిచో మనస్స్వరూపమును నిర్ధరించుట అసాధ్యమని వాదించెను.

ఈపరిశోధన మనశ్శాస్త్రమునకు ఒక క్రొత్తదారిని ఏర్పరచినది. ఫ్రాయిడ్ మనోవ్యాధికలవారి మనోవృత్తులకు కారణము లేవి అని యోచన చేయదొడగెను. ఇవి సాధారణజ్ఞానసంబంధమైన విపరీతములు కాక, ఇచ్ఛకు సంబంధమైన విపరీతములని కనిపెట్టెను. మనోవ్యాధులకు కారణములను ఫ్రాయిడ్ ఈరీతిగ విశదపరచెను:

మానవునికి ఎన్నో ఆశలు కలవు. వాటిలో ముఖ్య ఇచ్ఛ లేవనిన, తన దేహమును కాపాడుకొనుట (ఆకలిభయము, కోపభయము మొదలైనవి), తనజాతిని కాపాడుకొనుట (Race-preservation), కామము వాత్సల్యము (Parental love) మొదలైనవి, మరియు తనగుంపు(group)ను కాపాడుకొనుట (సహోదరభావము). ఈ ఇచ్ఛలన్నియు లిబిడో(కామశక్తి-Libido) యొక్క వివిధరూపము లని, లిబిడోయొక్క స్వరూపము కామజీవనమని ఫ్రాయిడ్ నిర్ధరించెను. కామ మనిన ఫ్రాయిడ్ అర్థము కోరిక లేక ఇచ్ఛ. స్తన్యపానము చేయు పసిపాప మొదలు పరమాత్మధ్యానముచేయు పరమ యోగివఱకూ వారివారి కామ - ఇచ్ఛను వేరువేరు రూపములలో సఫలము చేసుకొనుచున్నారని ఫ్రాయిడ్ యొక్క అభిప్రాయము. ఇచ్ఛ ఏదైనా నెరవేరనియెడల మన

మనస్సుకు చాలా కష్టము కలుగును. ఈ కష్టమునుండి తప్పించుకొనుటకుగాను ఆ ఇచ్ఛనుగూర్చి ఆలోచనచేయుటయే మాని వేసి, దానిని మనఃపాతాళమున అణచి వేసెదము. ఈరీతిని అణచిపెట్టిన ఇచ్ఛ లన్నియు సుప్తచిత్తము(unconscious)నందు దాగియుండును. వీటిని చాలాకాలము దాచుటకు సాధ్యము కాదు. మరచిపోయితి మని భ్రమించెదము. ఎప్పుడో ఒకప్పుడు మారు రూపముతో ఇవి పైకి తేలును. అణచి పెట్టిన ఇచ్ఛలు సాధారణముగా నిద్రించు నపుడుగాని లేక మేల్కొనియుండునపుడుకాని స్వప్నస్వరూపమును దాల్చును. ఈడేరుటకు వీలుకాని కోర్కెలు వున్న వ్యక్తి దుర్బల మనస్సు కలది (weak minded) అయినచో ఉన్మాదము కలుగును. ఈవున్మాదమునకు ఫ్రాయిడ్ యొక్క చికిత్సయేమన, అణచిపెట్టిన ఇచ్ఛలను, వాటికి సంబంధించిన భావోద్రేకములను వ్యక్తికి హృదయగోచరమగునట్లు చేసినచో క్రమముగ ఉన్మాద చిహ్నములు మాయమయిపోవును.

ఫ్రాయిడ్ స్వప్నము లన్నియు అకారణమయిన పిచ్చిసంభవములు కాక సకారణమయిన మనోవృత్తుల నిర్ధరించునవని స్పష్టపరచెను. అంతకు పూర్వము స్వప్నములకు మనుష్యుని మనోవృత్తికి ఏమీ సంబంధ మున్నదని ఎవ్వరునూ తెలిసికోలేదు. కలలు మనుష్యునకు రాబోయే మంచి చెడుగులను సూచించునదే లేనిపోని మూఢపు నమ్మకాలు వుండేవి, ఇప్పటికీ వున్నాయి. ఇవన్నియు తప్పని చూపినది ఫ్రాయిడ్. ఒక్కొక్క స్వప్నమును సుప్తచిత్తమునందుండు ఇచ్ఛలను వెలిబుచ్చును. అతడు స్వప్నమునకు రెండర్థములు కలవని నిర్ధరించెను. ఒకటి మన మిచ్చు అర్థము-ఇంకొకటి గూఢార్థము. స్వప్నమునందు కనబడున వన్నియు మనము అణచిపెట్టిన భావములు, కోర్కెలు.

రోగియొక్క మాటలనుబట్టి, వాని స్వప్నములనుబట్టి ఫ్రాయిడ్ వారికి సలహాల ద్వారా చికిత్సచేయుటయందు నిపుణుడయ్యెను. రోగిని ప్రశ్న లడిగి వారియొక్క మనోభావములను పూర్తిగా గ్రహించి వారిచే మాటలాడించి వారు తమకు తెలియకుండ తమ మనస్సులో అణచిపెట్టుకున్న భావములను, ఉద్రేకములను పైకి చెప్పించి గుణము కలిగించుచుండెడువాడు.

ఫ్రాయిడ్ మన మనోవృత్తులన్నీ మన బాల్యానుభవములమీద ఆధారపడి వుండునని సిద్ధాంతీకరించెను.

ఏ రీతిని బిడ్డలను పెంచవలయునో మన కతడు తెలియపరచెను.

మన యిచ్ఛలను ఏలాగున ఆచరణలో పెట్టవలెనో ఫ్రాయిడ్ బోధించియున్నాడు. సంఘము హర్షించని యిచ్ఛలను అణచివేసి, వాటికి ఏదారీ చూపింపకపోయినయెడల, ఆ అణచివేయబడిన యిచ్ఛలు మనోవ్యాధులను కలిగింపవచ్చును. కాని ఆ యిచ్ఛలకు సంఘము హర్షించే దారులలో మార్గము చూపి, వాటిని నెరవేర్చుకొనినయెడల మానసికవ్యాధులు (మతిచెడడము, హిస్టీరియా మొదలైనవి) కలుగుటకు అవకాశము లేదు. ఇచ్ఛలను సంఘము హర్షించు అనుకూలమార్గములలో నెరవేర్చుకొను

టనే ఫ్రాయిడ్ ఇంగ్లీషుభాషలో Sublimation అని వ్యవహరించెను. ఈ Sublimation అనే మనోయంత్రముమూలముగా మనము అన్ని యిచ్ఛలను అనుకూలప్రవృత్తికి తీసికొనివచ్చుటకు వీలగుచున్నది. ఈ మనోయంత్రముమూలముగా మానవుడు స్థిత ప్రజ్ఞుడై మనోవాక్కాయకర్మలయందు ఎట్టి వ్యతిరిక్తములును లేక సుఖముగా బ్రతుకుచున్నాడు. మన దేశములో మహాపురుషులనబడువా రందరూ ఈ మనోయంత్రమును తెలిసినవారే. సంఘము ఉన్నతస్థితియందుండవలెనన్న ప్రతిమానవుడును మనోవాక్కాయకర్మలయందు వ్యతిరిక్తములు లేకుండా జీవించుటకు ప్రయత్నింపవలెను

---

# ప్యాలంబ్యాంగు బౌద్ధవిగ్రహాలు: అమరావతీ శిల్పకళ

శ్రీ రంగరావు నిష్వాణి

జావా దేశమందలి శ్రీ విజయరాజ్యము నకు ముఖ్యపట్టణమైన ప్యాలంబ్యాంగులో ఈమధ్య కొన్ని బౌద్ధవిగ్రహాలు దొరకినవి[1]. వీటినిగురించి దేవీప్రసాదు గోషుగారును, డక్కా యూనివర్సిటీ వైస్‌ఛాన్సలరుగారైన ఆర్. సి. మజుమ్‌దారుగారును తమతమఅభిప్రాయాలు తెలిపినారు [2].

డాక్టరు క్రోమ్‌గారును, మరియు దేవీప్రసాదు గోషుగారును ఈవిగ్రహాలు ఆంధ్ర దేశంలోఉండే అమరావతీశిల్పకళ ననుసరించి యున్నవనియు, శ్రీవిజయ దేశమును పాలించిన రాజులు ఆంధ్రులే యనియు నిర్ధారణ చేశారు. మజుమ్‌దారుగారు ఈ విగ్రహాలు భాగల్‌పూరు, సుల్తాన్ గంజిపట్టణాలలోని రాగిబౌద్ధవిగ్రహాలని పోలియున్నవని సూచించినారు [3].

అమరావతీశిల్పము గ్రీకు - గాంధార కళల సమ్మేళన మనిన్నీ, ప్యాలంబ్యాంగు బౌద్ధవిగ్రహాప్రభ, ఉత్తరీయము గ్రీకుకళ ననుసరించి యున్నదనుటకు వీలులే దనిన్నీ మజుమ్‌దారుగారి వాదన. వీరి యభిప్రాయ ప్రకారం ప్యాలంబ్యాంగు విగ్రహాన్ని సుల్తానుగంజి విగ్రహంతో సరిపోల్చడం కష్టము.

భార్హూత్, బుద్ధగయలలోని గాంధార కళకు చెందని బౌద్ధవిగ్రహాలలో కూడా ఉత్తరీయములోని మడతలను గుర్తించుట కవకాశము లున్నవి.

ఈ యుత్తరీయాల మడతల సహాయంతో భారతీయ శిల్పకళయందలి రీతులు తెలుసుకొనవచ్చును. గ్రీకు-గాంధార శిల్పకళకు చెందిన విగ్రహాముల ఉత్తరీయపు మడతలు ఉత్తరీయముయొక్క ప్రాముఖ్యమును వెల్లడించుచు, విగ్రహాముయొక్క ఆకారమును అంగసౌష్ఠవమును కప్పిపుచ్చుచున్నవి.

గ్రీకుకళకు సంబంధంలేని భారతీయ శిల్పకళ ననుసరించి తయారుచేసిన విగ్రహాలలో ఈ ఉత్తరీయం తడిది పైన వేసుకొంటే దేహాముయొక్క ఆకారము ఏలాగు కానవగునో ఆలాగే యుంటుంది. మడతలను సన్నని గీతలమాదరిగా శిల్పి తీర్చును.

---

1. N. J. Krom—Antiquities of Palembang—Ann. Bibl. of Ind. Arch. 1931-pp. 29-33.
2. Early art of Srivijaya—Deviprasadgoash.
3. Dr. Ananda K. Coomaraswamy—History of Indian and Indonesian art, Fig. 160.



ప్యాలంబ్యాంగు బౌద్ధవిగ్రహం.

మథుర (Muttra) దేవాలయంలోని విగ్రహాలలో పైని చెప్పిన రెండులీకులు చూడగలము.

జావాద్వీపములో ప్యా లం బ్యాం గు బౌద్ధవిగ్రహము [4] అమరావతీకళాసంప్రదాయమునకు చెందినదని నిరూపించుటకు కొన్ని నిదర్శనా లున్నవి.

అమరావతిబౌద్ధవిగ్రహాలు గొప్పవిగ నుండి, బిగువుతో నిలబడి, హ స్తమునందు 'సంఘాతి'(Sanghati)ని ధరించియున్నవి. ఉత్తరీయము భుజమునుండి మోకాలివరకు వచ్చి, మోచేతిమీద ఎగువకు తీసుకొనిన ట్లుండును. అందుచేత మడతలను సూచించు గీతలు మోకాలివరకు చక్కగను, తరువాత మోచేతిమీదుగ వంకరతిరిగియును పోవు చున్నవి [5].

పైగా బర్మా, స యా ము, చం ప, ఫ్యూనాక్, జావా, సెలెబిస్‌లలో మొట్ట మొదటి బౌద్ధవిగ్రహాలు అమరావతీకళకు చెందినవే. అందువల్ల శ్రీ విజయయందలి ప్యాలంబ్యాంగు విగ్రహములుకూడా అమరావతీకళ ననుసరించి రచించినవని చెప్ప వచ్చును.

4. Ann. Bibliography-1931, Pl. XI, a. b. and Journal of Greater India Society, Vol. I, No. 1.

5. Coomaraswamy, I. C., Fig. 137 and 141.

6. Calcutta Review, 1931, pp. 224-26.

బౌద్ధవిగ్రహాలు మూడువిధములయినవి: (౧) ఉత్తర హిందూస్థానపువి; (౨) పశ్చిమ హిందూ దేశపువి; (3) దక్షిణహిందూ దేశపువి.

డాక్టరు బచ్హోఫర్ గారు (Dr. Bachhofer) దక్షిణహిందూ దేశపు బౌద్ధ విగ్రహములు అన్నియు సాధారణముగా నిలబడియుండు ననియు, కుడిభుజము, కుడిచేయి ఉత్తరీయముచేత కప్పబడియుండు ననియు నిర్ణయించిరి. అమరావతిలోని బౌద్ధవిగ్రహాలలో రెండుభుజములు కప్పబడకుండా ఉన్నవి కూడా ఉన్నవి. ఇవి క్రీ. శ. రెండవశతాబ్ది నాటి వని తెలియుచున్నది[7].

ఇక ప్యాలంబ్యాంగు కంచు బౌద్ధవిగ్రహము చూస్తే బెజవాడదగ్గర బుద్ధపాడు గ్రామంలో శివెల్ దొరగారికి దొరకిన కంచు



ప్యాలంబ్యాంగు బౌద్ధవిగ్రహం

విగ్రహం చూడనక్కరలేదు. సరిగా ఇటువంటి విగ్రహమే మరొకటి జావా (S. Djember, Java)లో కూడా దొరకినది. ఈ సందర్భాలను బట్టి చూస్తే జావాకు వెళ్లిన బౌద్ధకళాసంప్రదాయం అమరావతిదే అనీ, మొదట జావాద్వీపాన్ని ఆంధ్ర, ఇక్ష్వాకు సంతతికి చెందినవారు పరిపాలించారనీ తెలియగలదు.

---

7. Coomaraswamy, I. C., Fig 137-141.

# నా వి కా!

'సారథి'

నడుపరా, నాజీవనావన్ భవాబ్ధిపై
నాణ్యమౌ నీహ స్తనైపుణిన్, నావికా!

౧

వక్రమార్గాలలో వడిగాలి త్రోయగా
క్షుద్రజీవితములో సుడిగాలి త్రిప్పగా
నట్టేట నానావ
గుట్టపై బగులునో
గట్టు చేర్చంగ, నీ
చెట్ట నాశించితిన్.—నడుపరా.

౨

కామాదిఝషములే కలచ వేచెడు నవిగో
అహమనే మకరి న న్నంటి వెంటాడురా
నానావ నిం కెట్లు
నడుపన్ గలాడ నే
నావికత్వం బింక
నానాథ! నీదెపో.—నడుపరా!

౩

గర్వాంధ్యమున దారి గాంచ లేకుందురా
కామ్యకర్మాళిచే గన్మూతపడునురా,
కాంతి చూపించరా
కన్దోయి తెరువరా,
క్రమగతిన్ నానావ
కాచి పోనీయరా.—నడుపరా.

౪

భక్తియను తెరచాప బట్టియుంచితినిరా
జ్ఞానమను చుక్కాని గాచుచున్నానురా
నీ కృపానిలముచే
నెట్టి భవవార్ధిపై
నీ యనంతంబులో
నిల్పరా, నావికా.—నడుపరా.

# పించినీ పుచ్చుకొన్న ఉద్యోగస్థుడు

శ్రీ పొరనంది జగన్నాథస్వామి

చదువరా, ఒకవేళ నీ అదృష్టవశమున నీ జీవిత మండలి అమూల్యమైన భాగమంతా, అనగా నీ వీర్యవంతమైన యౌవనమంతా క్లేశావహమైన ఉద్యోగ బంధనమందు వ్యయపరచేయుంచినచో, నీ కీ కారాగార దినములు నీ యౌవనముతో అంతమొందక నీ మధ్యమ వయస్సు దాటి పలిత జరా పరిణతాంగుడవైనను నిన్ను వదలక విముక్తి విరామాశ కలుగనీయకుండా విస్తరించినచో, సెలవులు అనే వస్తువొకటి ఉన్నాదని మరచిపోయో లేక ఉన్నట్లు తెలిసినా అవి చిన్నపిల్లలకు మాత్రమే సాక్ష్య అని భావిస్తూనో కాలము గడిపియుండినచో, అట్టి స్థితిలో ఉండియున్నప్పుడు మాత్రమే నీవు నా విరామవిముక్తిని సానుకంపముతో ఆమోదించ గలుగుతావు.

ఆఫీసులో నేను ప్రవేశించి ముప్పైఆరు సంవత్సరములైనది. అప్పుడు నా జీవితములో సంభవించిన మార్పు చాలా ఖేదకరమైనది; కావలసినంత కాలము ఆటలక్రింద ఉపయోగించే స్థితినుండి, కావలసిన సెలవులు దొరకుతూ ఉండే స్థితినుంచి ఈ ఆఫీసు మేజా బల్లవద్ద రోజుకు పదిఘంటలు కూర్చోవలసిన స్థితికి సంభవించిన మార్పు చాలా క్లేశకరమైనది. కాని కాలము ప్రపంచములోని అన్ని ఖేదములనువలెనే దీనినికూడా భరించగలిగేటట్లు ఓదార్చింది. బోనులలో ఉండే అడవి మృగాలవలె నేనుకూడా క్రమంగా సంతుష్టుణ్ని అయినాను; రానురాను దానియందు అభినివేశంకూడా కుదిరింది.

ఆదివారాలు సెలవులే. ఏ ప్రయోజనంకొరకు ఆదివారాలు సెలవులైనవో కాని, ఆటక్రింద విశ్రాంతి కొరకు ఆరోజు చక్కగా ఉపచరించదు. పట్టణంలో ఆదివారం ఒకవిధమైన విషాదంతో నిండియున్నట్లు తోస్తుంది. రోజూ అలవాటైన కేకలు, చప్పుడూ గడబిడ ఆదివారం ఉండదు; పెద్దపెద్ద దుకాణాలు మూసి ఉంటవి. ఆ వీథులలోకి వెళ్లే బుద్ధి పుట్టదు. మామూలు రోజులలో కనబడే బొమ్మలు, ప్రచురింపులు, అమ్మకముకొరకు దుకాణముల ముస్తాబులు, ఈవిధమైన ఆకర్షణములు ఏవియు ఆరోజున కానరావు. వీథులలో తిరిగేవానికి కులాసా ఏమీ ఆరోజున కలగదు. ఆనందముతో పుస్తకాల పుటలను త్రిప్పుతూ బొమ్మలు చూస్తూ దుకాణాలలో కాలక్షేపము చేసేవానికి ఆరోజున తోచదు. వీథులలో తిరుగుతూ పనులమీద సంచరించే వాళ్ల ముఖములను తదేకధ్యానముతో చూస్తూ కాలము గడిపే పోకిరులకు ఆరోజున చికాకుగా ఉండును. పని లేక తిరిగేవానికి అంతటా సందడిగా ఉన్న వ్యాపారము ఒకవిధమైన వినోదముగా ఉపచరిస్తుంది. ఆదివారము నాడు వీథులలో కనబడేవాళ్లు కొంతమంది నాలాగే వారమంతా నౌకరీచేసి విరామము అనుభవించడానికి అలవాటుపోయిన ముఖాలు కనబరుస్తూ తిరిగే నౌకరి కుర్రవాళ్లూ దాసీలున్నూ. ఆనాటి ఆహ్లాదము ఎంత శూన్యమైనదోగదా! తుదకు పొలాలలో తిరిగేవాళ్లు కూడా స్వాతంత్ర్యము లేనివారే.

ఆదివారాలే కాకుండా క్రిస్టుమసుకు ఒకవారం, మరికొన్ని విడిసెలవులు దొరికేవి. క్రిస్టుమసు వారములో నా స్వస్థలమునకు వచ్చివేసేవాడను. ఈవారం నాకు ఒకవరము వుంటుంది. తిరిగీ సంవత్సరము ఆఖరున వస్తుందన్న ఆశ ఉండడముచేత ఆసంవత్సరం పొడుగునా ఆఫీసుఖయిదును సహింప నాకు శక్తి కలిగేది. కాని ఆ వారం రాగానే ఇదివరకు అది దూరంగా ఉన్నప్పుడు భాసిస్తూన్న ఆశ వాస్తవరూపమున నన్ను చేరేదికాదు. అన్నిరోజులనుంచీ ఆహ్లాదాన్వేషణములో వినియోగమైన వ్యాకుల సప్తవారముల పరంపరగా ఆసెలవుల వారముకూడా కనబడేది. సాధ్యమైనంత ఎక్కువగా

ఆనందించవలెననే ఆతురతవలన ఆవారము విసుగుపెట్టిన కాలమయ్యేది. ఉంటుందనుకొన్న విశ్రాంతి స్థితిగతులు ఎక్కడా కానరావు. వాటివాసనైనా తగలదు. అవి మాయమైపోయేవి. సరి, తిరిగీ నామేజాబల్లవద్ద నేను కూర్చున్నాను. మరొకమారు ఈ అవకాశము చేకూరే సరికి ఏభైరెండువారాలు విసుగుకొంటూ గడపవలసి యున్నదిగదా అని లెక్కవేశాను. అది మళ్లా వస్తుంది గదా అనేఆశ నా కారుఅంధకారములో ప్రకాశించినది. అది భాసించకపోయినచో నా దాస్యములో జీవనధారణము అసంభవమై యుండును. ఆఫీసుకు వేళకు వెళ్లడము, రోజంతా అక్కడ ఉండడము ఈమొదలైన కాఠిన్యము మాట ఉండగా, నేను ఈఉద్యోగవ్యాపారానికి తగను కాబోలు అనేసంశయము నన్ను ఆవేశించ ప్రారంభించింది. నాకు వయోవృద్ధి అయినకొలది ఇది నన్ను ఎక్కువగా బాధించడముచేత నావ్యాకులము నాముఖ రేఖలలో వ్యక్తమవుతూ ఉండేది. నా ఆరోగ్యము ఉత్సాహము క్రుంగుతుండేది. ఎప్పుడో అకస్మాత్తుగ ఉద్యోగ భంగము సంభవిస్తుందన్న భీతిన్ని, ఆసంకటమునకు నిలవ గలిగినశక్తి నాకు చాలదన్న త్రాసమున్నూ నన్ను ఆవహించినవి. పగలంతా ఆఫీసులో గడిపి, తిరిగి నిద్రలో కూడా ఆ వ్యాపారమునే చేస్తూ, లెక్కలలో తప్పులు వచ్చాయనే భ్రమచేత వులిక్కిపడి లేస్తూ, మరునాడు ఆఫీసులో ప్రవేశిస్తూ ఇట్లు కొలువుచేశాను. ఏభైసంవత్సరాలు వయస్సుగడిచినా నాకు విముక్తిగలుగుననే ఆశ లేకపోయింది. నాఆఫీసు మేజాబల్లతో నేను ఐక్యము చెందిపోగా దానికర్ర నాహృదయదేశమును ఆక్రమించుకొన్నట్లైనది.

నా ముఖములో ఇట్లు వ్యక్తమయే ఇక్కట్టును జూచి, నాతోటివారు ఆఫీసులో నన్ను నానావిధముల చాలాసార్లు తర్కించేవారు. కాని నా యజమానికి మాత్రం ఇది గోచరమైయుండునన్న సందేహము నా కెప్పుడూ తట్టలేదు. ఒకనాడు నాయజమానులలో ఒకడు నన్ను ఒకమూలకు తీసుకొనిపోయి నా బాధకు కారణ మేమిటి అని నొక్కి నొక్కి ప్రశ్నించినాడు. తప్పించుకొందుకు సందు దొరకక నా అశక్తిని ఒప్పుకొన్నాను. "నా ఉద్యోగమునకు రాజీ ఇవ్వక తప్పదన్నట్లు ఉన్నదని భయపడుతున్నాను" అని నేను పలుకగా, నన్ను ఓదార్చుటకు అతడు ఏమేమో చెప్పెను. కాని నా ఒప్పుదలలోని అవివేకమును నేను విమర్శించుకొంటూ నాతొలగింపుఆర్డరు వస్తున్నట్లు నేను ప్రతీక్షణమూ జంకుతూ ఉంటిని. ఇట్లు ఒకవారము గడచినది. ఆహా! ఈవారము తలచుకొంటే — నాజీవితములో ఇట్లు బాధించిన కాలమును మనోవ్యాకులతను నేను ఎరగను. ఒకనాడు సాయంకాలము నా మేజా తాళము వేసుకొని బయలుదేరుటకు కుర్చీనుంచి లేచేసరికి పెద్ద యజమాని డఫేదారు వచ్చి మేడమీదికి రావలసిం దని పిలిచెను. ఆగది అంటే అందరికీ భయము. సరి. "నిన్ను డిస్మిస్ చేశాము" అని చెప్తారు. నా అనర్థానికి నేనే గదా కర్తను. "నీ అవసరము ఇక మాకు లేదు" అనిగదా చెప్తారు. నాకంగారు ఎరిగినయజమాని — వారంక్రిందట నన్ను పలుకరించినవాడు — నేను గదిలోనికి కాలుపెట్టగానే ఫక్కున నవ్వెను. అందువల్ల నావణుకు కొంచెము తగ్గుచుండగా, పెద్దయజమాని ఒక ఉపన్యాసము ప్రారంభించినాడు. నాసర్వీసు చాలా దీర్ఘమైన దనిన్ని, నాపనిపాట్లు చాలా తృప్తికరముగా ఉండెననిన్ని —నా కెప్పుడు అట్టిధైర్యము లేనిదే ఇత డెట్లు కనిపెట్టెనని నా ఆశ్చర్యం—, ఉద్యోగస్థులందరూ ఎప్పుడో ఒకనాడు విరామము కోరుట న్యాయమే అనిన్ని— నాగుండె దబదబమని కొట్టుకొంటూ ఉన్నది — ఏమేమో ఇట్లు తనవాగ్ధాటిని చెప్పి ఉపన్యాసము ముగించి నా ఆస్తి ఆర్జనలగురించి ప్రశ్నలు వేసెను. "నీవు చేసిన నాఖరీకి సంతోషించి నీకు నీ జీతములో మూడువంతులలో రెండువంతులు పించనీగా ఇచ్చుటకు మేము నిర్ణయించినాము; దానిని నీవు స్వీకరించి విరామ సౌఖ్యమును అనుభవించమని మామనఃపూర్వకప్రార్థన" అని చెప్పి ఉపన్యాసమును అతడు ముగించగానే— ఏమి ఔదార్యము! విస్మయకృతజ్ఞతలమధ్య ఊగులాడుతూ ఉండిన నాహృదయమునుండి నా అంగీకార వాక్కులు ఎట్లు వెడలినవో నాకు జ్ఞప్తిలేదు. ఆ మరునాటి ఉదయమునుండి నాదాస్యవిముక్తి. యజమానునికి కృతజ్ఞతావందనములు చేసి గది విడిచాను.

ఆఫీసునుండి ఇంటికి వెళ్లడము అదే ఆఖరిసారి. ఆ ఉదారుని నామము శాశ్వతముగ నిలిచియుండుగాక.

ఒకటి రెండు దినములవరకు దిమ్మపట్టి, ఆకుల మెంది, నాకు కలిగిన సౌఖ్యమును తెలుసుకోలేకుంటిని. నేను సుఖపడ్డానని బోధపడినా నాకు సౌఖ్యముమాత్రము కలుగలేదని పోల్చి ఇటూ అటూ తిరిగినాను. నలభైవర్షములు కారాగృహనివాసము చేసినవానిని అకస్మాత్తుగ ఒకనాటి ఉదయం బయటకు పంపివేస్తే ఎట్లుండునో అట్టిస్థితిలో నేను ఉంటిని. నన్ను నేను నమ్మలేకుంటిని. ఈ కాలప్రవాహమునుండి అనంతములోనికి వెళ్లిపోయినట్లున్నది; కాలమంతా తన స్వాధీనములో ఉన్నప్పుడు అది అనంతమేగదా! నేను వినియోగించగలిగినదానికంటె చాలాసార్లు అధికమైనకాలము నా స్వాధీనమందుండెను. కాలమనే ధనములేని రిక్తుని నన్ను అకస్మాత్తుగా ఒక్కమారు ధనవంతునిగా మార్చినది ఈస్థితి. నా ఆస్తికి క్షయము లేదు. ఈ ఆస్తిని వ్యవహరించుటకు తగిన గుమస్తా ఒకడు అవశ్యకమాయెను. కాబట్టి ఉద్యోగము చలాయిస్తూఉండేవారి కందరికి ఇందుమూలముగా ఒక తత్వమును బోధపరుస్తున్నాను: ఆలోచించుకోకుండా, చులకనగా తనకున్న సాధనసామగ్రి ఎంతవరకు సరిపడునో విమర్శించుకోకుండా ఎవడూ తననిత్యవృత్తి నుండి విరమించకూడదు; అట్లు చేసినచో ఒకప్పుడు ప్రమాదము సంభవించవచ్చును. నాకుమాత్రము చాలినన్ని సాధనోపాయము లున్నట్లు తెలుసును. ప్రప్రథమమున ఉద్భవించిన హర్షోన్మాదము చల్లారగా, శాంతమైన స్వగృహసౌఖ్యము నాకు కలిగింది. తొందర అనునది మరి లేదు. అన్నీ సెలవుదినములు అగుటచేత నాకు వేరే సెలవులు లేవు. కాలము భారము అయినప్పుడు ఇటు అటు తిరిగి దానిని ఖర్చుచేయగలను. కాని పూర్వమువలె (అనగా అక్షణిక విరామదినములలోవలె) రోజుకు ముప్పైమైళ్లచొప్పున— వీలైనంత అధికముగా ఆనందించవలె ననేకోరికతో—రోజంతా నడవలేదు. కాలము బరువైతే చక్కగా చదువుకోగలను; కాని పూర్వమువలె (అనగా నా కాలము అనేకాలము నాకు దొరకని రోజులలోవలె) రాత్రి దీపము పెట్టినతరువాత నా మెదడును కళ్లను క్లేశపెట్టి తొందర తొందరగా చదవలేదు. ఉత్సాహము కలిగినప్పుడు చదవడమో, వ్రాయడమో, నడవడమో నా కిష్టమువచ్చినట్లు చేస్తూఉంటాను. ఆహ్లాదముకొరకు వెదకి జెంబడించలేదు; నా కొరకు అది రావలెను. ఏనిర్జనస్థలములోనో పుట్టి పెరిగిన వానికి సంవత్సరాలు ఎట్లు వాటిఅంతట అవి వచ్చునో అట్లే నాకు ఇప్పుడు అవి ఉంటవి. ఏభైఅయినాయి ఇంకా సంవత్సరాలు లెక్కిస్తున్నాడా ఈ వయోతీతుడు, పించినీ దారుడు!

నిజమే. ఏభై గడిచినవి; కాని నేరుకేగదా. నా కొరకుగాక ఇతరులకొరకు నేను ఖర్చుచేసిన కాలమును ఈ ఏభైనుండి కొట్టివేస్తే, ఆ మిగిలిన కాలమే నా గడచినవయస్సు. అందుచేత నేను చిన్నవాడినే! ఏకాలమంతా తన క్రిందనే వినియోగ మవుతుందో, అదే వాస్తముగా వానివయస్సు. ఏదో ఒక అర్థములో నా డాకాలమును గడిపియున్నా, అది ఇతరులకాలము గాని వానికాలము కాదు. నాకు ఇప్పుడు మిగిలియున్న వయస్సు తక్కువో ఎక్కువో. నా లెక్కలో దానిని మూడింతలుగా గుణించవలెను. ముందువచ్చే పదివత్సరాలు గతించిన ముప్పైవర్షములంత దీర్ఘములుగ గడుస్తవి. సరళమైన త్రైరాశిక గుణితమేగదా!

నా స్వతంత్రతా ప్రారంభదశలో నన్ను ఆక్రమించుకొన్న మనఃకల్పనలలో ఒకచిత్రమైనదీ, ఇప్పటికీ కూడా నన్ను విడవనిదీ ఒకటి కలదు. నేను నా ఉద్యోగమును విడిచిననాటినుండి ఒకవిస్తీర్ణమైన కాలభాగముమధ్య ప్రవేశించినట్లు నాహృదయములో ఒక భావన వుదయించినది. అది నిన్నటి మొన్నటి విషయమువలె స్ఫురించదు. అనేకసంవత్సరాలు ప్రతీరోజూ, అనేకఘంటలూ, కలిసి మెలిసి సంచరించిన నా తోటి గుమస్తాలూ, నా యజమానివర్గమువారు హఠాత్తుగ నాకు దూరము కాగానే, వారు ఎంతో కాలముక్రిందట మరణించినవారివలె నాకు స్ఫురించిరి.

"నా డిపుడీగదా వెడలెను. కన్నీరు విడుచుటకైనా వేళలేకుండెను. అయినా మమ్ము ఎడబరచినదూరము ఎన్నోవర్షశతంబులవలె సు

మమన్నది: అనంతమైనదానికి కాలమానము వర్తిల్లదుగదా!"

అని ఒకకవి ఇటువంటి అనుభవమును వర్ణించెను.

ఈ వింతయైన భావముయొక్క తీవ్రతను తగ్గించాలని నా రండరిమధ్యకు వెళ్లవలెనని ఒకటి రెండు మార్లు ఉద్యుక్తుడనైనాను. అథోలోకమున పోరాటము మధ్య నేను విడిచివచ్చినవారి నందరిని ఒకమారు చూడవలెననే బుద్ధి పుట్టింది. వెళ్లి వారిమధ్య నిల్వగా, ఇదివరకు ఆనందించుచుండిన పరిచయమాధుర్యము వా రెంత గౌరవముతో ఆదరించినా, నా హృదయమున ఉద్భవించలేదు. మా పాతహాస్యములు చేసుకొన్నా అవి నిస్తేజములుగ ఉండెను. నా మేజాబల్ల, నాటోపీ లొయ్య మరొకరి అధీనములైనవి. అట్లు కావలసినదే అని నాకు తెలిసినా నాకది ఇష్టముకాకుండెను. ముప్పైఆరు సంవత్సరాలు హాస్యములతోను పాడుపుమాటలతోను నా ఉద్యోగవైషమ్యములకు సమతను కలుగజేసిన నాతోటి ఉద్యోగస్థులను (నా విశ్వాసమును సంపాదించిన అనుచరులను) నేను విడిచివేయునపుడు నాకొక అపూర్వవేదన కలిగింది; కలగవంటి పశువును కానుగదా! నా ఉద్యోగము అంత విషమమైనదా లేక నేను అంత పిరికినా? ఏదైనా పశ్చాత్తాపమునకు వేళ మించినది. అదిగాక ఇట్టి ఊహలు అట్టిసమయములలో విజృంభించడము మనస్వభావము. నా హృదయము మాత్రము వ్యథనొందినది. మా స్నేహబంధనములను నేను బలాత్కారముగా త్రెంపివేశాను. అది సౌజన్యము కాదుగదా! ఈ వియోగస్థితికి నేను సర్దుకొనేసరికి కొన్నాళ్లు పట్టినది. స్నేహితులారా సెలవు. తిరిగి తిరిగి వస్తూయుంటాను మీ దయ ఉంటే. పాడుపుమాటలు ఆడినా చక్కనిస్నేహము చూపేవాడవు నీవు కృ—, మందమైనా మర్యాదచేసేవాడవు నీవు రా—, అన్నిట్లోను చెయ్యిపెట్టినా సహాయము ఇచ్చేవాడవు నీవు న—, మీ అందరివద్ద సెలవు! లెక్కలేని వారులు, సందులు, చీకటిగదులు, సూర్యరశ్మి ఎరగని మూలలు,— వీటితో నిండియుండి, ఆకాశము అందుకొనుటకు ఎత్తు అనుచున్న-శిఖరము దుర్గమా అన్నట్లు ఉన్న గోడలు, బురుజులు — ఇట్లు నిర్మింపబడిన నా ఆఫీసుభవంతి, అనారోగ్యమైనా క్షేమసంపాదకమైనదిన్నీ, కఠినమైన నా జీవనపోషకమైనదిన్నీ ఆభవనము: నీవద్ద సెలవు. నీవద్ద ఉన్నవి నాకృశులు, పుస్తకవ్యవహారకునివద్ద లేవు. నే నెట్లు పరిశ్రమనుండి విశ్రాంతి పొందినానో ఆ కృశులుకూడా అక్కడ విశ్రాంతి పొందుతూ ఎంతఉపయోగమో అంత అసంఖ్యాకములై నిండుగా చీరువాల బల్లలపై ఉండుగాక. ఆ నా ఆస్తిని నా ఆర్జనయైన నా తేజఃప్రభావమును మీ కందరికి అప్పగిస్తున్నాను.

ఒకపక్షము గడిచినది. అప్పటికి శాంతిని చవిచూసినా పూర్తిగ పొందలేదు. నేను నిశ్చలమైన విశ్రాంతి అని విజ్ఞప్తిగానుకొని అంత పూర్ణమైనది కాదు. ఆరంభమందు కనబడిన ఆ వేగము నిలిచియుండిపోయి? ఆకులపరచునూతనత, అలవడని తేజస్సువలన నిర్వీర్యమైన నేత్రములు నాకు అలవాటైన దుస్తులు వేసుకోకపోవడము నన్ను వ్యాకులపరుస్తూ ఉండెను. తీవ్రసవ్యాపకేతుడు అలవాటుపడిన వైరాగి హఠాత్తుగ సంసార ప్రపంచమందు విడవబడినట్లు నే నుంటిని. నా అధికారిని నేనే. నా కిష్టమైనచోటికి వెళ్లడము, నా కిష్టమైన పని చేయడము. సింగరేణివీధిలో ఉదయము పండ్రెండు గంటలవరకూ ఒకనాడు తిరగగానే ఈ విధంగా ఎన్నో సంవత్సరాలనుండీ ఈలాగే తిరుగుతూఉండేవాణ్ని అని తోచింది వెల్లింగ్టను బజారులోనికి వెళ్లి పాతపుస్తకాలు వెదికేవాడిని; ఈ విధంగానే ముప్పైసంవత్సరాలనుంచి చేస్తూఉండేవాడినని తోచేది. అందుచేతనే ఈ వెళ్లడంలో క్రొత్త కనబడలేదు. ఒకనాడు ఉదయము ఒక చక్కని బొమ్మను చూస్తూ నిలుచున్నాను; మరొకలాగు మరియెప్పుడైనా చేసేవాడినా అని అనిపించింది. పూర్వము నాయింటినుండి ఆఫీసుకు వెళ్లేవీధులన్నీ ఇప్పు డేమైనవో! ఆవీధులరోడ్డులోని రాళ్లు ఇప్పుడు ఏ శ్రమకర్షితోద్యోగుని పాదఘాతములకు ప్రతిధ్వని నిస్తున్నవో! నా స్థితిలో గలిగిన ఈ మార్పును అన్యలోకోత్క్రమణముతో పరిపోల్చవచ్చో, అది ఉత్ప్రేక్షగా ఎవరికీ తోచకూడదు. కాలము నా విషయమై నిశ్చలమై యున్నది. కాలభేదములు నాకు మాపుఅయిపోయినవి. దినము వారము

లేది మొదలైన మార్పులు నాకు పరాకైనవి. పూర్వము శనివారం సెలవైన ఆదివారమునకు సన్నిహితమగుట చేత ఒక భావవిశేషముతో సమ్మిళితమై యుండేది. అప్పుడు ప్రతిరోజూ ఒక ప్రత్యేకవ్యక్తివలె భాసిస్తూ ఉండేది. రాబోయే ఆదివారంనాటి వినోదములకు అడ్డుగావున్న బరువువలె ప్రతీరోజూ కనబడుతూ ఉండేది. ఒకటి ఆరురోజుల బరువుగలది, ఒకటి ఐదు రోజుల బరువుగలది; ఇట్లు ఉండేది—ఆ రోజులరూపం నాభావనలో. అసలుపును ఇప్పటి తెలుపుగా మార్చగలిగిన గారడీ యేదో! ఆదివారం తరువాత వచ్చిన సోమవారం అన్నిటికంటె ఎక్కువ నలుపైనది. ఇప్పుడో అన్నిరోజులు ఒక్కటే. తుదకు ఆఆదివారము కూడా — సాధ్యమైనంత అధిక సంతోషమును సంగ్రహించవలేనని నేను పడిన ఆతురతవలన కాలోలు అతి చంచలమై విరామదివసముగా విఫలమైన ఆ అభాగ్యపు ఆదివారము — ఇప్పుడు సాధారణదివస మైపోయినది. దేవాలయమునకు వెళ్లితే, అనుభవించగలిగిన వినోదపు మొత్తములో లోపమువస్తుం దనుభీతి ఇప్పుడు మరిలేదు. ఏ పని చెయ్యాలన్నా కాలము వున్నట్లు తోస్తుంది. చాలా తొందరపనిలోవున్న ఎవనితోనైనా నాకు కావలసినంతసేపు ముచ్చటలాడగలను. షికారు వస్తావా అని పిలిచేవానికి తిరస్కారము చేయగలను. క్లేశపడుతూ పనులు చేసుకొనేవాళ్లను (నేను విడిచివేసిన నాతోటి వారిని) చూస్తూ వారి బాధలకు విపరీతానందనము పొందుతున్నాను. తిరిగే చోటునే తిరిగే గానుగ ఎద్దులవలె పనిచేస్తున్న వాళ్లు వారందరూ: ఎందు కాపని! ఎవడికీ కాలము అత్యధికంగాకాని అత్యల్పంగాకాని వుండకూడదు. నాకు ఒక కొడుకు వుంటే వాడికి "పనిలేనిమనిషి" అని నామధేయంచేసి, వాడే పనీ చేయకూడదని నియమించియుందును. పనిచేస్తున్నంతసేపూ మనుజుడు తన స్వాభావిక మార్గమునుండి దారి తప్పినవాడు. పురుషుడు స్వభావమువల్ల విచారణశీలుడు, వ్యాపారశీలుడు కాడు. ఒక భూకంపం వచ్చి ఆ మిల్లుల నన్నింటినీ మ్రింగివేయదా! ఆ మేజాబల్లను తీసుకొనిపోయి పిశాచములుండే అధఃస్థలములో పారవేయండి.

ఆ! నేను ఆ కంపెనీ గుమాస్తాను కాను. నేను విరమించిన విశ్రాంతిని! చక్కని ఉద్యానములో నేను ఎవరికైనా దొరుకుతాను. నాశూన్యముఖము నిరవధాన చేష్టవలన, ఏనిశ్చితకార్యము లేక తిరిగే నేను అందరికీ సుపరిచితుడను అయినాను. ఇటూ అటూ తిరుగుతాను. అంతేకాని ఒకస్థలమునుండి మరొకస్థలమునకు కాదు. ఇన్నాళ్లూ నాలోపల మరికొన్ని మంచి గుణములతో పాటు అణిగియుండిపోయిన ఆత్మగౌరవదృష్టి ఇప్పుడు నా ఆకృతిలో పొడచూపడము ప్రారంభించిం దని అందరూ అనేవారు. ఆర్యతాస్థానమునకు ప్రత్యక్షముగా మారిపోతున్నాను. నేనిప్పుడు వార్తాపత్రిక చదివితే, నాటకరంగములస్థితి తెలుసుకొనుటకు మాత్రమే. నా వ్యవహారము, వ్యాపారపు జీవితము పూర్తిఅయిపోయినది. నేను ఎందుకు ఈ ప్రపంచములోనికి వచ్చినానో అది చేసివేసినాను. కష్టమైన నౌకరీ చేసితిని, ఇంకో జీవితపు కాలమంతా నాయిష్టమే కదా.

---




నీరసము,
గర్భిణుల బలహీనత,
అలసట,
అంటువ్యాధులు
దంతముల పటుత్వము తగ్గుట,
చర్మవ్యాధులు
పాండువు,
స్త్రీలవ్యాధులు
కల్జానా వీటినన్నిటిని
అతి శీఘ్రకాలమున
నివారణ చేయును.
చేతితో తాకబడనిది.
ఆరోగ్యమునకు
ఖనిజాహారము.

జ్వరమనిన నాకు భయము లేదు, నేను చాల నీరసముగాను, నిరుత్సాహముతోను ఉండెడివాడను. మలేరియా మున్నగు జ్వరములకు సులభముగా లొంగుచుండెడివాడను. డాక్టరు నాకు కల్జానాను శిఫార్సు చేసిరి. కల్జానా నాకు బలమొసంగినది. రోగములకు లొంగకుండునట్టి శక్తిని ప్రసాదించినది.

వ్యాధి నెదుర్కొను శక్తి తగ్గిన అంటువ్యాధులు, జ్వరములు, మలేరియా మున్నగునవి మిమ్ము లొంగదీయును. చాలమందికి ఖనిజములు లోపించుటే దీనికి కారణము. కల్జానా సేవించిన వ్యాధుల నెదిరించు దేహదార్ఢ్యమేర్పడును, శరీరపోషణకు అవసరమగు ఖనిజము లన్నిటిని కల్జానా సప్లయి చేయును. కల్జానా కండపుష్టి, రక్తపుష్టి నొసంగును. కల్జానా సేవించి నీరస ముండదు. రోగము రాకుండా కాపాడుకొను శక్తి ఏర్పడును.

# KALZANA

కెమిస్టు లందరివద్దను, బజారులోను దొరుకును.

# కాటకం

శ్రీ చిఱుమామిళ్ల విజయపార్థసారథి

కటికచీకటి దిశలు క్రమ్మగ
కారుమబ్బులు నింగి ప్రేలగ
హోరుగాలిలొ లోక మంతా
  బోరుకొల్పగను.

చిటపటలతో వచ్చి చినుకులు
మింటి మంటికి ఏకధారై
కుంభద్రోణముగాగ వర్షము
  కురవ మొదలిడెను.

వాగు వంతలు చేనికుంటలు
వరదముంపుతో నిండిపో, గ
గ్గోలుపరచెను గ్రామ మంతా
  పెల్లువెల్లువచేన్.

మెఱపుతళతళ కన్ను చెదరగ
ఉఱుముపెళపెళ చెవులు అదరగ
బురద రొచ్చూ గాలివానా
  గజిబిజిగ ఉండెన్.

గాడి నిండీ ఒడ్డు లొరసీ
కయ్యలేరులు గడియలోపల
రాకపోకలు ఆపివైచెను
  రాత్రికాలమునన్.

చేరబారిన గ్రామవాసులు
చుట్టి మోకుల దరులతరులకు
గట్టిపట్టుతో చేదుకొంటూ
  గట్టు పట్టెదరు.

ముసలిముదుకల చిట్టిసిసుగుల
ముదితలెల్లర నొకరినొకరిగ
తెప్పకొయ్యలమీద ఒడ్డున
  తెచ్చిచేర్చెదరు.

రెండుఝాముల ప్రొద్దు పోగా
ఉండి మెల్లర నివతలవతల
దాటివైచీ యిల్లు పట్టెను
  జెట్టి రోశయ్య.

ఏటివీథీ మూలమలపున
ఏటి కెదురుగ తూర్పువాకిలి
ఎత్తు అరుగుల పూరియిల్లే
  జెట్టి రోశయది.

ముప్పూటతిండికె నోచుకొననీ
మూడుకాళ్ళల ముసలివగ్గుల
అమ్మ నాన్నల కిద్దరికి ఆ
  ధారు డియ్యతడే.

విధినిబద్ధపు దుర్విపాకము
విడిచిపెట్టదు కడుపుశోకము
కంట కడివెడు కార్చి దినములు
  గడుపుకొన్నారు.

చెట్టుచేమకు గుట్టగట్టుకు
పుట్టపుట్టకు మ్రొక్కి మమతతో
సాకినారలు పుత్రు నెప్పుడు
  చల్ల చూడు డని.

తొంటి జన్మములోన ఎవ్వరి
ఇంటిదీపము నిల్పినారో
పుట్టి పోగా మిగిలినట్టి
పుత్త్రి డొక్కండు.

కాయ లన్నీ రాలిపోగా
కడుపుకోతకు గాసినొంకీ
రోయ బ్రతికినబిడ్డ డని రో
శయ్య అన్నారు.

తోడునీడై ఎదుగుచున్నది
ఈడు వచ్చీ ఆడపుట్టువు
బ్రతుక బ్రతుకని బ్రతుకుచే బత
కమ్మ అన్నారు.

ఏమికర్మమొ ఏమొగానీ
భూమిమీదకు వచ్చిపడినది
రిక్కగమిలో పువ్వురాశీ
చుక్క బతకమ్మ.

కనులు చిఱుతలు పడెడు అందము
కన్నె వలపులు నిల్పు ప్రాయము
కల్లబొల్లీ తెలియనట్టిది
కన్నె బతకమ్మ.

అమృతకాంతులు చిల్కు నవ్వులు
అరుణరాగపు మేని నిగ్గులు
రేకు విప్పని జాజిపువ్వు నా
జూకు చెల్లెలది.

తండ్రి అంధుడు తల్లి పిచ్చిది
తనయుడే తమ ఆశ లన్నీ
ఆస్తిపాస్తులు ఋణమునకు సరి
హాని హానీగా.

ఎదురుదూలపు యింటిమొఖరా
ఎత్తుగాలికి ఎగిరిపోగా
ఒరవ సందులొ దోనె కురిసీ
వరద యిలు నిండెన్.

ప్రక్కలీడ్చుక పోవుయీడులొ
కుక్కి మంచములోన అంధుడు
ఉంకచుట్టి పరుండి వణకును
ఊహుహూ యనుచున్.

ఎత్తిపోసీ చేటతోటి
ఇల్లు నిండిన బురదనీళ్లను
బిందె నింపీ గాబు పోయును
పిచ్చియిల్లాలు.

ఒదిగి పడుకొనె చిట్టితల్లీ
ఒత్తిగిల్లీ గాఢనిద్రలొ
నిండుకొలనిలొ కనులు విప్పని
నీరజమువోలెన్.

దవడ దగ్గరబడగ వడకుచు
తడిసి ముద్దయి యిల్లు పట్టగ
ఇంటిగోడుకు నిల్వునీరయి
కండ్లు చెమ్మగిలెన్.

ఇంటికప్పున చాప చుట్టీ
ఒంటిశుభ్రము చేసుకొనీ
గూటిదీపపువెల్గునీడలొ
కడిగి కంచమ్ము.

కడుపు నకనక వనట గూర్పగ
పిడతలొ దీ పెరుగు పోసి
ఆరగించెను సజ్జసంకటి
ఆదరబాదరగ.

పలుకరించీ తల్లిదండ్రుల
పాడిగేదెకు చెత్తవేసి
పట్టి కర్రను నెత్తి ముసుగుతో
చుట్టకాలుస్తూ.

బురద చితచిత త్రొక్కుకొంటూ
మొరుగుకుక్కల అదరవేస్తూ
పయనమయ్యెను దొరలగోష్ఠపు
పసుల మేపగను.

౨

గట్టుమీదను పల్లె దింపులో
చుట్టి పారును కృష్ణవేణీ
ఊరిచేరువ పాయ గని ఉ
త్తరపువాహినినై.

మెరసి మిలమిల సూర్యరశ్మికి
మిసమిసలతో నాగుబాతులె
కదలిపారును ప్రాఙ్ముఖం బై
కడలి కలియంగన్.

ఊరిచివరను రాజవీథికి
ఉత్తరమ్మున తూర్పుముంగిలి
చుట్టుప్రహరీ మధ్యలోగిలి
చెట్టుచేమలలో.

తరతరమ్ముల నాటినుండీ
తాత తాతలు తరలినట్టీ
వసతి వనరులు చిక్కి సౌఖ్యము
వరలుచుండెడిది.

బాజుగోడలమీదనుండీ
బారకాసులు దింపి కట్టిరి
పాడిగొడ్లకు దుక్కిఎడ్లకు
వసరుకోడెలకున్.

ఎదటి జోలీ శొంఠి లేక
ఎల్లవారిని ఆదరించును
చెలిమి గోపాలావు తా చే
దోడు వాదోడై.

దాటిపోగా పెద్దలంతా
ఇంటిభారము పైన పడ్డది
అదుపుపాదుపుతో సర్దుకొంటూ
ఆరితేరాడు.

దానధర్మము సిరియు సంపద
కనికరమ్మూ కలుపుగోలు
పాడిపంటలు పలుకుబడియూ,
తోడిపుట్టువులు.

పెద్దవారల వాసి నిల్పెను
పిన్నడయ్యును దొడ్డదొర యని
మెచ్చుకొందురు ఊరుఊకమూ
రచ్చకూటములో.

సాటివారల చెల్మి చేయుచు
స్వపరివారము మేలుకోరుచు
బీదబిక్కకు పేదబంధుల
పెట్టిపోయగను.

చుట్టుప్రక్కల లక్షలాదిగ
పెట్టుబడికై డబ్బు త్రిప్పుచు
వడ్డిమీదనె వలచుకొన్నా
వసతు లెన్నెన్నొ.

దివ్యమైనవి దొడ్లు తోటలు
ఆయమగు కేదారభూములు
అడవిఖండము రత్నగర్భలు
అంకితము లయ్యెన్.

ధాతకరవులో ధాన్యమమ్మీ
ధనికులైరీ పేరిపూర్వులు
గంజిపోయగ లోకమునకూ
కలిమి చేకూరెన్.

కృష్ణఒడ్డున నాటిసొమ్ముతో
కుదురుకొని నానాట వారలు
బేరసారము పెట్టుబడిలో కు
బేరులైనారు.

గింజనాగులు కొలచి కరవులో
ప్రజల ప్రాణాల్ నిలిపి వారలు
పున్నెమున పుంజుకొని రంచు పు
కారు ఇప్పటికీ.

రమ్యమగు కేళీవనమ్ములు
రాగభోగము గల్గుభాగ్యము
కులవధూరత్నమ్ము కూర్మితో
కు స్తరింపంగన్.

సాంప్రదాయపు వంగడమ్మును
సజ్జనులసాంగత్యగరిమ శ
రీరదార్ఢ్యము ధీబలమ్మూ
చల్లనగు వాక్కూ.

పట్టినది బంగారు కాగా
ముట్టినది ముత్యాలు కాగా
నెగడె పచ్చలతోరణాలతో
నిత్యకల్యాణముతో.

కలిమిగూర్చిన తాత లంతా
కాలధర్మము నొందిపోగా
కాలచక్రముగూడ గిర్రున
కదలిపోయింది.

3

చీకు ఛిద్రము పెచ్చుపెరుగగ
చిత్తశాంతిని గోరి గోపయ
సొంత సేద్యపుబరువుభారము
కొంత యెత్తిగిలెక్.

పగ్గాలు, తాల్పా వామిపేర్పుకు
పనులవరుసను దిద్దు తీర్పుకు
కూలినాలిని అదుపు నేర్పుకు
కోటేరు వేయుటకున్.

నెయ్యమ్ము కోరీ సాటివారల
నెనరు చిల్కుచు కూలివారల
మెప్పుతో తన విధిని చేసెడి
మేస్త్రీ రోశయ్య.

నమ్మకమునకు తోడు శాంతము
నయము భయములు కల్గి అన్నిట
మనసు నచ్చు నిజాయతీనిఘా
మాను రోశయ్య.

అమలవర్తన మమరియుండీ
అందరికి తలమానికమ్మై
కూటికిని పేదేమొ నేడు
కులమునకు పేదా.

పెట్టి పోసిర కాని పెద్దలు
పొట్టకూటికి చేయి చాపి
పరులపంచల బ్రతుకు మను పా
పాన పోలేదూ.

స, స్యానుకూలము లైనవెప్పుడు
సవ్యముగ వర్షములు లేకను
కాటకమ్మే ప్రబలినది య
ప్పీట నయ్యేటన్.

పంటలేకా ధరలు తగ్గి
పాడుబడి సంసార మంతా
బీదపడగా రయితుభూమిా
బీడుపడుచుండుఁ.

కల్మిలేములు కష్టసుఖములు
కాలగతిచే క్రిందుమిాదగు
ఓడ బండ్లను మారుచుండును
బండ్ల నోడలపై.

పుట్టిజొన్నలు కట్టుబట్టల
కట్టుబడికై కట్టుబడియె ద
రిద్ర పెద్దమ దారి తీయగ
దాస్యవృత్తికినై.

తనతొ ఇంటిలొ పుట్టి పెరిగీ
తనతొ కష్టము చేసి అక్కర
లన్ని తీర్చిన కోడెజతను
అమ్మె బాకీకై.

తమ్మె విడువగ బాకిదారులు
కుమ్మరాగా రెండుకోడెలు
ఒడలు నిమిరి బుజ్జగించి
ఒప్పగించగరు.

ఋణానుబంధము తీరెనని రో
శయ్యమొగమై దృష్టి నిలిపీ
మూగసైగతొ గుండె కలచెను
మూతకన్నులతో.

చూపు చూపుతొ హృదయగతులు
సూక్ష్మభావలొ తేటపడగను
జీవనస్వాతంత్ర్యలక్ష్మి
చెదరినట్లయ్యెన్.

పిత్రార్జితమ్మును నూడ్చిపెట్టగ
పెరిగ పైపడి ఋణము లన్నీ
చేరి నాలుగువేలలో చి
ల్లరలుమల్లరలు.

చెట్టకాలము పంటపాడయి
పొట్ట జరుగుటె కిటకిటాయెను
ఉన్న సరకులు ధరలు చెడి శూ
న్యమ్ము సేద్యమైన్.

మారిపోయెను జీవితము క్షణ
మాత్రమందున వేలిముద్రతొ
పగలు రాతిరి నడచి చేరిన
పాడువడ్డీచే.

అచ్చియున్నా కష్టమేనట
ఇచ్చియున్నా కష్టమేనట
సిరిగలారికి బీదలోకము
చిక్కులో పడగా.

ఇల్లు కట్టగ తాత తెచ్చిన
ఒల్లమాలిన ఋణము పెరిగి వ
సూళ్లు పోగా గొడ్డుగోదను
అసలుకై వదిలెఁ.

గంపెడెరువూ చేలొ చిమ్మిన
గరిశె డిచ్చును తనకు ధాన్యము
లంచమ్ము రయితులపాలి ప్ర
పంచధర్మమ్మె.

అలవచులవలు కాగ భూములు
అప్పుపాలై వృత్తిచెడ నా
ధరువు తప్పి కుటుంబ మెల్లా
అరుమూడాయెఁ.

చివికిపోయిన పూరిగుడిసెల
చవుడుపారిన మట్టిగోడల
వందగజముల ఇల్లుమినహా
వదలించె బాకీల్.

గట్టిగింజలు పొట్టుగింజలు
కలిపి పుట్టెడు భత్యె మగుటచె
తుష్టిపుష్టి కలుగు భోజన
పుష్టిగ లోపించె.

౪

దర్జాకు లోపము లేనిఖర్చూ
ఆర్జనకు సరిపోక మించీ
కొద్దికొద్దిగ అప్పు తెచ్చి
కొంపలను కూల్చెన్.

వచ్చిపోయెడి బంధువులతో
వెచ్చనూర్చెడి అర్థిజనముతో
ఇచ్చకములా స్నేహితులతో
హెచ్చె మొఖమాటం.

గొడవ తెలియనివారినైనను
కొద్దికొద్దిగ మచ్చు చల్లి
రాచి రంపముతోటి కోయును
రాచకీయములు.

కమత మేమిా ఖర్చుపూడక
కవులు కుంగి పంట పోయి
డవులు తగ్గగ అప్పుకొరకై
దేవులాటాయెన్.

ఎన్నికలలో గెలుపు చెందగ
అన్నిటను తా మెప్పు పొందగ
నాయకత్వము గోరి సంపద
నాశనము చేసెన్.

తెచ్చినవి తన పరువు నిల్పగ
తీర్చవలసెను పగటివడితో
మోసమిచ్చిన వేలు లెగ
వేసిపోవగను.

ఆదుకొని అడ్డమ్ము పోయీ
అయినవాండ్లను కనికరించి
దండుగలు వేలాదివేలుగ
దరిసి కోల్పోయి.

ఇంటిఖర్చుకు శేరి శిస్తుకు
పంట అయివజు చాలదాయెను
పెచ్చుఖర్చుకు చేతి కందదు
పెట్టుబడిసొమ్ము.

సాహుకారుల వత్తిడికినీ
సాటివారిలో సిగ్గుచేటై
క్రుగ్గవలసెను లోనలోన
మానుషమ్మునకు.

అమ్మబోయిన కొనగబోయిన
అడవి కొరవిగ నున్న రోజులు
డబ్బుతిరుగక సరకు విడువక
ధరలు క్రుంగుటచే.

వ్రణము కోసిన మానిపోవును
ఋణము తీర్చిన చెల్లిపోవును
సెలలువేసీ గూడుఅల్లును
శేష ముండినచో.

(సశేషము)

# నిలవ చెయ్యడం

శ్రీ చందూరి నాగేశ్వరరావు

నేను యింటర్ చదువుతున్న రోజులలో మా నాన్నగారు, "ఏ నెల కా నెల అకవుంట్ వ్రాస్తూ వుండు," అని నొక్కి నొక్కి చెప్పేవారు. నా ఖర్చులకి ఎంత కావలసివస్తుందో అంతా లెఖ్ఖ చూసి ఏ నెల కా నెల వారు పంపుతున్నప్పుడు, అకవుంట్ వ్రాయవలసిన అవసర మేమిటో ఎంతదీర్ఘంగా ఆలోచించినా నాకు బోధపడేదేకాదు. ఒకబహుళ ఏకాదశి రోజున నాకూ, మా నాన్నగారికీ ఈ విషయమై వాగ్వాదం కూడా జరిగింది.

"ఎప్పటిఖర్చు అప్పుడు నోట్ చేసుకొని అకవుంట్ వ్రాసుకోవడం మంచిఅలవాటు" అన్నా రాయన.

"వ్రాయకపోవడం చెడ్డఅలవాటా ?"

"అవును. అకవుంట్ వ్రాసుకోవడం అలవాటు లేనివాళ్లు, వాళ్లజన్మలో ఒక్కదమ్మిడీ నిలవచెయ్యలేరు. బాసపడేవాళ్ల లక్షణం..."

ఏమిటనుకుంటున్నారేమిటి! అకవుంట్ వ్రాసుకోవడం. ఆయనచెప్పిన వాక్యాలలోని సత్యాసత్యాల విషయమై ఎక్కువగా ఆలోచించక, ఆయన్ని తృప్తి పరచడమే ప్రధానంగా ఎంచుకొని, ఆనెలనుంచీ ఒక దొంగ అకవుంట్ తయారుచేసి పంపుతూ వుండేవాణ్ణి. నాకు బాసపడేలక్షణాలు అబ్బుతున్నాయని చాలా సంతోషించా రాయన. కాలేజీకోర్సు పూర్తి అవగానే ఆ అకవుంట్ బాధ తప్పింది.

నాటికి నేడు.

"మీరు ఉద్యోగంలో ప్రవేశించి మూడేళ్లయింది. ఒక్కరాగిదమ్మిడీ అయినా నిలవలేదు సరిగదా, పదిహేనో తారీఖు దాటినప్పట్నుంచీ, తోడి సుమాస్తాల్ని అప్పుకోసం శేధించుటకు తినటం అలవాటయింది."

"అవును. అప్పు చెయ్యడం నాకు అలవాటై పోయింది. 'అప్పుచేయుట తప్పు' అని ఎలిమెంటరీ స్కూలులో నా చిన్నతనంలోనూ ఎవరో పేస్టరు నాకూడా చెప్పేవుంటాడు. కాని, అప్పుడు తప్పులు అని అనుకొన్నవన్నీ యిప్పుడు ఒప్పులుగా భావిస్తున్నాం కాదూ !

నాకు నాపై అధికారులు నెలకి ౬౦రూపాయలు ముట్టచెప్తున్నారు. నెలకి ౬౦రూపాయిల చొప్పున సంవత్సరానికి ఎంతయింది? ౭౨౦రూపాయిలు. మూడు సంవత్సరాలకి ౨౧౬౦ రూపాయిలు. ఆ పొరబడ్డానా? అవునండోయ్ ౨౧౬౦ రూపాయిలు కాదు. ౨౫౨౦ రూపాయలు. నేను హిస్టరీస్ వాణ్ణండీ!! నాకు లెఖ్ఖలు బొత్తిగా రావు.

౨౧౬౦, కాదు, కాదు. ౨౫౨౦ రూపాయిలు. నేనూ శాంతా సునాయాశంగా ఖర్చు పెట్టేశాం. ఖర్చు పెట్టడంలో ఒకర్ని ఒకరం తీసిపోం. కాని మా యిద్దరిలో ఎవరు ఎక్కువ ఖర్చు చేస్తారనేది ఒక సమస్యే! అనాదినుంచీ స్త్రీ పురుషుడికి ఎలాటిసమస్య అయిందో యిదీ అంత సమస్యే! నేను ఎక్కువ వ్యయం చేస్తానంటుంది శాంత. ఆమె చాలా దుబారాఖర్చులు చేస్తుందని నానమ్మకం. ఈవిషయమై ఆమెతో నే నెప్పుడూ వాదించలేదు. ఎంచేతనంటే, ఆడదానితో వాదన చాలా ప్రమాదకరమైన వ్యవహారమని నా అనుభవాలు నాకు ఎన్నోసార్లు చెప్పాయి.

ప్రస్తుతానికి వద్దాం.

"డెబ్భయి రూపాయిలూ ఎలా ఖర్చుచేశావో నా కేం తెలుస్తుంది? ఈనెల మరీఘోరంగా వుంది. ఇవ్వాళ యింకా పదిహేనే!" అన్నాను. ప్రతినెలా సొంతఖర్చు కని పదిరూపాయిలు నాదగ్గిర వుంచుకొని

మిగతా అరవై ఆమెచేతిలో పెట్టడం రివాజు. ఇద్దరం ఖర్చు పెట్టడం అలవాటు.

"గత నెలలో మీరు చేసిన అప్పులు ఇరవై రూపాయలు మీసొంత ఖర్చుకని తీసుకొన్నవి పదిరూపాయలు. మిగిలినవి నలభయ్యే కాదూ!"

నలభై రూపాయలు శాంతదృష్టిలో అంత చేలికగా కనిపిస్తున్నాయి, — ఈ కరువురోజుల్లో. నెలకి నలభైరూపాయిలతో నాలుగు సంసారాలు ఈదేవాళ్లు వున్నారు. కాని, నెలకి నాలుగువందలు వున్నా నేనూ శాంతా యిలాగే కష్టపడతామేమో!

"మనం ఖర్చు తగ్గించాలి."

శాంత అడిగింది చిటికినవేలు కొరుక్కుంటూ; "ఎలా?"

"నువ్వు అకవుంట్ వ్రాయి."

"వ్రాస్తే?"

"నువ్వు అకవుంట్ వ్రాస్తూవుంటే మనం నిలవ చెయ్యవచ్చు."

'ఇది సాధ్యమా' అన్నట్లు శాంత తెల్లబోతూ చూసింది.

"మానాన్నగారు చెప్పారు. అకవుంట్ వ్రాసుకుంటూవుంటే మనం నిలవ చెయ్యగలం."

"అలాగా!" అంటూ శాంతాదేవి ఆలోచిస్తోంది. మధ్యాహ్నం కాఫీకిగాను అలమారులో భద్రపరిచిన పాలు తాగాలని ప్రయత్నంచేస్తున్న పిల్లిపిల్లని కొట్టడానికి వంటింట్లోకి పరుగెత్తింది.

ఎలా అయితేనేం, నిశ్చయించుకొన్నాం,—అకవుంట్ వ్రాయడానికి. నేను ప్రొప్రయిటర్ని. శాంతాదేవి అకవుంటెంట్ అండ్ కాషియర్. ఆమె వ్రాస్తుంది. నేను అజమాయిషీ చేస్తూవుంటాను.

గడిచినరాత్రి వెంకట్రావుదగ్గిర అప్పుగా పుచ్చుకొన్న పదిరూపాయిలలోనూ, సినీమాకి సినీమాలోను ఖర్చుపెట్టగా మిగిలిన ఎనిమిదిరూపాయిలలో పన్నెండు అణాలు వెచ్చించి అందమయిన అకవుంట్ పుస్తకం ఒకటి కొన్నాం. పుస్తకం కొనడందగ్గిరకూడా కొద్దిగా పేచీపడ్డాం. పేచీపడడమే నావంతుగాని పంతం నెగ్గించుకోవడం ఆమెవంతే! మూడణాలపుస్తకం కొనమంటాను — నేను, పన్నెండణాలపుస్తకం కొందాం, పదికాలాలపాటు వుండవద్దా!—అంటుందామె. చివరికి పన్నెండణాల పుస్తకమే శాంతాదేవి మృదువైనచేతివేళ్ల మధ్య వుంచుని, నన్ను చూసి వెటకారంగా నవ్వింది.

"ఇంకా ఏవయినా కావాలా?" అని సగౌరవంగా షాపువాడు అడిగాడు.

ఏమీ అక్కర్లేదని తలపంకిస్తూ, బిల్లు చెల్లించబోతూవుండగా శాంతాదేవి "ఫవుంటెన్ పెన్"! అంది. అని ప్రశ్నార్థకంగా నా మొహంలోకి చూసింది.

మళ్లీ నెలలో కొనుక్కోవచ్చునని శాంతని సమాధానపరుస్తున్నాను. కాని ఆషాపువాడు పూరుషుండేనా! యమకింకరుడిలా పోగయాడు నా పాలిట! అరనిముషంలో రెండు డజనుల ఫవుంటెన్ పెన్ పెట్టెలు తీసుకువచ్చి, శాంతాదేవిముందు పడేశాడు. అన్ని కొత్త వస్తువులు ముందు మెరమెర మెరిసిపోతూవుంటే—శాంత—ఈపాత మొగుడి వంక చూస్తుందీ! నిజంగా ఆడదానితో ఫాన్సీషాపులోకి వెళ్లడం చాలా బుద్ధితక్కువపని.

కర్మయోగిలా ఆమెనెలక్షన్ చూస్తున్నాను. ఒకగ్రోసు ఫవుంటెన్ పెన్నులలో రెండుమాత్రమే ఆమెకి నదరుగా కనిపించాయి.

"ఈపెన్ బావుందా?" అంటూ ఒకఫవుంటెన్ పెన్ చూపించింది.

"ఊఁ!" అన్నాను.

ఎర్రరంగులో వున్న పెన్ ఒకటి తీసియింకొకటి ప్రశ్న వేసింది.

నేను మళ్లీ, "ఊఁ!" అన్నాను.

"ఈరెంటిలో ఏది బావుంటుందో చెప్పండి."

"రెండూ బాగానే వున్నాయి."

"రెంటిటిలోనూ, ఏది అందంగా వుంది?"

"రెండూ అందంగానే వున్నాయి."

"చెప్పరూ?" అంది Decisive గా. నవ్వుతే సొట్టలుపడే ఆమె చెక్కిళ్ల అందానికి దాసుడ నైపోయి నవ్వుతూ ఆకుపచ్చ ఫవుంటెన్ పెన్ మీద నా అభిమానం చూపించాను.

బతికి బయట పడతా ననుకొన్నాను. కాని, ఆ షాపువాడు నన్నూ శాంతనీ తనషాపులోని వస్తువులన్నీ కొనేదాకా వదిలేటట్టు లేదు. నే నేమయినా జమీందారు ననుకొన్నాడో ఏమో!

"ఇంక వద్దమ్మా? కలర్స్...ఆర్ బ్లూబ్లాక్?"

శాంత అడిగింది: "వైలెట్ వుందా?"

"వైలెట్ కళ్లకి జబ్బు చేస్తుంది," అన్నాను,— అందామని అనుకోకుండానే!

"మన పక్కింట్లో వుంటున్న ఎడిటర్ గారి భార్య వైలెట్ యింకు వాడుతుంది" అంది శాంత.

ఇంక అపీలు వుందీ! ఎడిటర్ గారి భార్య అథారిటీ కామా! నేనింకేమీ మాట్లాడదలచుకోలేదు. ఆడది పట్టే మొగినోము మొగాణ్ణి అయిన నేను పట్టవలసి వచ్చింది.

ఒక బ్లాటింగ్ పేపరు షీటుతోనూ, ఒక దస్తాకాగితాలతోనూ, ఒక వైలెట్ యింక్ బాటిల్ తోనూ, శాంతాదేవి పేరు చెక్కబడివున్న ఒక ఫవుంటెన్ పెన్ తోనూ, మూలకారణమైన అకవుంట్ బుక్ తోనూ చైనాబజారు అడ్డంగా దాటి బస్సు ఎక్కాం.

జూన్ పదిహేడో తారీఖు సాయంత్రం అయున్నరకి ఈ హడావిడి అంతా జరిగినా, జూలై మూడో తారీఖుదాకా కొత్తపుస్తకంలో 'శ్రీరామా' పెట్టదలుచుకోలేదు. జూలై ఒకటో తేదీ పబ్లిక్ హాలీడే. రెండు ఆదివారం. రాబడి మూడో తారీఖువరకూ వుండదు. అప్పతో అకవుంట్ ఆరంభించడం అశుభసూచకం. మే మిద్దరమూ ఏకీభవించడమనేది చాలా అరుదు. మా యిద్దరి వ్యవహారమూ హిందూ మహమ్మదీయ సమస్య లాటిది. కాని, ఒక్క అకవుంట్ బుక్ విషయంలో మాత్రం మే మిద్దరమూ తీర్మానించుకొన్న నిర్ణయం ఒక్కటే అయిందని లోకాని వెల్లడించేందుకు నేను చాలాగర్విస్తున్నాను.

మూడో తేదీ సాయంత్రం బరువైన పర్సుతోనూ, ఉత్సాహంతో కుప్పిగంతులేస్తున్న మనస్సుతోనూ నేను యిల్లు చేరుకొనేటప్పటికి, "యివ్వాళ సినీమాకి వెళ్లామండోయ్!" అంది శాంత. ఇంకా అనేక కారణాల వల్ల నాలుగో తారీఖు రాత్రి ఎనిమిదిగంటలవరకూ కొత్త అకవుంట్ పుస్తకానికి శాంతాదేవికరస్పర్శ తగిలే యోగ్యత లేకపోయింది.

రాబడికాలమ్ లో జమ రూ. ౬౯-౧౫-౦ అని వ్రాసింది. ఖర్చుకాలమ్ లో భర్తగారి సొంతఖర్చులకి పదిరూపాయలు.

శాంతని అడిగాను: "అన్ని ఖర్చులలోనూ యిదే నీకు మొట్టమొదట స్ఫురణకి తట్టిందా?"

శాంత చిరునవ్వు నవ్వింది. ఆ చక్కటినవ్వులో స్త్రీలోని చిలిపితన మంతా మూడుమూర్తులా మూర్తీభవించింది.

సినీమా సాదరూ, పాలవాడిబాకీ, దాసీదాని జీతమూ మొదలైన ఖర్చులన్నీ ఖర్చుకాలమ్ లో నిండుగా వున్నాయి జమకాలములో ఒకే ఒక్క అయిటముని రాబడి — బోసినోటిలో అన్ని పళ్లూ రాలిపోగా మిగిలిపోయిన ఒక్కపన్నులా వుంది. అంత అందమయిన అకవుంట్ పుస్తకంలోనూ జమకాలములో నెలకి ఒక్కసారే అంకె పడుతుందన్న దుర్భరవిషయం నామీద నాకు జాలిగొలిపింది.

కాని, ఒక్క అపూర్వరహస్యం. ఆడపిల్ల అకవుంట్ మెయిన్ టెయిన్ చెయ్యడంలో కూడా రొమాన్సు వుంది సుమండీ!

రాత్రి భోజనా లైపోయినతర్వాత ఈ కరోబరాన్ని మంచంమీద పారేసి నాకు యింక్రిమెంటు ఎప్పుడు వస్తుందా అని నేను యోచిస్తూవుండడమూ, వయ్యారంతో లోలకులు ఆడించుకుంటూ, పైట సర్దుకుంటూ కాగితం చినిగిపోతుందేమో—పెన్ను అరిగిపోతుందేమో—చెయ్యి కందిపోతుందేమో—అన్నంత సుకుమారంగా వ్రాస్తూ, స్త్రీలోని చిత్తచాంచల్యాన్ని తెలిపేందుకా అన్నట్లు తల అల్లలలాడిస్తూ, "ఏమండీ, యివ్వాళ ఏమేం ఖర్చులు చేశామండీ" అని ఆమె

నన్ను ఉద్దేశించి అనడమూ, ఆ అమృతవాక్కుల లోని మాధుర్యాన్ని గ్రహించక యింక్రిమెంటు కాన పనుకున్న నేను మొరటుగా, ఆఫ్రికాలో పుట్టిపెరిగిన వాడిలా "నాకేం తెలుసు!" అని జవాబివ్వడమూ. ...ఆమెకి కోపం...అది సాధారణ...కోపమూ కాదు —అసాధారణ కోపమూ కాదు....ప్రణయకోపం ... ......అదంతా ఒకఫార్సు.

ఈ ప్రకారంగా పదిహేనురోజులు గడిచాయి. డబ్బు పూర్తిగా అయిపోయింది. వెంకట్రావుదగ్గిరికి భిక్షాటనకి బయలుదేరాను. భగవంతుడి ధర్మమూ అంటూ కొందర్ని నిలవచేసేవాళ్లుగానూ, కొందర్ని ఖర్చుచేసేవాళ్లుగానూ సృష్టిస్తాడు. అందర్నీ చాలా ఖర్చుచేసేవాళ్లుగానే సృష్టించివుంటే, ఈ సృష్టి ఎప్పుడో ఆగిపోయివుండేది, పెట్రోలు అయిపోయిన మోటారు బస్సులా. అకవుంట్ పుస్తకంలో జమ కాలమ్ నేననుకొన్నంత బోసిగాలేదు. పదిరూపాయిల అప్పుతో విరాజిల్లింది.

రెండు నెలలు గతించేటప్పటికి అకవుంట్ పుస్తకంలో గొప్పపరివర్తన కలిగింది. తరుచుగా—చారులో ఉప్పువెయ్యడమూ, కాఫీలో పంచదార వెయ్యడమూ మర్చిపోయేశాంత చేసినఖర్చులన్నీ జ్ఞప్తిలో వుంచుకో గలదూ? కాని, అకవుంట్ మెయిన్‌టెయిన్ చెయ్యడంవిషయంలోమాత్రం ఆమె చాలా శ్రమపడిందనే చెప్పాలి. ఖర్చులన్నీ స్మరణకి తెచ్చుకొని ఎంతో వివేకంతో వాటిని రికార్డుచేసేది. అంతకీ కొన్ని ఖర్చులు ఆమె మనోదృక్పథానికి అందకుండా లేడిపిల్లలలా పరిగెత్తేవి. ఏంచేస్తుంది, పాపం!

తుడుపులూ, వ్రాసినఖర్చులే పొరపాటున మళ్లీ వ్రాయడంలో, కొట్టివేతలూ మొదలైన ఘోరాలన్నీ జరిగేవి. ఒకరోజున సీతాబాయమ్మగారి రెండో కుర్రాణ్ణి చంకలో పెట్టుకొని అకవుంట్ వ్రాస్తూ వుండగా, ఆ కొంటెవెధవ—కాలికో అట్టతో ధగధగలాడుతున్న ఆపుస్తకరాజం ఏదో పెద్దరకం చాక్లెట్ అనుకొన్నాడు కాబోలు — అంత పుస్తకాన్ని కబళించే ప్రయత్నంలో రెండు చేతుల్తోనూ పట్టుకోగా, శాంతాదేవి విదిలించడమూ పది కాగితాలు ఛర్రున చిరగడమూ సంభవించాయి. ఒక అమావాస్యనాడు వర్జ ఘడియలలో శాంతాదేవి చెయ్యి టేబిల్‌మీద హుషారుగా వున్న సిరాబుడ్డికి తగలగా, ఆ సిరాబుడ్డి పుస్తకానికి సిరాస్నానం చేయించింది ఈ విధంగా ఆ పుస్తకం యిప్పుడు రూపు మారిపోయినదై, పేజీలు పోగొట్టుకొన్నదై, ముఖ్యములైన జమాఖర్చులుమాత్రమే కలిగినటువంటిదై ఆంధ్రమహోవైభవాన్ని సూచించే హంపీ శిథిలాలని జ్ఞాపకం చేస్తోంది.

ఈ అకవుంట్ బాధవల్ల లాభమూ కనిపించలేదు, నష్టమూ కనిపించలేదు. జీతం వచ్చేటప్పటికి పదిహేనురూపాయిల అప్పూ అలాగే వుంటూ వుండేది. ఎటొచ్చీ, కొత్త అకవుంట్ బుక్ కావాలనే ప్రయత్నంలో వుంది శాంత.

ఒకరోజు సాయంత్రం ఆఫీసునుంచి రాగానే పట్టలేని సంతోషాతిశయంతో అన్నాను. "శాంతా, నాకు పదిహేను రూపాయలు యింక్రిమెంటు యిచ్చారు."

ఆమె నవ్వుతూ అంది: "అయితే మనం యింకో అకవుంట్ పుస్తకం కొనవలసిన పనిలేదు.

"ఏం?"

"ఈ పదిహేను రూపాయిలూ నిలవేగా!"

"మనం ప్రతినెలా పదిహేనురూపాయిలు అప్పు చేస్తున్నాంగా!"

"ఈనెలనుంచి అప్పుచెయ్యవలసిన అవసరం వుండదు. ఎంచేతనంటే, మనకి ప్రతినెలా పదిహేను రూపాయిలు ఎక్కువ వస్తున్నాయిగా!"

"అనగా!" అన్నాను, నవ్వుతూ.

"అరిటికాయముక్కలు మాడిపోతున్నాయి." అంటూ వంటింట్లోకి దూకింది శాంత.

" నిలవచెయ్యడం? " అన్నాను. ఆమె వినిపించుకోలేదు. గాలిలో కలిసిపోయాయి ఆ మాటలు.

---

# సుమేరునాగరికత: భారతదేశము

శ్రీ టి. వి. కృష్ణశర్మ

### నాగరికతకు నాదిభూమి

బైబిలునందలి ఉత్పత్తికాండము (Genesis) ననుసరించి 'ఫరాతు', 'దజలా'ల పల్లపు ప్రదేశమే (మెసపుటోమియాయే) మానవసంస్కృతికి జన్మస్థానముగా నున్నది. ఆకారణముననే యూరపుపండితు లచ్చటి భూగర్భమును ద్రవ్వుటకు మొదలిడిరి. తత్పరిణామముగా నేటివరకచ్చట ననేకయుగముల అవశేషములు దొరకియున్నవి. మఱియొకవైపున నీజిప్టుప్రదేశము తన యత్యంతప్రాచీనము లగు పిరామిడులకును, రాజమందిరములకును బ్రసిద్ధమై యుండెను. కావునఁ బండిత ప్రకాండు లచ్చటఁగూడఁ ద్రవ్వింపసాగిరి. కొంతకాలమువరకు నీజిప్టును ప్రపంచమున నతిప్రాచీన దేశముగాను, నాగరికత కాదిభూమిగాను దలంచుచుండిరి. ఇటీవల మెసపుటోమియాయందు 'సుమేరు' అను ఒకజాతి నాగరికతకు భగ్నావశేషము లుపలబ్ధములయ్యెను. దాని నాగరికత ఈజిప్టునాగరికతకంటెఁ బ్రాచీనతరముగా గనుపించెను. ఇటు నైఋత్య ఈరానునందు 'సుసా' యను ప్రాచీననగరమును ద్రవ్వుటలో మఱియొక ప్రాచీననగర లక్షణములు గోచరించెను. వానిని 'ప్రోటో-ఇలామైటు' చిహ్నములు అని పిలుచుచున్నారు. 'ఊర్', 'కిష్' అను సుమేరు నగరములను ద్రవ్వగా సుమేరు యుగలక్షణముల కంటెఁ గ్రిందుగా 'ప్రోటో-ఇలామైటు' యుగ చిహ్నములు లభ్యములగుటచే నీ 'ప్రోటో-ఇలామైటు' నాగరికత ప్రపంచమునఁ బ్రాచీనతమ మని స్పష్ట మగుచున్నది. ఇపుడు మానవసభ్యతకుఁ బ్రారంభ మెచ్చటనుండి అనునది ప్రశ్నము. ప్రోటో-ఇలామైటులే ప్రప్రథమ సభ్యతానిర్మాత లగుదురా? సుసాప్రాంతమున నన్నిటికంటె నడుగునను 'తపామిస్యాను', 'ఇరీదు', 'ఉర్' మొదలగు వానియందును లభించిన ఈసభ్యతావశేషములు వారే మానవసభ్యతకు ఆదిమప్రవర్తకు లని చాటుచున్నవి. కాని వీరి సభ్యతావశేషముల కంటె నడుగున మఱియేయుగచిహ్నములును దొరకకుండుటచే వీరు మఱియొక దేశమునుండి తమ నాగరికతను, కృషిని ఇచ్చటకు గొనివచ్చిరని స్థిరమగుచున్నది. ఈ కారణమున నాగరికతకుఁ బ్రథమస్థానము 'మెసపుటోమియా' యనుటకు వీలు లేకున్నది.

### భారతీయ పండితులు

ఇఁక నీ దరిద్రభారతభూమిని దిలకింతము. యూరోపీయులును, భారతీయులు నగు పండితులు భారతదేశ చరిత్రమును గాలించి వైచిరి. భారతీయ పండితులవి రెండు కక్షలు గలవు. ఒకకక్షవారు తమ ప్రాచీన గ్రంథముల నాధారముగాఁ గొని దీనినే సర్వప్రథమ దేశ మని చెప్పుదురు. కాని వానిని వినువారు లేరు; ఏలయన వారి నిర్బల ప్రమాణములు వారి యాత్మతృప్తికి మాత్రమే చాలి

యున్నవి. చరిత్రవాసన నెఱుంగని వారినే నమ్మింపఁ గలవు. విదేశపండితులను గూడ నాకర్షింపఁగల విశేషము వానియందు లేదు. రెండవ పక్షము శాస్త్రీయపద్ధతులపై చారిత్రిక పరిశోధనలద్వారా పనులు సాగించుచున్నది. కాని ఆపక్షము బౌద్ధయుగమును దాని ఇటీవలి కాలమును మాత్రమే తమ పరిశోధనకు విషయమును గావించికొనినది. బౌద్ధయుగమునకంటెఁ బూర్వకాలమును గుఱించి వారు పాశ్చాత్యుల యంధానుకరణులుగా నున్నారు. దీనికి స్పష్టమైన యుదాహరణము సింధునాగరికత. దాని యవశేషములు సింధులో 'మహాన్-జో-దడో'యందును, దక్షిణ పంజాబునందు 'హడప్పా' యందును దొఱకియున్నవి. పాశ్చాత్యపండితులు వీనిని ఆర్యులరాకకు ముందటి ద్రావిడయుగచిహ్నము లనిరి. కావున భారతీయులును నట్లే తలంచుచున్నారు. ఒకరిద్దరు దానిని ఆర్యనాగరికతగా నిరూపింపఁజూచిరి. వారు వైదిక, పౌరాణిక ఆధారములనే ప్రమాణములుగాఁ గైకొనిరి కావున పురాతత్త్వవేత్తల దృష్టిని దానికి మూల్యము లేకుండెను.

### ప్రోటో - ఇలామైటు నాగరికత

వేరుగా ప్రకటింపఁబడిన మఱియొక లేఖలో పురాతత్త్వ పద్ధతితోనే 'ప్రోటో-ఇలామైటులు' భారతీయ వైదికకృషికు లని నిరూపింపఁబడియున్నది. అందు వారు మెసపుటోమియావరకుఁ బోయియుండిరి. భారతదేశమునుండియే నాగరికతను గృషిని వెంటఁ గొనిపోయియుండిరని యది నిరూపింపఁబడెను. కొంతకాలమైన తరువాత నచ్చట 'ఫరాతు' నదియందు ప్రపంచమున ప్రళయమని పిలువఁబడు గొప్పవెల్లువ వచ్చియుండెను. దీని చిహ్నములు 'ఊర్', 'కిష్'లందు సుమేరు యుగమునకుఁ గ్రిందుగాను ప్రోటో-ఇలామైటు యుగమునకు పైనను దొఱకియున్నవి. ఈ భయంకరజలప్రళయమున భారతీయ కర్షకుల ప్రాణధనములకు భరింపరాని నష్టము కలిగెను. దానిచే వారు మెసపుటోమియాను ఈరానును వదలి మరల హిందుస్థానమును జేరిరి. నేటికిని వారి పాడువడిన నివాసముల చిహ్నములు అచ్చటి యున్నత ప్రదేశములయందుఁ గలవు. వీరి తరువాత సుమేరులు మెసపుటోమియా చేరి అచ్చట నివాసము లేర్పరచుకొనిరి. వీరు అచ్చట అనేకములు గొప్పగొప్పనగరములు 'ఇరీదు', 'కిష్', 'నిప్పూర్', 'ఎరేల్', 'బాబిలన్' మొదలగునవి నిర్మించిరి. ౨౦౦౦ వర్షములు పశ్చిమ ఆసియాను శాసించుచుండిరి. తమరాజు సరనుని కాలముననే వారు ఈజిప్టుదేశమున తమసభ్యతను నెలకొల్పిరి. ఈసుమేరు లేజాతికి చెందినవారు? ఎచ్చటనుండి పోయి అచ్చట చేరిరి? అను విషయ మీవ్యాసమునఁ జర్చింపఁబడును.

### సింధుసభ్యత - సింధులిపి

'మహాన్-జో-దడో', 'హడప్పా'ల సింధుసభ్యతకును సుమేరు సభ్యతకును జాలవఱకు పరస్పరము పోలిక లున్నవి. ఈ రెండు ప్రదేశములయందును అజ్ఞాతమగు నొక చిత్రమయలిపియందు చెక్కిన నాణెములు లభించినవి. ఈలిపి సింధులిపి యని ములు అనేకపిలువఁబడుచున్నది. సుమేరులిపితోఁ జాలవఱకు సరిపోలుచున్నది. కావుననే యూరపుపండితులు ఈ రెండు లిపులను ఒకేమాతృకకు పుత్రికలని తలంచుచున్నారు.

ప్రోటో - ఇలామైటులిపి - వీని రెంటికిని మాతృక యని తలంపఁబడుచున్నది.

### సింధు-సుమేరులిపుల సంబంధము

మొన్న మొన్నటి క్రొత్తత్రవ్వకములలో కొన్ని సింధులిపి గలనాణెములు మెసపుటోమియాయందు 'కిష్', 'సుసా-హిత్తీయు' మొదలగు సుమేరు నగరముల బునాదుల క్రింద దొరకియున్నవి. ఇందుచే సింధులిపి సుమేరులిపికంటెఁ బ్రాచీనతర మని స్పష్టమైనది. డాక్టరు లెంగ్డనునకు 'జమదేతనస్ర' త్రవ్వకములలో కొన్ని పత్రములు దొరకియున్నవి. అందలిలిపి ప్రారంభిక సుమేరు లిపి యని నిర్ణయింపఁబడినది. 'జమదేతనస్ర'యందలి యీ ప్రారంభిక సుమేరులిపిని సింధులిపితో పోల్చినపుడు ఈలిపి సింధులిపినుండి పుట్టియున్నదని స్పష్టముగా తెలియుచున్నది. ఈవిధమున కాలమును పోలికను బట్టికూడ సుమేరులిపి సింధులిపిపుత్రిక యని తేలుచున్నది.

### సుమేరుసభ్యతకు మాతృక సింధుసభ్యత

సభ్యతావిషయమునను నిట్లే నిర్ణయింపవలసి యున్నది. సుమేరు నగరముల ప్రారంభికపు పొరలయందు దొరకిన వస్తువులు మహెం - జో - దడో యందు దొరకిన వానిని మిక్కిలి పోలియున్నవి. సుమేరునగరముల భవనములు పచ్చి ఇటుకలతో కట్టఁబడును. కాని వానికిఁ గ్రిందిభాగమునఁ గాల్చిన ఇటుకలు దొరకి యున్నవి. వాని నిర్మాణమును కొలతయును మహెం-జో-దడో ఇటుకలను పోలియున్నది. వీని యన్నిటిచే సుమేరుసభ్యత సింధుసభ్యతకుఁ బుత్రిక యని నిశ్చయమగుచున్నది. కాని ఇట రెండు బాధకములు గలవు. మొదటిది సుమేరు నగరముల క్రింద లభ్యమైన ముద్రలు ఆకారమున మహెం-జో-దడో, హడప్పాలముద్రలకంటె భిన్నముగా నున్నవి. కావున నవి సింధుప్రాంతమునుండి అచ్చటకుఁ బోయియుండలేదని తెలియుచున్నది. రెండవది, సుమేరు సాహిత్యమునం దంతటను సుమేరులు సముద్రమార్గమున ఈరానుసముద్రమునఁ బ్రవేశించి మెసపుటోమియాను జేరి రనియు, ఇచ్చటి ఇరీదు అనురేవున వారి ప్రప్రథమ రాజు 'ఉక్కు-సి' రాజధానిని స్థాపించెనని యుఁ దెలియుచున్నది. సర్ ఓరెలు స్టీనుగారి పరిశోధనలవలన సింధుసభ్యత బిలోచిస్తానము, సీస్తానములవరకు వ్యాపించి యున్నదని తెలియుచున్నది. ఈ కారణమున నది సముద్రమార్గమునఁ జేరిన దనుట యసంగతము. అచ్చటకుఁ బోవుటకు సుగమమగు చక్కని మార్గము స్థలమార్గము. మహెం-జో-దడో, హడప్పాలయందు దొరకిన ముద్రికలలో రెండుమూఁడింటి మీఁద మాత్రమే నదీగామియగు చిన్న ఓడయాకారము చెక్కఁబడియున్నది. అందువలన మహెం-జో-దడో లేదా సింధు ఉపత్యకావాసులు జలగాములు కారని చెప్పనగును. ఈ పరిస్థితిలో సింధుసభ్యత యేవిధమున సముద్రము ద్వారా మెసపుటోమియాకు జేరి సుమేరుసభ్యతకు జన్మదాత యైనదియు నిరూపించవలసి యున్నది.

### సింధుసభ్యత - సురాష్ట్రము (కఠియవాడు)

ప్రాచీన కాలమున సరస్వతీనది శివాలిక పర్వతములలోఁ బుట్టి దక్షిణపాంచాలము ఉత్తరరాజపుత్ర స్థానము సింధుదేశములగుండా పారి, రణకచ్ఛము నధిగమించి

సురాష్ట్రమును (కఠియవాడును) గుజరాత మునుండి వేరుచేయుచు కంభాయత అఖాత మున సముద్రములోఁ గలియుచుండెను. ఈ పరిక్రమమున నేఁటికిని సురాష్ట్రమునుండి కురుక్షేత్రమువరకును దాని శుష్క-మార్గ ము కనుపడుచున్నది. సింధునది రణకచ్ఛ మున నీ సరస్వతియందే కలియుచుండెను. ఇప్పటికి నూరు వత్సరములకుఁ బూర్వము వరకు సింధునదీశాఖ యొకటి రణకచ్ఛము నకు వచ్చుచుండెను ఈవిధమున కచ్ఛసు రాష్ట్రములును సింధు ప్రాంతముతోఁ జేరి యుండెను. సింధునాగరికత సురాష్ట్రము వర కును వ్యాపించి యుండెను. సురాష్ట్రమున రంగపుర గ్రామమున దీనికి చిహ్నములు దొరికియున్నవి. ప్రభాస(సోమనాథము)సమీ పమునఁ బ్రాచీనపు మిట్టలయందు సింధు సభ్యతకు అనురూపమైన ఇటుకలును, మట్టి పాత్రలును గనుపడుచున్నవి. ఈసురాష్ట్ర మే ప్రాచీనకాలమున సింధుసభ్యతకు సాగర వ్యాపారకేంద్రముగా నుండెను. ఇచ్చట నుండి సింధుసరస్వతుల ద్వారా నావలయం దుత్తర భారతమునకు రాకపోకలు జరుగు చుండెను. నేఁటికిని సురాష్ట్ర మెసపుటోమి యాలమధ్య సముద్రవ్యాపారము అధికపరి మాణముననే జరుగుచున్నది. సింధుసభ్య తను వెంటఁగొని సురాష్ట్రవాసులే సముద్ర మార్గమున మెసపుటోమియా చేరియుండిరి. సుమేరునగరముల యాదిమప్రస్తరముల యందు దొరకిన సింధు నాణెములు ఇచ్చట నుండి చేరినవియే; లేదా సుమేరులే వానినిఁ దమవెంటఁ గొనిపోయియుందురు. సింధు సభ్యత సురాష్ట్రమువరకు వ్యాపించియుం డెను. ఇచ్చటనుండియే దానికి విదేశములతో సాముద్రిక సంబంధ మేర్పడెను. కావున దానిని మనము సింధు సురాష్ట్రసభ్యత యనవచ్చును.

## సురాష్ట్రవాసులు; సు-వర్ణులు; సు-మేరులును

మహాభారతమునందు సింధు సువర్ణ ప్రదేశమును, జాతియు నుల్లేఖింపఁబడి యున్నవి. సింధు శబ్దముచే స్పష్టముగా సింధుప్రాంత మని తెలియుచున్నది. కాని సువర్ణశబ్దమున కేమి యర్థము? చూచెద ముగాక. సువర్ణమున కర్థ మిట్లు, సు-వర్ణము= జాతి; సుజాతి యని కఠియవాడు [1]ప్రాచీననా

1. కఠియవాడు నామము రహస్యమయము. ఇప్పటికి వేల సంవత్సరములకు పూర్వము సుమేరులు సురాష్ట్రము నుండి మెసపుటోమియాఁ జేరిరి. అటులే క్షత్రియులును ఆసియామైనరుఁ జేరిరి. అచ్చట వారు ఖత్తీలని పిలువఁ బడిరి. బైబిలునందు వీరిని హిటా-ఇటులని చెప్పఁబడినది. తమకాలమున నియ్యది పశ్చిమ ఆసియాయందు సర్వాధిక శక్తిశాలి యను జాతిగా నుండెను. భూమధ్య సాగరమునుండి మెసపుటోమియావరకు వీరి సామ్రాజ్యము వ్యాపించియుండెను. గ్రీకు, ట్రోజను, క్రీటను మొదలగు నాగరికతలకు నీ జాతియే జన్మదాత. మహా శక్తివంతమగు నీజిప్టును వీరే ఛిన్నాభిన్నము గావించిరి. ౨౫౦౦ వర్షములు పశ్చిమ ఆసియాపై శాసనము గావించిన యనంతరము వీరిశక్తి చాలవఱకు క్షీణించెను. అస్సీరియను సామ్రాజ్యము శక్తిశాలియైన పిదప నచ్చటి రాజు తిగ్లాత్ ఫిలేసరు వీరిని పరాజితులఁజేసి క్రీ. పూ. ౮-వ శతాబ్దమున తమ దేశమునుండి వెడలనడచెను. వీరు ఈరాను బెలూచిస్థాన ముల భూమార్గమున పంజాబునకు వచ్చి చేరిరి. అచ్చట శాకలనగరమును రాజధానిని గావించి ప్రజాసత్తాత్మక రాజ్యమును స్థాపించిరి. అలెగ్జాండరు నెదిరించుట మూలమున నాతఁడు వీరిని జయించి సింధు ప్రాంతములకుఁ దరిమి

మమగు సురాష్ట్రశబ్దముచే ఈసువర్ణము లేక సుజాతికి నివాసమగుట సురాష్ట్రమని యేర్పడిన దని తేలుచున్నది. ఘూర్జరులనివాసము ఘూర్జరరాష్ట్ర మనబరగుచున్నది కదా! (ఘూర్జరరాష్ట్రమున కపభ్రంశము గుజరాతము). ఈ ప్రకారము సువర్ణులును సురాష్ట్రవాసు లని స్పష్ట మగుచున్నది. సింధుసురాష్ట్రము లేక దేశము లగుటవలన రెండు దేశముల సంస్కృతియు నొక్కటిగానే యుండెను. కావుననే యీ రెండు దేశములును సింధుసువర్ణ దేశ మని ఒకటిగానే వ్యవహరింపఁబడుచుండెను. అటులే యీరెండు దేశముఁల జాతులకు సింధు సువర్ణజాతియని యొక పేరు గలిగెను. ఇప్పటికి సింధుసురాష్ట్రముల సంస్కృతికిఁ గల కలయిక సురాష్ట్ర గుజరాతము సంస్కృతికి లేదు. ఉత్తరకతియవాడునుండి కచ్ఛసింధుప్రదేశములవరకు నొకేభాష మాట్లాడ బడుచున్నది.

సుమేరు శబ్దము నర్థమును సుజాతియగుచున్నది. సురాష్ట్రవాసులగు సువర్ణులు సుజాతియని పిలువబడుచున్నట్లే సురాష్ట్రవాసులే మెసపుటోమియాకు వెళ్లి సుమేరులని పిలువబడిరని నిరూపింపబడుచున్నది. పురాతత్త్వ ప్రమాణముచేతను, నామసారూప్యముచేతను సుమేరుసభ్యతాస్థాపకులు భారతవర్షమునందలి సురాష్ట్రవాసు లనియే రూఢమగుచున్నది. ఇఁక భారతీయ సుమేరు రాజవంశములయం దేమైనను పోలికలు గలవేమో చూడవలసియున్నది.

### భారతీయ - సుమేరు రాజవంశములు

సుమేరులు తమ సాహిత్యమును ఇటుకలపై వ్రాయుచుండిరి; ఏలయన మెసపుటోమియాయందు రాళ్లుగాని భూర్జపత్రములుగాని తాటియాఁకులు గాని వ్రాఁత కుపకరించు మరియే సాధనములు గాని దొరకకుండెను. వీరి సాహిత్యమునందు వీరి రాజులవంశావళులు నిప్పూర్, ఇసిన్, కిష్ మొదలగు నగరములయందు దొరకియున్నవి. వీనిలో 'కిష్' వంశావళి ప్రాచీనతమము. అందు సుమేరుజాతియొక్క ప్రథమ రాజవంశము మొదలు (ఇరీదు రాజవంశము) ఇనోకుయొక్క నైదవ రాజవంశమువరకు రాజుల వంశావళియును, రాజులకాలమును ఇవ్వఁబడియున్నవి. ఇరీదురాజవంశమే పశ్చిమ ఆసి

---

వేసెను. అలెగ్జాండరులేఖకులు వీరిని 'కాౘియనులు' అని పేర్కొనియున్నారు. మాంటుసమరీయందలి కతియారాజపుత్రులు మియాఁవాలీయందలి కతియాజాటుల రూపమున వీరిసంతానము నేటికిని పంజాబునందుఁ గలదు. సింధునందు వీరు చాలకాలము పాలించిరి. అచ్చట దుర్భిక్షము కలుగఁగా వీరు కచ్ఛమును జేరిరి. వీరి స్త్రీలు చాల రూపవతులు. కచ్ఛయందలి రావు వీరియంగన నొకతెతో వ్యభిచరించెను తదర్థము వీరు రావును జంపివైచిరి. దానిపై యుద్ధము జరిగెను. తత్ఫలముగా వీరు కచ్ఛమును వదలి సురాష్ట్రమున నివసింపవలసివచ్చెను. ఇచ్చట తమ పరాక్రమముతో అనేకరాజ్యములు స్థాపించిరి. సురాష్ట్రమున మహారాష్ట్రప్రదేశము వరకు వీరు ప్రబలులైయుండిరి. ఆ కారణమువలనే మరాఠులు ఈ ప్రదేశమును కతియవాడని (కాఠీజనులదేశమని) పిలువసాగిరి. కతియావాడునందు వీరి కిప్పటికిని చిన్న చిన్న రాజ్యములు కలవు ఇప్పటికిని వీరు తమ ఆసియామైనరునందలి మతమగు సూర్యపూజను వదలకున్నారు. ఇప్పటికిని వీరి వేషభాషలు, ఆచార వ్యవహారములు, నాగరికత అన్నియు వేరుగానే యున్నవి. వీరి శౌర్యగాథలు ఒకొక్కకపరి రాజస్థానపు శౌర్యగాథలను గూడఁ దలఁదన్నుచున్నవి. గుజరాతీ సాహిత్యమున నీ శౌర్యగాథలు చాలావరకు సంగ్రహింపఁబడియున్నవి.

యాలో సర్వప్రథమ రాజ్యమును స్థాపించిన రాజవంశము. కిష్ వంశావళియందు ఇరీదు యొక్క ప్రథమరాజ్యవంశపు రాజులవిషయ మిట్లు చెప్పబడియున్నది:

౧. ఇరీద్యుపట్టణమున ఉక్కుసిరాజు వచ్చెను. అతడు ౩౦ సంవత్సరములు రాజ్యము చేసెను.

౨. బక్కుసు (శక్తిశాలిబాహువులు గలవాఁడు) ౪౨ సంవత్సరములు పాలించెను.

౩. 'పున-పున' ౭ వర్షములు పాలించెను.

౪. 'నక్షుఅనేన' ౩౭ వర్షములు పాలించెను.

ఇప్పు డీ రాజులపేర్లను భారతదేశపు సూర్యవంశపు రాజులపేర్లతో పోల్చి చూచెదముగాక.

| వంశావళి | ఆర్యవంశావళి |
|---|---|
| ౧... | వైవస్వతమనువు |
| ౨. ఉక్కుసి | ఇక్ష్వాకువు |
| ౩. బక్కుస్సు (నిమిసోదరుడు) | వికుక్షి (నిమిసోదరుడు) |
| ౪. పున-పున | పురంజయుడు |
| ౫. నక్షు అనేను | అనేనా - |

సుమేరులు, భారతీయులునగు నీరాజులొకరు గా దని తలంచెదరా? ఈ ఐక్యత ఈనలుగురు రాజులవరకే గాదు. పోలికఁ జూచుచుఁబోయినఁ జివరవరకు నీయైక్యత

---

౨. సుమేరు మూలభాషయందలి పదములు:

౧. ఇరీదు-కీ-ఆ-ఉక్కు సిలుగల-అమ్-౩౦ ము-ష్-అగ్ ౨. బక్కుసు దా-ఆమా ౪౨ ము-ష్-అగ్

౩. పున-పున ౭ ము-ష్-అగ్ ౪. నక్షుఅనేను ౩౭ ము-ష్-అగ్

౩. బక్కుసుసోదరుఁడు నిమి పేరు కిష్ వంశావళిలో వ్రాయబడలేదు. కాని ఇతరవంశావళులందు కనుపడుచున్నది. ఈ వంశావళులందు వీనిపేరు 'నిమి-రూదు' అని వ్రాయబడియున్నది. రూదు అన ఉన్నతికర్త. నిమి యను పేరు భారతీయ నిమిని పూర్తిగా పోలియున్నది. బైబిలులో 'నిమరోదు' అని వ్రాసియున్నది. అతఁడు 'కుశ'ని పుత్రుఁడు. 'ఉక్కుసి'లోని 'ఉ' పోయి బైబిలులో 'కుశుఁ' డయ్యెను. ఇటుల బైబిలునుండియు 'నిమి' ఉక్కుసికుమారుఁ డనియే తేలుచున్నది. బైబిలునందు నిమి సర్వప్రథమ నగరనిర్మాణకర్త యని వ్రాసియున్నది. అతని రాజ్యారంభము బాబిలను, ఎరిక్, అక్కడ్, కల్నాలనుండి జరిగెనని యున్నది. అది శినారుప్రాంతమున గలదు. ఇచ్చటనుండి అస్సురదేశమునకుఁ బోయెను. అచ్చట 'నినేవా' నగరమును నిర్మించెను. మఱియు 'రిహోబథకూ' యను పట్టణములనుగూడ నిర్మించెను. నినేవా-కూ నగరములమధ్య 'రసేను' నగరమును స్థాపించెను. అది చాల గొప్పనగరము. నేఁడును పశ్చిమ ఆసియాయందలి అనేకస్థానములు నిమిపేరుతో నున్నవి. బాబిలనునందలి మీనారు ఇప్పటికి 'బిర్సు నిమరూద'ని పిలువబడుచున్నది. బైబిలునందు దానినే స్వర్గమును పొందుటకు మనుష్యజాతి నిర్మించినదని వ్రాసియున్నది. దజలాతీరమున మోసలు సమీపమున నిప్పటికి ఒకనగరముపేరు 'నిమరూదు'. ఆర్మీనియాయందలి యొకపర్వతము నేఁడును నిమరూ దని పిలువఁబడుచున్నది. విష్ణుపురాణమున నిమిశరీరమును శుష్కముండునట్లు కొన్నిపదార్థములు చేర్చి భద్రపరచినారని యున్నది. దీనిచే నిమి ఈజిప్టుకుఁ బోయినా డనియు, అతఁ డచ్చటనే మరణించెననియు రూఢియగుచున్నది; ఏలయన రాజులశవములను శుష్కముండాచేసి కాపాడురీతి అచ్చటనే వ్యాప్తిలో నున్నది. వీనినే మమ్మీ (Mummy) లందురు.

కనుపడుచుండును. విస్తారభయమున నాచర్చయిట మానితిని. సుమేరు - భారతీయ వంశావళిలో ఒకపేరు మాత్రము వ్యవధానముగా నున్నది. అది ఎట్లన, సుమేరుప్రథమరాజు ఇక్ష్వాకువు. భారతీయ ప్రథమపాలకుఁ డతని తండ్రిమనువు. దీనివలనను సుమేరుప్రథమ రాజు ఇక్ష్వాకువు భారతపాలకుడగు మనువు పుత్రుఁడనియే తేలుచున్నది కావున నతఁడు భారతదేశమునుండియే మెసపుటోమియా చేరినాఁడు. అచ్చట ప్రథమపాలకుఁడైనాఁడు. ఈ ఇక్ష్వాకువే సింధురాష్ట్రసభ్యతలతో పాటు సువర్ణప్రజలను వెంటఁగొని ఉపనివేశము స్థాపించుటకు మెసపుటోమియా చేరినాఁడు.

### ప్రళయము-ఆర్యుల నౌకాశాస్త్రానభిజ్ఞత

ఇక్ష్వాకువు ఆర్యావర్తమంతకును రాజుగదా. అతఁడు కేవలము సురాష్ట్రవాసులగు సువర్ణులనుమాత్రమే వెంటఁగొని యేలమెసపుటోమియాఁ జేరెను ? రెండవది ఆర్యావర్తమునుండి బిలోచిస్తానము ఈ రానుల గుండా సుగమమగు భూమార్గ ముండఁగా (ఆకాలమున సింధు, బెలూచిస్తానము, దక్షిణ ఈరానులు నేఁటివలె పాడుపడిన యెడారులుగాలేవు. పైరుపంటలు కలిగి జనాకీర్ణములై గొప్పనగరములు కలవిగా నుండెను.) దానిని వదలి ఇక్ష్వాకువు సముద్రమార్గమున మెసపుటోమియా నేల చేరెను? దానికి జవాబు ఇట్లు కలదు. మొట్టమొదట సరస్వతీ తట ప్రాంతమున నార్యసభ్యత యుత్పన్నమైనది. ఈ ఆర్యులే తమప్రారంభికకృషిసభ్యతలను గైకొని బెలూచిస్తానము ఈరానులమార్గమున మెసపుటోమియావరకు నేగియుండిరి. వీరికి నౌకాశాస్త్రము తెలియకుండెను. వీరే మొట్టమొదట మెసపుటోమియాలో నివసించు ప్రోటో- ఇలామైటులు. (ప్రోటో-ఇలామైటు సభ్యతను సరస్వతీసభ్యత యని పిలువవచ్చును; ఎందుకన నది భారతదేశమున సరస్వతీతటమున నుత్పన్నమైనది.) ఫరాతు నదియందు ప్రళయమను భయంకరమైన వెల్లువ రాఁగా నౌకాశాస్త్రమునం దనభిజ్ఞులగుట వీరికి ధనమునకును జనమునకు దీరని హాని సంభవించెను. సుమేరు ప్రళయగాథయందు 'ఇయా' దేవుఁడు ప్రళయనాయకుఁడును, ప్రోటో-ఇలామైటు జాతినాయకుఁడునునగు ఉతాన పిష్తిమునకు ప్రళయము నుండి రక్షించుకొనుటకు నావనుచేయు రీతిని నేర్పుచున్నాఁడు. ప్రళయము వచ్చినపుడు స్వయముగా మత్స్యరూపమున నావను నడపుచున్నాడు. దీనిచే ప్రోటో- ఇలామైటుజాతికి నౌకాశాస్త్రము బొత్తిగా తెలియదని స్పష్టమగుచున్నది. మైదానములందును, ఉన్నత పార్వతీయ ప్రదేశములందును నివసించి రక్షణ గాంచినవారలు ఈ భయంకరవినాశమువలన వెఱఁగుపడి తిరిగి మాతృభూమియగు నార్యావర్తమునకు వచ్చివేసిరి. కావుననే ఈ యున్నత ప్రదేశములపై ప్రోటో ఇలామైటుల విధ్వంస నగరచిహ్నములు కానవచ్చుచున్నవి.

వీరు భారతదేశమునకు మరలి వచ్చుసరికి ఇచ్చట రాజసత్తాస్థాపింపఁబడి వైవస్వతమనువు రాజుగా నుండెను. ఈసమయమున శతపథ బ్రాహ్మణము రచింపబడుచుండెను. ఆర్యజాతియెడ మెసపుటోమియాయందుఁ గలిగిన ఘోరాపద అందు వర్ణింపఁబడియెను. ఈవిషయము మనువుకాలమునజరిగియుంటచే దానికి నాయకుఁడు మనువుగా వర్ణింపఁబడి

యుండును. శతపథబ్రాహ్మణమునందలి ప్రళయవర్ణనయం దెచ్చటను అయ్యది భారత దేశమున ఘటిల్లిన దనుటకుఁ దగిన భౌగోళికనామములు కానరావు. ఆ కాలమున భారతసీమ ఆసియామైనరు వరకు నేర్పడియుండెను. ఈ దృష్టిచే దానిని భారత విషయముగాఁ గూడఁ దలంపవచ్చును. కాని నేఁటి సంకుచితభారతవర్షములోనిది కాదు.

వైవస్వతమనువు ఆర్యజాతికి గొప్ప హితకారియగు రాజు. ఈ విషయము నిచ్చట వర్ణించుట వ్యర్థము. నౌకాశాస్త్రము తెలియనిచే నార్యులకు మెసపుటోమియాలో ప్రళయమువలన భయంకరమగు హాని సంభవించుటఁ జూచి తన్నివారణార్థము సింధుతో చేరియుండుటవలన ఆర్యావర్తాంతర్గతమగు సురాష్ట్రమును సాముద్రికకేంద్రముగా నేర్పరించెను. దానిచేత నార్యజాతికి నావికాశక్తి వికసించునని యుద్దేశము. తన పుత్రుడగు నిక్ష్వాకున కీమహత్తరకార్యము నప్పగించెను. జె. యఫ్. హెవిట్ అను విద్వాంసుఁడు, తన పుస్తకము 'ది రూలింగ్ రేసెస్ ఆఫ్ ప్రీ హిస్టారిక్ టైమ్సు' (వాల్యూం ౧, పు. ౪౦౪ లో) ఇట్లు వ్రాసి యున్నాఁడు.

"భారతీయకథల ననుసరించి ఇక్ష్వాకువు పాతాళమునకు రాజు. అయ్యది సువర్ణుల సింధునదీ ముఖద్వారమున నున్న రేవు. సోమయజ్ఞమును బ్రచారమునకుఁ దెచ్చినదియు నీతఁడే. పాతాళమునుండి యుత్తరభారతమంతటిమీఁదను నాతనియధికారము గలదు."

ఈ సువర్ణులు ఇక్ష్వాకుని యధీనమున నౌకావ్యాపారముకొరకు మనువుచే నప్పగింపఁబడిన యార్యులే. వీరి మతమునుండియే జైనమతము బయలుదేరెను. గుజరాత సురాష్ట్రదేశముల జైనవణిజులు వీరి వంశమువారే. ఆర్యజాతి నౌకావిద్యయం దారితేరిన పిదప, నిక్ష్వాకువు వారిని వెంటఁగొని సముద్రమార్గమున మెసపుటోమియాఁ జేరెను. అచ్చట సుమేరు సభ్యతాస్థాపకుఁడును ప్రథమరాజు నయ్యెను. అతని రాజధాని పాతాళ మనురేవు. (ఈ పాతాళము ద్రావిడ రాక్షసుల సభ్యతకును, నాగపూజకును కేంద్రమగు పాతాళద్వీపము కాదు.) సింధునది ఆ కాలమున సురాష్ట్రమువరకుఁ బ్రవహించుచుండెను. దాని ముఖద్వారము ననే పాతాళముండుటవలన దాని ఉనికి సురాష్ట్రమునం దనియే యేర్పడుచున్నది. మెగాస్థనీజు పాతాళమును సింధు ముఖద్వారమున Orostrae (సురాష్ట్ర)యం దని తెలిపినాఁడు.

సూర్యవంశపు రాజులకాలము

భారతీయ సుమేరురాజ వంశములు ఒకటియే యని నిర్ణయించుకున్నమీఁద భారతచరిత్రమునం దొక గొప్ప సమస్య విడిపోవుచున్నది. అది ఇచ్చటి రాజవంశముల కాలనిర్ణయము. భారతసాహిత్యమును, వంశావళులును ఈ విషయమున మూకలుగా నున్నవి. కాని సుమేరువంశావళియందు వీరి రాజ్యకాలము గూడ దొరకుచున్నది. క్రింది సుమేరు వంశావళి యవతరణికవలన ఈ విషయము స్పష్టమగును. రెండు దేశముల వంశావళిని సరిపోల్చి భారతరాజులయందు వైవస్వతమనువు మొదలు చంద్రగుప్త

హార్యునివరకుఁగల రాజుల కాలము ఏర్పరుపఁబడినది. దాని ననుసరించి కొందరు ప్రసిద్ధరాజుల కాల మీవిధమున నున్నది.

| భారతీయ నామము | సుమేరు నామము. | రాజ్యకాలము క్రీ. పూ. సంవత్సరములలో |
|---|---|---|
| వైవస్వత మనువు | .... | ౩౪౮౦—౩౪౦౩ |
| ఇక్ష్వాకువు | ఉక్కుసి | ౩౪౦౩—౩౩౫౩ |
| వికుక్షి | బక్కుసు | ౩౩౫౩—౩౩౦౩ |
| నిమి | నిమిరా | ౩౩౦౩—౩౨౫౨ |
| మాంధాత | మేదీ | ౩౦౯౭—౩౦౬౧ |
| హరిశ్చంద్ర | ఉజీవిశార | ౨౮౯౧—౨౮౭౪ |
| సగర | సగర (శర్గన) | ౨౭౩౦—౨౬౬౭ |
| డిలీప | దలీప | ౨౫౯౪—౨౫౭౦ |
| సుదాస | సుద్దా | ౨౪౨౮—౨౪౦౪ |
| రఘు | దఘు | ౨౧౯౭—౨౧౫౬ |
| దశరథ | దఃఇదుశి యూష | ౨౧౪౫—౨౧౧౭ |
| రామచంద్ర | రామసిన (సిన=చంద్ర) | ౨౧౧౭—౨౦౯౬ |

కొన్ని ప్రసిద్ధవిషయముల కాల మిట్లు గలదు.

ప్రళయము-క్రీ. పూ. ౩౪౭౫

ఇక్ష్వాకువు సువర్ణులను వెంటఁగొని మెసపొటేమియా చేరుటయును, సుమేరు చరిత్రప్రారంభము—క్రీ. పూ. ౩౩౮౩.

| | |
|---|---|
| ఈజిప్టునందు నాగరికతయును రాజసత్తాప్రారంభమును | ౨౭౧౨ |
| చంద్రవంశప్రారంభము | ౨౫౩౦–౨౫౧౩ |
| దాశరాజయుద్ధము | ౨౪౨౫ |
| రామ రావణయుద్ధము | ౨౧౦౩ 2103 B.C. |
| మహాభారతయుద్ధము[4] | ౧౪౨౫ 1425 B.C. |

## భూగర్భశాస్త్రమువలన ఇక్ష్వాకు కాలనిర్ణయము

ఇక్ష్వాకు క్రీ. పూ. ౩౩౮౩ లో మెసపొటేమియా చేరెను. అతఁడు ఇరీదు రేవునందుఁ దన రాజధానిని స్థాపించెను. భూగర్భశాస్త్రము ప్రమాణముగా నదియే రూఢమగుచున్నది. ఇక్ష్వాకువు కాలమున ఇరీదు సముద్రతటమున నుండెను. కాని నేడు సముద్రము దానినుండి ౧౫౦ మైళ్లు దక్షిణముగా తొలగిపోయియున్నది. సర్ హెన్రీ రాలిన్సను లెక్కవేసి ఈరానీ సముద్ర జలము ౩౫ వర్షముల కొకమైలు చొప్పున ఎండిపోవు చున్నదని చూపియున్నాడు. ఈ లెక్కన ౧౫౦ × ౩౫ = ౫౨౫౦, అనగా సాధారణముగా ౫౩౦౦ వర్షముల వరకు, అనగా, క్రీ. పూ. ౩౩౬౪ వరకు ఇరీదు సముద్రతీరముననే యుండెనని స్పష్టమగుచున్నది. ఈ కాలము ఇక్ష్వాకువు ఇరీదునందు రాజ్యమును స్థాపించిన కాలము ౩౩౮౩ కు సరిపోవుచున్నది.

ఈ ప్రకారము ప్రపంచమునఁ బ్రాచీనతమమును సర్వశ్రేష్ఠమును అగు సుమేరు సభ్యత భారతదేశపుత్రికయనియు, భారతీయ సురాష్ట్రప్రదేశమునుండియే అచ్చటఁ జేరి పుష్పించి ఫలించిన దనియు స్పష్టపడుచున్నది.

(హిందీకనువాదము)

4. మహాభారతయుద్ధకాలమును తిథివారమాసగ్రహగణిత ప్రమాణముల ననుసరించి పైనిర్ణయము చేయుచున్నారు. కృష్ణాపత్రిక-జనవరి ౧౯౩౭ మూడవవారము పేపరు చూడుఁడు.

# ఒకకథ

"భార్గవ"

వెనక నొకప్పుడు-
మిత్రుం డొక్కడు
మక్కువతో నొక
చక్కని మొక్కను
చిన్న బహుమతి
చేశాడు:

అది నా పెరడున
అటు పడియున్నది;
కాని, లోకమున
గల తక్కిన మొ
క్కల వలె పెరుగదు-
గతింప!

ఆవైపు తిరిగి
నపుడెల్ల-అటులె-
చిట్టి చూపుతో,
చిన్న నవ్వుతో,
స్నేహంగా చూ
స్తుంది:

ముదరని కొమ్మల
నెదుగని మొగ్గలు..
అవి వలపించవు,
అవి వికసించవు,-
చిట్టిచూపుతో,
చిన్ననవ్వుతో.

మిత్రుని తలతును,
మొక్కను చూతును;
మొక్కను చూతును:
మిత్రుని తలతును-
చిట్టిచూపుతో,
చిన్న నవ్వుతో.

# గోరీలతోఁట

వాగ్రూల్,
‘మధుపాళి’

[ఆకాశంమీద రెండు మూడుముక్కలు సుద్ది వెన్నెల కురుస్తున్నాయి. గోరీలతోఁటలో గజం గజం దూరంలో వేయబడ్డ సరుగుడుచెట్లూ, వాటినడుమ గోరీలూ ‘సిలుకెట్టు’ (silhouette)గా కనబడుతుంటాయి. దూరాన గాలియీలయేమో, ‘ఆర్గను’పైని ‘పా-గా-పా’ అనేస్వరాలు విడివిడిగా విరామంతో వాసుకున్నట్టు వినిపిస్తుంది.

ఎడమవైపే ఉన్న ఒక గోరీలోనుంచి వెలుగు వచ్చి, ఆవెలుగులో ఒకపురుషుని స్వరూపం బయలు పడుతుంది. అతను కళాజీవికిమల్లే రేగిన జుట్టుతో, చక్కగా – ముడతలు కనబడేటట్లు – కప్పుకున్న శాలువతో, పద్యం వ్రాయబోయే కవిలాగ, శూన్యాకాశంలో అరమోడ్పుకన్నులతో చూస్తూ, తల కొద్దిగా కదుపుతూ పాడుతూంటాడు.]

అతను:—

ప్రియా! మృదులచేలాంచలములు
ఒయారముగ ఆడగ పాడగ
అభాగ్యునికి దరిసెనమీయవో,
విభావరీవిశుద్ధవేళను!

[గోరీలో వెలుగు క్రమంగా తగ్గుతూంటే అతని మానవాకృతి మెల్లిగా యవనికలాగ జారిపోతుంది చీకటి వెలుగులో అతని యెముకలగూడు గోరీలోనుంచి సగం లేచి, సగం పడుకుని ఉంటుంది.

ఇంతలో పక్కనేఉండే మరొకగోరీలో వెలుగు తోటికూడా ఒకసుందరీస్వరూపం మజ్లినుదుస్తుల్లో చందమామలా మెరుస్తూ లేస్తుంది.]

ఆమె:—

ఇదేమిటి! నే నిక్కడికి ఎలాగ వచ్చాను! ఎంత ఏకాంతంగా నిశ్శబ్దంగా ఉందీ ఇక్కడ! విచిత్రం! ...ఈయేకాంతస్థలం, ఆమిణుక్కుమిణుక్కుమనే నక్షత్ర కాంతీ, ఈ చంద్రకాంతప్రతిన్నీ, ఆసరుగుడుచెట్ల సంగీతం, ఈనాసౌందర్యమూ ఇవన్నీ తరించేటట్లు నన్ను ప్రేమించి, ప్రణయగీతిక లాలపించే నాప్రేమిక కవి కుమారచక్రవర్తి ఉంటే! నాసమ్ముఖంవద్ద పడిగాపులు పడిఉండే ఆప్రణయజీవుల్లో ఒక్కడూ కనబడడే మిప్పుడు! ఒంటరిగా నే నెందు కిక్కడ!

[అని చుట్టూ పరకాయిస్తూంటే, ఆమెగోరీలోని వెలుగూ మానవాకృతీకూడా మెల్లిగా దిగజారిపోతాయి. ఆమె యింకా తనరెముకలగూటి సౌందర్యాన్ని అసుద్ది వెల్తురులో ప్రశంసాదృష్టితో చూసుకుంటూ, సగర్వంగా నలువైపులా దృష్టి సారిస్తుంటే అతనిచ్ఛాయ పొడ కట్టుకుంది.]

ఆమె:—ఎవరదీ నీడలాగ! ఎవరు వారు!

అతను:—(తలవంచుకునే, చకితుడై, గుండెలు త్రవ్వేటట్టు చూసుకుంటూ) ఆఁ? ప్రేయసీ! నాలో మిగిలి పిలుస్తున్నావా! నాహృదయమా! నన్నెరగవా? నువ్వతిప్రియంగా పిలుచుకునే కవికుమారుణ్ణి! బ్రతుకు చితికినవాణ్ణి!

ఆమె:—ఆఁ? ఆఁ? ఎవరు! ఈస్థలం?

కవి:—[తలయెత్తి, ఆకులకురులు విరబోసుకొన్న చెట్లనీ, క్రింద నీడల్లోని గోరీలనీ చూస్తాడు.] ఈస్థలం? ఆహా! నాప్రేయసి నాకు కడసారి దర్శనమిచ్చి, శాశ్వతంగా విశ్రమించిన పవిత్రమైన గోరీలతోఁటలాగుంది.

ఆమె:—ప్రేయసా?......ఇక్కడేమి చేస్తావు నువ్వు?

కవి:—ఆఁ...! ఏమి చేస్తాను? (గద్గదికతో) పగిలిన నాహృదయశకలాలు అతుకుకొనేదాకా ప్రియురాల్ని గురించి యేడుస్తాను.

ఆమె:—ఇహ! నీకు ప్రియురాలా? ఎలాటిదామె......నీకు!

కవి:—ఆమె...... (తల ఆకసంవైపె త్తి) ఆమె, దేవలోక దేవీమూర్తి, పవిత్రాదర్శశీల! నా కోసం మర్త్యలోకాన అవతరించినపారిజాతం! నాలాటి అనేకమంది కవికుమారులా, కళాపిపాసువులా హృదయకాసారాల వికసిసి, మాధురులు చిమ్మినపద్మంకూడ!

ఆమె:—ఆఁ? ఎవరు! ఎవరిమాట లివి? (పొక్కిళ్లు లేని పలువరుసలు వికారంగా కదుల్తాయి.) ఎక్కడివి మాటలు? కవికుమారుడివా నువ్వు! కళాపిపాసివా? నీకు ప్రేయసికూడానా? చాలు చాలులే. (పొడుగైన సన్నని ఎముకవేళ్లని పళ్లకి అడ్డుపెట్టుకుని, ఆపుకుంటూ ఆపుకుంటూ వికటహాసం చేస్తుంది. తనకిమట్టుకు చాలా నాజూకుగా నవ్వినట్టు, తృప్తిగా, కొంత సౌందర్యవతియైన స్త్రీ భంగిమంలో కూర్చుంటుంది.)

కవి:—(సహించలేక, ఒక్కపెట్టున పైకి ఊగి కట్టెలాటి చేతుల్ని ఆమెవైపు విసుర్తూ,) ఎవరు నా ఏకాంతాన్ని భగ్నంచేశారు! ఎటకారమా? ఏమిటా వెకిలి నవ్వు? అధర మేదీ? మల్లెపూలా, సున్నపురాలా? ఆఁ? ఆ స్వరూపం—అదేమిటి—అస్థి—కంకాళం! (పళ్లు కొరుకుతూ) ఎవరు నువ్వు పిశాచీ! స్వతంత్ర కవిలోక సామ్రాట్టుని, నిరంతరప్రేయసీపాద పద్మానుచారణ సార్వభౌముని, నన్ను హేళనచేస్తున్నావా?......... ఇది యేదో దుస్స్వప్నంలాగ ఉంది....... పిశాచీ నువ్వు,—నువ్వు పిశాచివే. అదుగో, అదుగో ఆసమాధే నా ప్రేయసిది! పవిత్రదేవీమూర్తిది! ఏమి టీఘోరం! ఛే! అక్కడనుంచి లే! నాప్రేయసి పూతాత్మకి ప్రశాంతత లేకుండా నువ్వు ఆస్థలాన్ని మైలపరుస్తున్నావా? లే! లే! (అంటూ తన గోరీపైని మోకాళ్లమీద లేచి, మంచుని చేత్తో అదమాయిస్తున్నాడు.)

ఆమె:—ఇదేదో చెడుకలమాదిర్ని ఉంది. ఈమాటలు, ఎక్కడిమాటలో! విన్నమాట లల్లే ఉన్నాయే. (నిర్జీవాలైన కళ్లని మలుముకుంటుంది) ——ఛీ! అతను ఎప్పటికీ కాడు. ఛీ! ఛీ! నువ్వు నువ్వే,—పిశాచానివే! అతను కాదు నువ్వు! కవిలోకసమ్రాట్టువు కాదు నువ్వు! అతని మాటల్ని, చేష్టల్ని అనుకరించినా అతనివి కాలేవు. నన్ను మోసపుచ్చకు.——— ఇది స్మశానంట! ఔను! ఎలాగ వచ్చానో ఈ పిశాచాలతోటకి! నాకు త్వరగా మెలకువరావాలి. ఈ పిశాచం అతనిమాటల్ని అనుకరిస్తుంటే సహించలేను.

కవి:—నువ్వెవరు! నువ్వు......ఢాకినివా?

ఆమె:—(ఉక్రోషంతో ఊగిపోయి, మూలిగి) అబ్బ! ఇంతవరకూ మానవు డెవడూ నన్నలా పిలవలేదు. నువ్వు పిశాచానివే కావాలి. ఎందరు కళాశీవుల హృదయసరోవరాల్లోనో పాతుకుపోయిన పద్మానివో అని నా 'సమ్రాట్టు' నన్నంటూంటాడు! నాసమ్రాట్టు! ఇంకా ఎందరో కవికుమారులు నా అనూన సౌందర్యం గురించి ప్రణయగీతులు పాడుతూ నావాకిట పడి ఉంటారు (కవి వెటకారంగా, వికారంగా ఊసుతాడు.) —నేను కవిలోకసమ్రాట్టుకి హృదయాధిరాజ్ఞిని! (కవి ఒడలంతా నవ్వు పొంగివస్తున్నట్టు ఆడిపోతాడు.)— అటువంటి నన్ను, ఈవేళ, నువ్వు—దుష్టపిశాచమైన నువ్వు, నన్ను పిశాచమని తృణీకరించి మాయచేస్తావా? నీమాయల్లో నేను పడతానా! (కవి విరగబడి నవ్వుతున్నాడు.) టక్కరిభూతమా! పో! కథల్లో రాకొమార్తెల్ని ఎత్తుకుపోయిన భూతానివా నువ్వు! అయ్యో! నన్నుగురించి, అన్నిపాటలు పాడిన ఒక్కడూ రాడేం తోడుగా!

కవి:—(విరగబడి విరగబడి, పెద్దవికటాట్టహాసం చేసి) తమాషా! ఆఁ—? నామీదకే ఎదురు తిరిగేవూ! కామినీదయ్యానివిలా గున్నావే నువ్వు! నువ్వు లోకైక సుందరివి కదూ! హహ్హహ్హా! శభాష్! త్రిలోకైక సుందరీ! ఏ దేశపు రాకొమార్తెవే నువ్వు? (ఆమె ఉడుకుబోతుతనంతో తానున్న గోరీపై తన్ని పరవళ్లు తొక్కుతుంది.) (కవి అభిమానంతో — అరుస్తూ) ఓడాకినీ, ఇదుగో, నాప్రియురాలి పవిత్రసమాధినుంచి కదుల్తావా? ఆసరుగుడుకొమ్మ విరగగొట్టనా? (అని ఎగిరి తూలుతూ, ఆమెగోరీవేపు వెడతాడు.)

ఆమె:—ఓపిశాచమా! నామీద పడకు! (అని బెదురుతూ పరుగెత్తి అతనిగోరీవేపు వెడుతుంది.) అయ్యో! అత నింతట్లో వచ్చేస్తే ఎంత బాగుండును! ఓకవిలోకసమ్రాట్టూ! నాప్రణయసామ్రాజ్య సార్వభౌమా! ఎక్కడున్నావు! రావేం?

[సరికొత్తగా ఉన్న ఆకవిగోరీమీది పాలరాతి స్వస్తిఫలకం (Epitaph) తళుక్కుమని ఆమెకళ్లని ఆకర్షించింది.—

కవి ఆమెగోరీమీద అత్యాప్యాయంగా ప్రాకులాడుతూ, ఏదో గొణుక్కుంటూ శవముఖాన్ని అక్కడక్కడ అద్దుకున్నాడు--

ఆమె అతనిగోరీమీది స్వస్తిని చదువుతూంది.]

"స్వతంత్రకవిలోకసమ్రాట్టూ, నిరంతరప్రణయైకజీవీ ఐన మహాకవి ......................... ఆత్మశాంతికై —" (బరువేదో తనపైని కూలినట్లుగా క్రిందికి క్రుంగిపోయి, మూర్ఛపోబోతుంది — మూర్ఛరాదు — చతికలబడి, మోకాళ్లవడుమ తలని నలుపుతూంటుంది.)

[రెండు నిమిషాల నిశ్శబ్దం, ఒకబరువైనగాలికెరటం చెట్లసందునుంచి ఒడుదుడుగ్గా వచ్చి, విషమస్రుకుల మేళనంతో ఆవేదనా అనోమయతా సూచిస్తున్న ఒక ఆరోహణస్వరం పాడేసి చక్కాపోతుంది. క్రింద మోకాళ్లమీద నుంచుని, ఒకరిగోరీని ఒకరు తల ఆనుకుని వెక్కివెక్కి ఆవేదనగా ఏడుస్తుంటారు. కొన్ని క్షణా లయ్యాక—]

కవి:—(ఎడమ అరచేయి ముడిచి, కళ్లు నలుముతూ, కుడిచేతి మాపుడువేలితో శాసిస్తూ) ఓశాకినీ, నన్ను వెక్కిరిస్తున్నావా, జాగ్రత!

ఆమె:—(రెండు అరచేతులూ చాపి కళ్లు నలుముతూ —వస్తుత్తికతో) టక్కరిభూతిగా! నువ్వే నన్ను వెక్కిరిస్తూ పైగా న న్నంటావా? (అని మళ్లీ ఏడుస్తూంటుంది.)

కవి:—అయితే నువ్వెందుకోస మలా రోదుస్తావు?

ఆమె:—నా ప్రాణంకోసం! నాజీవాధారం నాసమ్రాట్టుకోసం! అత నిలా నన్ను వంచించి చెప్పకుండా చక్కాపోతా డనుకోలేదు.

కవి:—ఓ, ఓ, అల్లుకో! కామినీ! కథ లల్లుకో! నీమాయకథలు నమ్మే వెఱ్ఱికుట్టినిగాను! హేహేహే! ఎవడే వెలీ! ని న్నట్లు వంచించిపోయిన రాజకుమారుడు?

ఆమె:—పాడుదయ్యమా! (అక్కణ్ణుంచి లేచి, అతనికి దూరంగా ఎడమవైపు చెట్లల్లో కూర్చుని, మోకాళ్లపైని తలపెట్టుక ఏడుస్తూంటుంది.) నాకవీ, నాప్రాణం ఎక్కడున్నావు! నిజంగానే నిర్గమించావా? నాకు చరణైకచారుణ్ణని చెప్పతూ ఎన్నిగీతులు పాడేవో! ఒక్కటీ వినిపించలేవు! ఈపాడుదయ్యం, — ఇది — నిజమేనా? కలా? నువ్విక లేవూ? కలా?... మెలకువ రాదేం? కవీ! కవీ! కవీ! (తొందరగా వచ్చి, కవిగోరీదగ్గర కూలిపోయి, స్వస్తిఫలకాన్ని తడిమి తడిమి) కవీ! కవీ! కవీ!

కవి:—(ఆమె దూరంగా పోయిం దని మళ్లీ ప్రేయసిగోరీవద్ద తిష్టవేసి, ఆమె రాగానే, గంగవెఱ్ఱులెత్తినట్టు అసహ్యం పట్టలేక, తూలుతూ కుడివైపున్న చెట్లలో ఒకచెట్టుకి చేరగిలబడి పైకి చూస్తూంటాడు.) ఈపాడుక లేమిటోయి ప్రేయసీ! నిన్నుగురించి ప్రశాంతంగా తలపోసుకుందా మనుకుంటే, ఈకామినీపిశాచం నిన్ననుకరిస్తూ నామతి పోగొట్టుతూంది. ప్రేయసీ! ప్రేయసీ! దివ్యమూర్తీ! నా అంతరాంతర శాంతిదేవతా! మాధురులు కూడుగట్టిన మధుకలశమా! ప్రియా! ప్రియా!

ఆమె:—కవీ! కవీ! కవీ! ఎక్కడ! ఎక్కడ!

కవి:—ప్రియా! ప్రియా! ఎక్కడ! ఎక్కడ!

ఇద్దరూ:—(లేచి నుంచుని ఒకరినొకరు చూసుకుని) ఛీ! ఛీ! ఛీ!

[సరుగుడుచెట్ల వెనకదిక్కున చీకట్లు పల్చబడుతున్నాయి. ఆకాశంమీది రెండుమూడుచుక్కలూ క్రమంగా పాలిపోతున్నాయి. చెట్లతోపులోనుంచి పందడిగా ఐదారుకంకాళాలు బయటపడి, వాళ్లిద్దరినీ చుట్టుముట్టుతాయి. వాళ్లు కంగారుగా గంతులువేస్తారు.]

ఇద్దరూ:—(భయంగాచేతు లడ్డంపెట్టుకుంటూ) కంకాళాలు! పిశాచాలు! (కేక లేస్తారు.)

[పిశాచాలు వాళ్లచుట్టు మూగి విరగబడి, వికటాట్టహాసాలు చేస్తున్నాయి.]

ఒకవంగిన ముసలిపిశాచం:— (హేళనగా) ఏహేహే! సిగ్గు సిగ్గు! మీరో! మీరూ కంకాళాలేగా! మీరూ పిశాచాలేగా!

ఆమె:— ఆఁ! నేను కంకాళాన్నా? నేను త్రిలోకసుందరిని. ఇదుగో పిశాచం! అచ్చంగా మీ అందర లాగే......

కవి:— ఛీ! ఛీ! నేను పిశాచాన్ని కాను! కవిలోకసామ్రాట్టును! ఇది ముమ్మూర్తులా కామినీపిశాచం! వాలకంలోకూడా దానికీ మీకూ భేదాలేదు.

[పిశాచాలు ఎముకచేతులు చరుస్తూ వికారంగా ఎగురుతో పళ్లుకదుపుతో పెద్దకేకలతో గేలిచేస్తాయి.]

వంగిన:— ఏహేహే! వెఱ్ఱితండ్రీ! నీ ప్రేయసి నెరగవా? వెఱ్ఱితల్లీ! ఇతనే నీకవిలోకసామ్రాట్టు.

కవి:— ఈమా?

ఆమె:— ఇతనా?

[ఇద్దరూ అసహ్యంతో ఒకరి నొకరు ఓరగా చూసుకుని, "కాదు", "కాదు" అని గర్జించుతారు.]

వంగిన:— వెఱ్ఱినాయనలారా! ఎవరిపెంగాలు వారు చూసుకోండి. మనమంతా కంకాళాలమే. ఇందులో కొద్దీ గొప్పా, అందమూ, వికారమూలాటి భేదాలు లేవు. అంతా సమం. మనకి ఒక్కొక్కరికి ఒక్కొక్క గోరీ ఉంది. నీగోరీ అదుగో నాయనా! నీగోరీ ఇది పిల్లా! వాటిమీది అక్షరాలు చదివి, మీది పాలరాతిపలకల్లో ఎవరిపెంగాలు వారు చూసుకోండి.

ఆమె:— (స్వస్తిని చదువుతూ) "......త్రిలోకసుందరీ, కళాపిపాసువూ ఐన హృదయేశ్వరి ఆత్మ..." (తనప్రతిబింబం చూసుకుంటూ) ఇది గోరీ! నాగోరీ..? ఈస్వస్తి......అంకితం నాకే! ఆనేను నేనా! ఈనేను ......కంకాళమే?

కవి:— (తిరిగి తిరిగి స్వస్తిని చదువుతూ)...... "స్వతంత్రకవిలోక సమ్రాట్టూ......మహాకవి...ఆత్మశాంతి......" ఛేఛే (ప్రతిబింబం చూసుకుంటూ) ఈ రూపం? ఆస్వస్తి......బిరుదాలు నావే! నాకు గోరీయే! నేను కంకాళాన్నా? ఇంత! అంతా కంకాళాన్నే! (అని ఆశ్చర్యంగా అసహ్యంగా ఆపాదమస్తకమూ చూసుకుంటూంటాడు.)

[ఆమె పట్టరానిసిగ్గు అభినయిస్తూ, ఒళ్లంతా ముడుచుకుని, తలవంచి, పక్కగా పోబోతుంది.— పిశాచాలన్నీ నవ్వుతాయి]

వంగిన:— వెఱ్ఱితల్లీ! కంకాళ మని తెలుసుకున్నాక సిగ్గూసిగ్గూ పడనక్కర్లేదు, అలా పడితే వెక్కిరింపుగా ఉంటుంది.

కవి:— (ఆమెకేసి పరీక్షగా చూసి) ఈమె... మొదట అతిలోకమోహినీమూర్తిగా, న న్నాకర్షించి, ప్రేమింపజేసుకుంది. అయితే, ఇప్పుడూ ఈనగ్న సౌందర్యం...ఈకంకాళసౌందర్యం... నాఆదర్శం...

వంగిన:— (నడుమలో అడ్డి,) వెఱ్ఱివాడా! అది నీభావసౌందర్యమే; అప్పుడూ ఉంది. ఇప్పుడూ ఉంది. అది ఇప్పుడూ కంకాళఘటితమే, అప్పుడూ కంకాళఘటితమే అని కూడా తెలిసికో.

కవి:— (తన ప్రతిబింబాన్నీ, ఆమెరూపాన్నీ పరీక్షగా చూసి, చూసి)- ఓహో, ప్రేయసీ!—

ఆమె:— ఓహో, ప్రియతమా! (ఇద్దరూ వికటంగా నవ్వుకుంటారు.)

కవి:— అయితే, ప్రేయసీ, అపూర్వమైన నీ విరూపం నాకు మొదట అసహ్యం కల్గించినా, ఇప్పుడు దాని అంతరార్థం తెలుసుకున్నాను గనుక వెనకటిపాటొక టిప్పుడు సార్థకంగా పాడతాను:

"ప్రేయసిసోయగమ్మునకు లేదు శరీరము,
లేదు మేను నా తీయని ప్రేమకేని, కలదే
యెడబాటిక మాకు—"

ఆమె:— అప్పుడూ ఇప్పుడూ, ఎప్పుడూకూడా నీరూపంకంటే, నీవాక్చమత్కృతీ, భావలోకసంచారమూ, ఆదర్శోపాసనమూ న న్నాకర్షిస్తున్నాయి కవీ! అంచేత వెనకటికవి చెప్పినట్టు నా కిప్పుడు:

"మోమున మోము జేర్చి నిను
ముద్దిడు కోరిక లేదు"

వంగిన:—స్నేహితులారా! మనవెఱ్ఱితల్లీ, వెఱ్ఱితండ్రీ, ఇవ్వేళ తమని తాము తెలుసుకుని ధన్యులయ్యారు. మనము నిశాచరులం! అదుగో, పొద్దువెల్తురు వచ్చేస్తోంది. మనవెఱ్ఱినాయనలకి స్వస్తి పాడేసి, ఎవరిచోటికి వారు పోదాం.

స్వాగతము! సుస్వాగతము!
మా వెఱ్ఱితల్లికి! వెఱ్ఱితండ్రికి!
స్వాగతము! సుస్వాగతమోయ్!!
వెఱ్ఱితల్లి త్రిలోకసుందరి!
వెఱ్ఱితల్లి కళాపిపాసువు!
వెఱ్ఱితండ్రి స్వతంత్రకవిరాట్!
ప్రేయసీచరణైక చారుడు!
వెఱ్ఱితల్లికి! వెఱ్ఱితండ్రికి!
స్వాగతము! సుస్వాగతమోయ్!!

[పిశాచాలు గోరీల్లో అంతర్థాన మవుతూంటే పాట క్రమంగా కరిగిపోగా, ఉషఃకాంతు లాకాశం పైకి వచ్చేస్తాయి. తెల్లవారుతుంది; తెరవాలుతుంది*.]

[* కావలసినవారికి కుదూపణలు! హక్కులన్నీ వ్యాసకర్తవి!]



# యుద్ధము : ధరలు

శ్రీ సి. వి. దీక్షితులు

వేసవికాలములో వడగాడ్పు ప్రారంభించగానే ధర్మామీటరులో పాదరసము పైకి లేచినట్లు యుద్ధము ప్రారంభమైనదన్న వార్త రాగానే మనదేశములో ప్రతివస్తువు ధరయున్ను చఱ్ఱున పైకి లేచినది; కొన్ని వస్తువుల ధరలు ఇంకను పైచూపు చూచుచున్నవి. వార్తాపత్రికలు చదువుచున్న వారికి యుద్ధప్రారంభము వానివలన తెలిసియుండవచ్చును గాని, జనబాహుళ్యమునకు మాత్రము యుద్ధారంభము ధరలు హెచ్చుటవలననే వెల్లడియైన దని చెప్పవచ్చును.

ఎక్కడనో కొన్ని వేలమైళ్ల దూరముననున్న యూరపుఖండములో యుద్ధము ప్రారంభము కాగానే మనదేశమున ధరలు హెచ్చుట సాధారణదృష్టికి అసంబద్ధముగా కనపడవచ్చును. యుద్ధమునకును మనదేశమున వస్తువుల ధరలకును గల సంబంధమెట్టిదో పరిశీలించుటవలన కొంత ప్రయోజన ముండకపోదు. అందువలన ఈధరలు యుద్ధము ముగియువరకును పెరుగుచుండునో లేక వానిహెచ్చుదల కొన్ని వస్తువుల విషయములోనైనను కేవలము తాత్కాలికమైనదో తెలియగలదు.

హిందూ దేశమునకు యుద్ధముతో ప్రత్యక్ష సంబంధము లేకపోయినను ఏనాడు బ్రిటను జర్మనీదేశముతో తలపడి యుద్ధరంగమున దురికినదో ఆనాడే మనకును యుద్ధముతో కొంత సంబంధ మేర్పడినది. ఈ యుద్ధముయొక్క ఫలితములను పరోక్షముగానైనను మనము కొంతవరకు అనుభవింపవలసి వచ్చును కాని ఆకారణము వలన ప్రతివస్తువుధరయు హెచ్చితీరు నని చెప్ప వీలు కాదు; కొన్నిటి ధరలు హెచ్చవచ్చును; కొన్నిటి ధరలు మందగించవచ్చును. ఈవిషయమును పరిశీలించుటలో ౧౯౧౪-వ సంవత్సరమున ప్రారంభమయి నాలుగు సంవత్సరముల కాలము చెలరేగిన గత మహాసంగ్రామమునాటి సందర్భములు మనకు కొంత తోడ్పడగలవు. అప్పుడు ధరలలో కలిగిన మార్పులను పరిశీలించినట్లయితే యుద్ధమునకును ధరలకును గల సంబంధము స్పష్టమగును.

అయితే, వెనుకటి యుద్ధసందర్భములతో ఈనాటిపరిస్థితులను పోల్చి చూచుటకు ముందు ఒక విషయము గమనించవలసియున్నది. గతయుద్ధమునకు పూర్వము సైనికులకుతప్ప జనసామాన్యమునకు యుద్ధముతో నంత ఎక్కువ సంబంధ ముండెడిది కాదు; ఇరుపక్షములలోను కేవలము సైన్యములు మాత్రమే యుద్ధమునందు పాల్గొనెడివి. కాని ౧౯౧౪-వ సంవత్సరపు యుద్ధమున రెండు నూతనాంశములు ప్రాముఖ్యమునకు వచ్చినవి. అందొకటి విమాన యుద్ధము; రెండవది శత్రుపక్షమును ఆయుధబలమున గాక ఆర్థికములైన చిక్కులకు లోనుజేసి లొంగదీయుట. గత యుద్ధమునందే మొదటి

సారి విమానములు విరివిగా వాడుకలోనికి వచ్చినవి. విమానయుద్ధమున సైనికులకంటె జనసామాన్యమునకే కష్టనష్టము లెక్కువగా నుండును. విమానములవలన సాయుధులకంటె నిరాయుధులకే యుద్ధము ఎక్కువ దగ్గరకు వచ్చిన దని చెప్పవచ్చును. ఈకారణమువలన ఏదైన నొకదేశముపై విమానములదాడి జయప్రదముగా జరిగినయెడల ఆదేశము అతిత్వరితముగా ఆర్థికదురవస్థకు లోనుగావచ్చును. గత యుద్ధమున జర్మనీ దేశము ఆయుధబలముచే గాక ఆర్థికపు చిక్కులవలననే లొంగదీయబడినది. పూర్వకాలమున ఏదైనను ఒక గొప్పకోటను పట్టుకొనవలసివచ్చినప్పుడు అది దుర్భేద్యమైనచో శత్రుపక్షమువారు దానిని ముట్టడించి, లోనున్నవారు లొంగువరకును, వారికి సహాయముగాని ఆహారపదార్థములు గాని చేరకుండజేసి వేచియుండెడివారట. ఇప్పుడు కూడ యుద్ధములో ఈపద్ధతియే తుదినిర్ణయమునకు కారణభూతము కావచ్చును. అందువలననే ఈయుద్ధము రాకపూర్వము యూరపులో ముఖ్యదేశములన్నియు యుద్ధసమయమున తమ కవసరమగు ఆహార పదార్థములను సాధనసామగ్రిని జాగ్రత్త పెట్టుకొనుటకు విశ్వప్రయత్నములు చేసియున్నారు. అందువలన కొన్ని సరకులకు యుద్ధకాలమున మన మనుకొనునంత అవసర ముండకపోవచ్చును; రెండవది శత్రుపక్షములకు అవసర మగు పదార్థములు చేరనీయకుండుటకు గాను తటస్థ దేశములతో వ్యాపారము సహితము ఎక్కువగా నిరోధింపబడవచ్చును.

పై విషయములకు తోడు ఈ మధ్య ప్రపంచములోనున్న ముఖ్యదేశముల ఆర్థిక పరిస్థితు లన్నియు ఒండొంటిమీద నాధారపడు టారంభమయినది. ప్రయాణవేగమును, నౌకాసౌకర్యములును హెచ్చుటచే వివిధ దేశములకు గల దూరము తగ్గిపోయినది. వర్తక వ్యాపారము పరిమితి లేకుండ వృద్ధియగుటవలన యుద్ధములో పాల్గొనుచున్న ముఖ్యదేశములలో ఏ దేశము ఆర్థికపు చిక్కులకు లోనైనను దానితో సంబంధించిన ఇతర దేశములలో గూడ ఆర్థిక పరిస్థితులు తారుమారు గావచ్చును.

కాని, ప్రస్తుతము మన దేశము రణరంగమునకు చాల దూరమున నుండుటచే వెనుకటి యుద్ధమునాటి పరిస్థితులను మించిన అసాధారణ పరిస్థితులు ఇచ్చట ఏర్పడకపోవచ్చును; ఈ యుద్ధసమయమున కూడ మన దేశమున ధరలు వెనుకటిరీతినే మారవచ్చునని మన మనుకొనవచ్చును.

హిందూదేశమునకు ఇతర దేశములనుండి వచ్చు దిగుమతులకంటె, హిందూదేశము ఇతర దేశములకు ఎగుమతిచేయు వస్తువుల విలువయే అధికము. మన దేశము వ్యవసాయము ప్రధానవృత్తిగా గలదగుటచే ముడిపదార్థములను ఎక్కువగా ఎగుమతి చేసి, యంత్రసహాయమున తయారైన పదార్థములను విరివిగా ఇతరదేశములనుండి దిగుమతి చేసుకొనుచుండును. అందువలన ఇతర దేశములతో మనకున్న వ్యాపారము ఎగుమతులమీదనే ఆధారపడి యున్నది. ఏ కారణము చేతనైనను ఇతర దేశములు మన సరకులను కొనుట నిలిచిపోయినచో, మనకు చాల నష్టము వచ్చుటయు, దేశ

ములో ఉత్పత్తియగు కొన్ని పదార్థముల ధరలు పడిపోవుటయు సంభవించును. మనము ఎగుమతిచేయు సరకుల అవసరము విదేశము లలో హెచ్చుగా నున్నట్లయిన మన దేశ ములో ధరలు లేచును. ఆ విధముగానే విదే శములనుండి మనము దిగుమతి చేసుకొను సరకులు మనకు కావలసినంతగా ఆ దేశ ములు పంపజాలనిచో, ఆ సరకుల విలువ పెరిగిపోవును.

మన దేశమునుండి విదేశములకు ఎగు మతియగు పదార్థములలో ముఖ్యమైనవి: జన పనార, ప్రత్తి, తేయాకు, నూనెగింజలు,[1] చర్మములు, తోళ్లు.[2]

మన దిగుమతులలో ముఖ్యమైనవి: బట్టలు (నూలు సిల్కు వూలురకములు), యంత్రసామగ్రి, నూనెలు (కిరసనాయిలు, పెట్రోలు వగైరాలు) రసాయనిక పదార్థ ములు[3], ఇనుముతోను ఉక్కుతోను తయా రైన సామానులు (తీగలు, మేకులు మొద లగునవి) ఇనప సామానులు[4] (పనిముట్లు, రేకులు మొదలగునవి) మోటారుకారులు, రంగులు, కాగితములు.

పైన చెప్పినవికాక ఇంకను కొన్ని ఎగుమతులును దిగుమతులును ఉన్నవి కాని అవి అంత ప్రధానమైనవి కావు.

ఈ క్రింది పట్టికలో ౧౯౧౪-వ సంవత్స రము మొదలు ౧౯౧౯-వ సంవత్సరము వర కును మన దేశమునందలి ఆహారపదార్థముల లో కొన్ని ముఖ్యమైన సరకులయొక్క విలువ సగటున ఏ రీతిగా నుండెనో చూపింపబడినది.

౧-వ పట్టిక

| సరకు పేరు | సంవత్సరములు | | | | | |
|---|---|---|---|---|---|---|
| | ౧౯౧౪ | ౧౯౧౫ | ౧౯౧౬ | ౧౯౧౭ | ౧౯౧౮ | ౧౯౧౯ |
| బియ్యము (మణుగు) | రు. ౫-౪-౬ | ౬-౦-౦ | ౬- ౪-౦ | ౫- ౧-౦ | ౪-౨-౦ | ౬-౧౫-౬ |
| గోధుమలు[5] ,, | రు. ౪-౬-౬ | ౫-౬-౦ | ౪-౧౩-౦ | ౪-౧౨-౬ | ౫-౯-౬ | ౮- ౩-౬ |
| జొన్నలు (రూపాయకు సేర్లు) | ౧౨-౨ | ౧౨-౫ | ౧౪-౩ | ౧౩-౦౦ | ౭-౮ | ౫-౭ |
| రాగులు ,, | ౧౦-౮ | ౧౦-౬ | ౧౧-౩ | ౧౧-౯ | ౭-౨ | ౫-౨ |
| పప్పులు ,, | ౧౦-౫ | ౧౦-౮ | ౧౨-౦ | ౧౨-౧ | ౯-౫ | ౬-౦ |

1. Oil Seeds.
2 Skins and hides అనగా పదునుచేసినతోళ్లు, పదునుచేయనితోళ్లు.
3. Chemicals.
4. Hard-Ware.
5. మణుగు = Imperial Maund అనగా ౮౨ ౨/౭ పౌనులు.

దీనినిబట్టి తేలున దేమనగా యుద్ధసమయమున ముఖ్యమైన ఆహారపదార్థముల వెల విశేషముగా పెరుగలేదు. యుద్ధము ప్రారంభమయిన వెంటనే గోధుమలవెలమాత్రము కొంత హెచ్చినది. కాని ప్రభుత్వము వానివెలను కట్టుబాటుచేయుటచే పెరుగుదల నిలిచిపోయి యుద్ధము ముగియుసరికి ౧౯౧౮ లో నున్న వెలకంటెకూడ తగ్గిపోయినది. యుద్ధములో పాల్గొనుచున్న దేశములకు గోధుమలు బాగుగా అవసరముండును. అందుచేత వీని ఎగుమతులు అరికట్టనియెడల ధరలు విపరీతముగా పెరిగిపోవును. గతయుద్ధమున ప్రభుత్వముకొన్ని దేశములకుగోధుమల ఎగుమతులు నిషేధించినది. ఆకారణముచేత వెల ఎదుగుటకు వీలుకలగలేదు. ఈసారి కూడ ప్రభుత్వ మందులకు భిన్నముగా వర్తించునని అనుకొనుటకు వీలులేదు.

బియ్యమువిషయమునకూడ ధర లంత గా హెచ్చలేదు. ఏమన, యుద్ధసమయమున బియ్యముయొక్క అవసరము తక్కువ. పై పట్టికను చూచినట్లయిన ౧౯౧౬-వ సంవత్సరములో బియ్యముధర మంచి హెచ్చు చూపినదని తెలియగలదు. కాని ఈ హెచ్చుదల యుద్ధమువలనగాక, ఆ సంవత్సరమున పంటలు నష్టమగుటచే కలిగినది; మరుసటి సంవత్సరమున తగ్గిపోయినది. బియ్యము ధరలో యుద్ధసమయమున గలిగిన కొద్దిపాటి హెచ్చుదలయును, యుద్ధమువలన గాక, యితర సరకులధర కొంచెమో గొప్పయో హెచ్చుటచే వానితోపాటు పెరుగుటవలన కలిగినదని చెప్పవచ్చును.

అదేవిధముగా జొన్నలు, రాగులు, పప్పులు — వీనిధరలలోగూడ అంత విశేషముగు మార్పు లేదు. నిజము చెప్పవలసి వచ్చినచో యుద్ధము జరిగినకొలదిని, వీనిలో కొన్నింటి ధర తగ్గినదనియే చెప్పవలసియుండును. సాధారణముగా ఈ మూడింటి విలువయు, బియ్యపుధరపైననే ఆధారపడి యుండును. విదేశములలో వీని అవసరము తక్కువగుట చేత యుద్ధపరిస్థితులు వీనిధరలలో ఎక్కువ మార్పులు కలుగజేయనేరవు.

మన దేశమునుండి విదేశములకు ఎగుమతియగు సరకులలో ముఖ్యమగువాని విలువ ౧౯౧౮-వ సంవత్సరము మొదలు ౧౯౧౯-వ సంవత్సరమువరకును ౨-వ పట్టికలో యీయబడినది.

వీనిలో ముఖ్యముగా గమనించవలసినవి, తేయాకు, నూనెగింజలు, జనపనార, ప్రత్తి, తోళ్లు మాత్రమే. గత యుద్ధసమయములో ఒక్క సంవత్సరముతప్ప తేయాకు ధర ఏమాత్రము హెచ్చలేదు. నూనెగింజల ధర యుద్ధము వచ్చినపిదప తగ్గిపోయినది. ఇందులకు కారణము వీనిని ముఖ్యముగా దిగుమతిచేసుకొను ఫ్రాన్సుదేశము యుద్ధములో చిక్కుకొనియుండుట. వీని వాడకము విదేశములలోనే ఎక్కువగుటచే యుద్ధము రాగానే వీని ఎగుమతులు నిలిచిపోయి ధర మందగించును. మన దేశమునుండి ఎగుమతియగువానిలో జనపనారకు ప్రత్తికిగల ప్రాముఖ్యము మరి దేనికిన్ని లేదని చెప్పవచ్చును. బెంగాలుభాగ్యము కేవలము జనపనారపైనను, దక్కనుపీఠభూమిభాగ్యము ప్రత్తిపైనను ఆధారపడియున్నవి. సాధారణముగా యుద్ధము రాగానే వ్యాపారము మందగించుటచే జనపనారసంచుల అవసరము తగ్గును. ఆ కారణముచేతనే గతయుద్ధములో నారధర

౨-వ పట్టిక.

| సరకు | సంవత్సరము | | | | | |
|---|---|---|---|---|---|---|
| | ౧౯౧౪ | ౧౯౧౫ | ౧౯౧౬ | ౧౯౧౭ | ౧౯౧౮ | ౧౯౧౯ |
| బెల్లము (మణుగు) | ౭- ౫-౦ | ౧౦- ౮-౦ | ౧౨-౧౪-౦ | ౧౧- ౬-౦ | ౯- ౮-౦ | ౧౫- ౮-౦ |
| చేయాకు (పౌను) | ౧- ౭-౫ | ౦- ౯-౭ | ౦- ౮-౬ | ౦- ౭-౭ | ౮- ౭-౧ | ౦ ౬-౯ |
| నెయ్యి (మణుగు) | ౪౯- ౪-౦ | ౪౬- ౮-౦ | ౪౯-౧౨-౦ | ౫౮- ౦-౦ | ౬౮- ౦-౦ | ౮౦- ౦-౦ |
| నూనెగింజలు ... (మణుగు) | ౬-౧౦-౦ | ౫- ౪-౦ | ౫- ౮-౦ | ౫- ౮-౦ | ౭- ౦-౦ | ౧౨- ౭-౬ |
| జనపనార ... (౪౦౦ పౌ. బేలు) | ౮౦-౧౦-౦ | ౪౯- ౮-౦ | ౫౦- ౪-౦ | ౫౪- ౦-౦ | ౪౭-౧౨-౦ | ౮౯- ౮-౦ |
| జనపనారసంచులు (నూటికి) | ౪౨- ౮-౦ | ౩౮-౧౨-౦ | ౪౧-౧౨-౦ | ౪౩-౧౨-౦ | ౬౭- ౮-౦ | ౫౯- ౮-౦ |
| ప్రత్తి (పుట్టి) ... | ౨౮౯- ౮-౦ | ౨౦౫- ౦-౦ | ౨౯౨- ౦-౦ | ౪౬౧- ౦-౦ | ౬౫౩- ౦-౦ | ౬౩౫- ౦-౦ |
| పచ్చితోళ్లు ... (౨౦ పౌ.) | ౧౩- ౬-౦ | ౧౩- ౭-౦ | ౧౪- ౬-౦ | ౧౨- ౧-౦ | ౧౦- ౭-౦ | ౧౩- ౯-౦ |
| పదునుచేసినతోళ్లు (పౌ. ౧కి) | ౧-౧౦-౫ | ౧- ౭-౯ | ౨- ౩-౯ | ౨- ౬-౩ | ౨-౧౫-౦ | ౪- ౦-౦ |

పడిపోయినది, కాని హెచ్చలేదు. ఈసారి అయినను నారధర హెచ్చునని చెప్పటకు వీలు లేదు. కాని అంతగా తగ్గిపోవునని చెప్పరాదు; ఏమన విమానములు విసిరెడి బాంబులనుండి ప్రజలను రక్షించుటకు చేయబడు ఏర్పాటులలో ఇసుకమూటలకుగాను వీని అవసరము ఎక్కువగా నుండును. అందువలన యీ యుద్ధములో నారధర నిలబాటుచేయవచ్చును; లేకున్న కొంచెముగా హెచ్చవచ్చును.

ఇక ప్రత్తివిషయ మన్ననో గత యుద్ధమున ధర మొదట బాగుగా తగ్గిపోయినది. యుద్ధము రాగానే జర్మనీకి ఎగుమతులు నిలిచిపోయినవి. కాని తరువాతధర హెచ్చినది. ఈ సారి ప్రత్తిధర అంతగా హెచ్చునని చెప్ప వీలుకాదు. బ్రిటను యుద్ధములో చిక్కుకొని యుండుటచే యీ సారి బ్రిటనుకు ఎగుమతులు తగ్గవచ్చును. అందువలన ధర తగ్గుదలనే సూచించును.

పచ్చితోళ్లను యుద్ధమురాగానే యూరపులో కొనువారు లేక యుద్ధాంతమునకు ధర బాగుగా పడిపోయినది. కాని పదును చేసిన తోళ్లధరమాత్రము హెచ్చినది. విదేశములనుండి పదునుచేసిన తోళ్లు దిగుమతి యగుట తగ్గగనే వీనిధర హెచ్చినది.

మొత్తముమీద పై పట్టికనుండి తేలునదేమనగా మన దేశమునుండి విదేశముల

కెగుమతియగు సరకులలో ముఖ్యమయిన వానివిలువ హెచ్చలేదు. కొన్నిటివిలువ తగ్గిపోయినది. ఇందులకు కారణము విదేశములలో వీనికొనుబడి తగ్గుటయే.

ఇక ఎగుమతులమాట అటుంచి, హిందూదేశమునకు దిగుమతియగు పదార్థములలో ముఖ్యమయినవాని వెలను పరిశీలింతము. ఈ క్రిందిపట్టికలో ముఖ్యమగు దిగుమతులధర లీయబడినవి.

ఈపట్టిక నొక్కసారి చూచినచో యుద్ధకాలమున విదేశములనుండి దిగుమతియగు సరకులవిలువ ఉపద్రవముగా హెచ్చినదని చెప్పగలము. యుద్ధసమయమున ఇట్టి సరకులకు ధర హెచ్చుట సహజము. ఇందుల కనేకకారణము లున్నవి; యుద్ధకాలమున నౌకలలో చాలభాగము ప్రభుత్వపుపనిమీదనే నియోగింపబడును; దానికితోడు జలాంతర్గాముల[8] భయమువలనను, యుద్ధభయమువలనను కేవులును, ఇన్సూర్యెన్సురుసుములును అధికము చేయబడును; యుద్ధములో పాల్గొనుచున్న విదేశములు ఈ సరకులను తగినంతగా తయారు చేయలేకపోవుచుండును; అందుచేత కావలసినంత సరకు ఆయాదేశములు పంపజాలవు శత్రుదేశములనుండి సరుకు వచ్చుట కవకాశమే యుండనేరదు. కాన అట్టి వానిధర విపరీతముగా

3-వ పట్టిక[6]

| సరకు | సంవత్సరము | | | | | |
|---|---|---|---|---|---|---|
| | ౧౯౧౪ | ౧౯౧౫ | ౧౯౧౬ | ౧౯౧౭ | ౧౯౧౮ | ౧౯౧౯ |
| పంచదార ... (౧౧౨ పౌనులు) | ౮-౧౦-౬ | ౧౫-౧౨-౦ | ౧౯-౧౪-౦ | ౨౧-౧౪-౦ | ౧౮-౪-౦ | ౨౭-౪-౦ |
| ఉప్పు (లివర్పూల్ సరుకు ౧౦౦ మణు) | ౫౯-౮-౦ | ౧౨౪-౧౧-౦ | ౧౫౭-౧-౦ | ౨౨౫-౮-౦ | ౨౪౧-౧౪-౦ | ౧౭౬-౧౪-౦ |
| నూలు తానులు ... (తాను ఒకటికి) | ౬-౨-౦ | ౫-౧౪-౦ | ౬-౪-౬ | ౭-౫-౦ | ౧౧-౧౩-౦ | ౧౭-౪-౦ |
| నూలు (పౌను) ... | ౦-౧౪-౮ | ౦-౧౪-౮ | ౧-౩-౫ | ౧-౧౧-౯ | ౨-౧౦-౬ | ౨-౧౧-౦ |
| ఇనుప సామానులు... (౧౧౨ పౌనులు) | ౮-౮-౦ | ౯-౭-౦ | ౧౫-౦-౦ | ౨౪-౦-౦ | ౨౩-౦-౦ | ౩౦-౦-౦ |
| రాగి (మణుగు) ... | ౪౫-౦-౦ | ౪౭-౧౨-౦ | ౬౫-౦-౦ | ౭౯-౪-౦ | ౭౭-౮-౦ | ౭౭-౦-౦ |
| కిరసనాయిలు ... (రెండుడబ్బాలు) | ౫-౦-౦ | ౫-౦-౦ | ౫-౧౨-౬ | ౬-౧౨-౦ | ౮-౧౧-౬ | ౧౦-౧౧-౦ |

6. ఈ పట్టికయును, పైన ఈయబడిన ఒకటిరెండుపట్టికలును Index Numbers of Indian Prices అను ప్రభుత్వప్రచురణమునుండి లీయబడినవి. ఇవి వివిధప్రదేశములలోని వెలలయొక్క సగటుసంఖ్యను సూచించును.

7. Cotton shirting.

8. Submarines.

హెచ్చిపోవును. మనము దిగుమతి చేసుకొను సరకులలో కొన్నిటికి పైనచెప్పిన కారణము లన్నియును వర్తించును. కొన్నిటికి, వానిలో కొన్ని మాత్రమే వర్తించును.

ధరలు హెచ్చుట కింకొక ముఖ్యమైన కారణ మున్నది. యుద్ధములో ముఖ్యముగా కావలసిన ఇనుము, ఉక్కు మొదలగు లోహముల అవసరము, యుద్ధము చేయుచున్న దేశములలో ఎక్కువగా నుండుటచే, వాని ధర విపరీతముగా పెరుగును. పై పట్టికను బట్టి ౧౯౧౪-వ సంవత్సరములోనున్న విలువకంటె ౧౯౧౮-వ సంవత్సరములో ఇనుపసామానులవిలువ నాలుగురెట్లయిన దని తేలుచున్నది.

గత యుద్ధసమయమున విదేశముల నుండి దిగుమతియగు సరకులలో పంచదార యొక్కయు, ఉప్పు యొక్కయు ధరలు విపరీతముగా పెరిగిపోయినవి. ఆ దినములలో మన దేశమున పంచదారపరిశ్రమ అభివృద్ధి చెందియుండలేదు. మనము ఎక్కువగా విదేశములనుండి పంచదార దిగుమతి చేసుకొను చుండెడివారము 'బీటు'దుంపనుండి పంచదార తయారుచేయు దేశము లన్నియు యుద్ధములో చిక్కుకొనుటచే పంచదారకు అవసరము యూరపులో హెచ్చినది. తత్ఫలితముగ పంచదారవిలువ హెచ్చినది. ఉప్పు కూడ మనము కొంతవరకు విదేశములనుండి దిగుమతి చేసుకొనుచున్నాము. కాబట్టి ఆరకము ఉప్పు ధరకూడ హెచ్చినది.

విదేశములనుండి దిగుమతియగు బట్టల తానుల ధర మొదట హెచ్చినప్పటికిని తరువాత హెచ్చినది. ఇందులకు నౌకాసౌకర్యము తక్కువగుటయును, తయారు చేయుటకగు ఖర్చులు యుద్ధమువలన హెచ్చుటయును అని చెప్పవచ్చును.

కిరసనాయిలువిషయ మన్ననో మొదటలో ధర హెచ్చలేదు గాని, క్రమముగా హెచ్చినది. యుద్ధములో ఈ రకము చమురుల అవసరము హెచ్చినకొలదిని ధర కూడ హెచ్చినది. ఈసారికూడ వీని ధర క్రమముగా హెచ్చవచ్చును.

పై పట్టికలో కాగితములధర ఇచ్చియుండలేదు. కాని గతయుద్ధములో కాగితములధర విపరీతముగా హెచ్చిపోయినది. ఆ దినములలో మన కవసరమగు కాగితమంతయు విదేశములనుండియే దిగుమతి యయ్యెడిది. ధర హెచ్చుట కదియే కారణము.

పైన దిగుమతులలో చేర్చిన పదార్థములలో కొన్నిటివిషయమున ఇప్పుడున్న పరిస్థితులు వేరు; ౧౯౧౪-వ సంవత్సరపుయుద్ధము నాటి పరిస్థితులు వేరు. మన దేశమున పాతిక సంవత్సరముల క్రిందట అభివృద్ధి చెందని కొన్ని పరిశ్రమలు ఇటీవల మంచిస్థితికి వచ్చి దేశములో కావలసిన సరకులో చాల భాగము తయారు చేయుచున్నవి. వీనిలో చాలవరకు, ప్రభుత్వ సహాయమువలననే పైకి వచ్చినవి. ప్రజలనుండి వసూలుచేసిన ధనముతోగాని విదేశపు దిగుమతులను దేశములోనికి రానీయక, స్వదేశపరిశ్రమల వలన తయారగు సరకు చలామణియగునట్లు చేసిగాని, కొన్ని పరిశ్రమలకు ప్రభుత్వము సహాయము చేసినది. ఇట్టి పరిశ్రమలలో ముఖ్యమైనవి ఇనుము, ఉక్కు, బట్టలు, పంచదార, కాగితములు, సిమెంటు మొదలగునవి.

మన దేశమునకు సంబంధించినంత వరకు యుద్ధమువలన ప్రత్యేకముగా వీనిలో దేనిధరయును లేవవలసిన యవసరము కాన్పింపదు. ఒక్క ఇనుము, ఉక్కు విషయమున, ఆపదార్థములు యుద్ధపరికరముల కవసరమగుటచే ధర కొంచెము లేవవచ్చును. కాని ఉక్కు పరిశ్రమ మన ప్రభుత్వసహాయముచేతను రక్షణచేతను పైకి వచ్చినదగుటచే, విదేశములపోటీ యుద్ధమువలన తగ్గిన సమయమున ధరలు హెచ్చించుట పెట్టుబడిదారులకు తగనిపని.

రక్షణవలన పైకి వచ్చిన పరిశ్రమలలో యుద్ధము వచ్చినవెంటనే ఇనుము, పంచదార, కాగితములు వీనిధర బాగుగా పెంచివేసిరి. ఈపరిశ్రమల యభివృద్ధికి ప్రజలసొమ్మునుండి ప్రభుత్వము చేసిన సహాయమునకిది ప్రతిఫలము కాబోలును. విదేశములనుండి వచ్చెడి సరకులధర హెచ్చుటలో అర్థము లేదు. పంచదారయొక్కయు, వ్రాత కాగితముల యొక్కయు ధర హెచ్చుట పరిశ్రమాధికారుల దురాశను సూచించుచున్న దని చెప్పవలసియున్నది.

మన దేశమున కవసరమగు వ్రాత కాగితము లన్నియును మన దేశముననే తయారగుచున్నవి. విదేశములనుండి మనకు దినపత్రిక లచ్చువేయుట కవసరమగు 'న్యూస్ ప్రింటు' అనుకాగితములును, పీచుకాగితములును దిగుమతి యగుచున్నవి. వీనిధర హెచ్చుటలో కొంత కారణ మున్న దికాని, మన దేశమున తయారగు కాగితముల ధర హెచ్చుట కేమియును అవసరము లేదు. 'న్యూస్ ప్రింటు' ధర లేచుటచే దినపత్రికలు తమ వెలనైనను హెచ్చుచేసినవి, లేక పుటల సంఖ్యనైనను తగ్గించినవి. ఈసందర్భమున నొక ముఖ్యమగు విషయము చెప్పవలసియున్నది. దినపత్రికల కుపయోగించు కాగితములపై ప్రభుత్వ మామధ్య దిగుమతిసుంకములను కొలదిగా హెచ్చింపదలచినప్పుడు, దినపత్రిక లన్నియు ఒక్కసారిగా పెద్దగోల చేసినవి; ఏమన, మన దేశమునకు దిగుమతియగు కాగితముల ధర హెచ్చిన, వానిమనుగడకే భంగమని వాని యభిప్రాయము. ఈ యుద్ధసమయమున అవి ఎట్లు మనగలవో తెలుసుకొనును గాన ఇక ముందైనను ఈరకము కాగితమునకు ప్రభుత్వము రక్షణ నొసంగదలచినచో మన దినపత్రిక లన్నియు అట్టి ప్రయత్నము నడ్డక దేశాభివృద్ధికి తోడ్పడగలవని నమ్మవచ్చును. కాగితపు పరిశ్రమ పెట్టుబడిదారులుకూడ ఈవిషయమును గమనించి, మామూలు కాగితముల ధరలు హెచ్చించి అధిక లాభము పొందుటకు మారు, ఈక్లిష్టపరిస్థితులలో దినపత్రికల కవసరమగు కాగితములు తయారుచేయుట ప్రారంభించి, దేశాభివృద్ధికి తోడ్పడవలసిన తమభారమును గుర్తించవలెను. ప్రభుత్వము రక్షణ నొసంగ నక్కరలేకయే అనుకూలమగు పరిస్థితులు, యుద్ధము సాగినకొలదిని కాగితపు పరిశ్రమకు లభించవచ్చును.

యుద్ధము వచ్చినట్లయిన ప్రతివస్తువు ధరయు పెరుగునని జనబాహుళ్యములో నొకతప్పుటభిప్రాయ మున్నది. పైనీయబడిన వివరములనుబట్టి విదేశములనుండి దిగుమతి యగు సరకుల విలువతక్క దేశములో తయారగు సరకుల యొక్కయు, దేశములో ఉత్పత్తియగు ముడిపదార్థములయొక్కయు

విలువ హెచ్చదని తేలుచున్నది. యుద్ధభయమువలన ప్రతిపదార్థము విలువయు అణుమాత్రము హెచ్చవచ్చునుగాని స్వదేశీ వస్తువుల విలువ విదేశపు దిగుమతుల విలువ యంత హెచ్చనేరదు. అట్లు హెచ్చిన యెడల అందులకు కారణము వర్తకుల యొక్కయు, పెట్టుబడిదారుల యొక్కయు అత్యాశయేగాని యుద్ధము కాదని నిస్సంశయముగా చెప్పవచ్చును. మన దేశమున సంరక్షణవలన వృద్ధిగాంచిన పరిశ్రమల [illegible]కారులు ధరలు హెచ్చుచేయకుండుటకు నైతికముగా బద్ధులైయున్నారు. వారు ప్రజలసొమ్ము తిని పైకి వచ్చియుండుటచే, పోటీ తగ్గినప్పుడు ధరలు హెచ్చుచేసి ప్రజలను పీడించుట తగనిపని. ఈవిషయమున ప్రభుత్వముకూడ తనధర్మమును నెరవేర్చుకొనవలసియున్నది. బ్రిటను, ఫ్రాన్సు మొదలగు దేశములలో యుద్ధమునకు పూర్వమున్న ధరలను పెంచరాదని ప్రభుత్వము శాసించినది. మన దేశములో కూడ ధరలను కట్టుబాటుచేయుటకు ఇండియా ప్రభుత్వము రాష్ట్రప్రభుత్వములకు అధికార మిచ్చినది. బెంగాలులోను, బొంబాయిలోను ప్రభుత్వము ఈవిషయమున కొంత చర్య తీసుకొనినది. మదరాసు ప్రభుత్వము మాత్రము ధరలు హెచ్చించినట్లయిన చర్య తీసుకొందుమని గర్జించుచు కాలము గడపుచున్నది కాని ఇదమిత్థమని యేమియు చేసియుండలేదు. ధరలు హెచ్చకుండగనే ఆపుచేయుట సులభముగాని, హెచ్చిన ధరలను దింపుట సులభసాధ్యము కాదు.

యుద్ధానంతరము ప్రతిదేశమునను ధరలు హెచ్చుటకు కారణ మున్నది. ప్రతిప్రభుత్వమును, యుద్ధకాలమున తనకు సొమ్ము అధికముగా కావలసియుండుటచే కాగితపు నోట్లద్వారా కొంతవరకును, నాణెముల ద్వారా కొంతవరకును ధనవృద్ధి చేయును. ఆవిధముగానే మన దేశమునందుకూడ ప్రభుత్వము ౧౯౧౪ మొ. ౧౯౧౮-వ సంవత్సరము వరకును ౨౨ కోట్ల రూపాయల విలువగల నాణెములును, ౧౭ కోట్ల రూపాయల విలువగల కాగితపు నోట్లును మొత్తము అదనముగా ౩౯ కోట్ల రూపాయలు దేశములో చలామణి చేసెను. ఈ కారణముచేతనే యుద్ధము ముగిసినపిదప దేశములో ప్రతివస్తువధరయు ఒక్కసారిగా పైకి లేచెను. అంతేగాని ప్రజలలో చాలమంది భావించునట్లు యుద్ధమువలన ప్రతివస్తువుధరయును లేవలేదు. యుద్ధకాలమున కొన్నిటిధరలు లేచుటకుబదులు పడిపోయినవి. యుద్ధానంతరపు పరిస్థితులను మనసునం దుంచుకొని జనబాహుళ్యము ధరలహెచ్చుదల యుద్ధసమయముననే కలిగినదని భ్రమపడుచున్నది.

ఈ సందర్భమున మదరాసురాష్ట్రమునకు సంబంధించినంతవరకు వరిధాన్యము ధరనుగూర్చి ఒకమాట చెప్పవలసియున్నది. యుద్ధసమయమున ధాన్యముయొక్క అవసరము తగ్గునని బియ్యపుధరను చర్చించునప్పుడు చెప్పియుంటిని. అందుచేత ధాన్యమునకున్న కొలది ఎగుమతులుకూడ పడిపోవును. దీనికితోడు బర్మాలోని ధాన్యముకూడ దిగుమతిపన్ను లేకపోవుటచే మన కేరవాణా కాగలదు. గత సంవత్సరము అతివర్షములలన పంటకొంచెము నష్టమయినను అంతగా చెడిపోలేదు. కాబట్టి యింతలో ధాన్యపుధర హెచ్చునని భయపడ నవసరము లేదు.

# కల్కి

శ్రీ యన్. జగన్నాథ్

"కలియుగే ప్రథమపాదే" — అనే, ఇంకా సంకల్పంలో సమయనిర్ణయము — సంకల్పమే చెప్పుకుంటూన్న కొద్దిమందిలో—కలియుగాంతము ప్రళయభూయిష్ఠమనీ, సకలప్రాణివిధ్వంసానికి విష్ణువు కల్క్యవతారము దాల్చి అశ్వారూఢుడై, ఖడ్గధారియై యుండునని పురాణప్రమాణము. ఈనిరూపణలో ఈరెండు అవతారనిర్ణయాలూకూడా రెండుమాత్రాలు సూచిస్తాయి; విధ్వంసనయొక్క వేగమూ, నిశితమయిన నిష్కృపాతి నిర్మూలనములోని తీక్ష్ణతానూ. ఇవి కలియుగ తురీయపాదానికి చెందవలసిన లక్షణాలు.

అయితే ప్రథమపాదమని చెప్పబడుతూన్న ఈ రోజుల్లోనే, వినాశనపరికరాలు అతివేగముతో పటుత్వంతో వెలసిఉన్నాయి. కేవలము పరికరాలుమాత్రం కాదు—మనుష్యుల మానసికపరివర్తనకూడాను- అలాగే వింతవింత వినాశనౌత్సుక్యముతో నిండిపోతోంది. అందుచేతనే, ఎంత తప్పించుకోవా లనుకుంటున్నా, ఎన్నివిధాల చిన్న చిన్న బలులతో అవసరమైన వేద్యాలు పెట్టినా యుద్ధం తప్పలేదు.— పూర్వపశ్చిమాల్లో ఏదేశములోనూను.

యుద్ధానికి అనేక కారణాలు చెబుతారు మానసికతత్వం శాస్త్రరీత్యా శోధించిన పండితులు. వాటిల్లో ముఖ్యమైనది యుద్ధపరికరాలు అందుబాటులో ఉండటం. వీటికితోడు మనస్పర్థ లుండటం.

పాతికేళ్ళక్రితం జరిగిన ప్రపంచయుద్ధంనుంచి - చావు తప్పి బయటబడిన వివిధదేశాలవారూ మళ్ళా ఇంకోయుద్ధం రాకుండా ప్రపంచాన్ని కాపాడడానికి ఏవో కొన్ని నిబంధనాలు నానాజాతి సమితిద్వారా ఏర్పరచారు, — ఫలాని దేశము ఫలానిసంఖ్యకంటె ఎక్కువ యుద్ధపరికరాలు చేర్చకూడదనీ, వ్యాపారసరళికి ఏవిధమయిన భంగమూ ఏదేశమూ కలుగజేయకూడదనీ, ఒకవేళ ఏదయినా హంశముమీద ఏ రెండు దేశాలకైనా యుద్ధము వచ్చినా, సామాన్యప్రజని హింసపెట్టడంకాని, దేశానికి వెన్నెముకవంటి ప్రజని, —సైన్యములో చేరనివారినీ, ఆసుపత్రికిగాని మత సంస్థలకికాని చెందినవారినీ శత్రుదేశములోనయినా సరే చంపకూడదనీ, ఇలాగే వందలకొద్ది నిబంధనాలు. ఎన్ని నిబంధనలు చేసినా మానవసౌఖ్యంకోసం శాస్త్రజ్ఞులు కనిపెట్టే ప్రతిఅంశము మానవనిర్మూలనానికి ఉపయోగమవుతోంది.

ఈ శాస్త్రదుర్వినియోగము- ఈ క్రూరత్వము యుద్ధమంటే ఉజ్జాయింపుగానైనా ఊహించుకోలేని మన దేశప్రజకి అంతగా అర్థం కాదు. పాతికసంవత్సరాల క్రిందటి ప్రపంచయుద్ధంకు మనకి యుద్ధమంటే ఎటువంటిదో తెలియకుండానే దాటిపోయింది - ధరలు పెరగటం, కొన్ని విదేశవస్తువులు దొరకకపోవటంవంటి ఏవో కొద్దిపాటి తాత్కాలిక ఇబ్బందులు కలగడంతప్ప. యుద్ధములో దిగిన దేశాలు చాలా ధననష్టం పొందుతాయనీ, వాణిజ్యంలోనూ, పరిశ్రమల్లోనూ మళ్లా చాలా కాలానికిగాని కోలుకోవనీ ఆర్థికశాస్త్రజ్ఞులు చెప్పే నష్టాలకంటే — ఎన్నిరెట్లు ఎక్కువ బీభత్సమయిన కష్టనష్టాలు కలుగుతవో, ఈరోజుల యుద్ధసరళి బాగా తెలుస్తేనేకాని బోధపడదు.

౧౯౧౪-౧౯౧౮లో జరిగినయుద్ధమే - భూకంపంకంటే అగ్నిపర్వతప్రకోపంకంటే-అనేకరెట్లు ఘోరముగా కనుపించింది ప్రపంచానికి అంతకూడాను. ఈ యిరవైరెండేళ్లలోనూ, ప్రతిపద్ధతీకూడా దండెత్తడం విషయంలోను, సంరక్షించుకోడం విషయంలోనూ విపరీతంగా అభివృద్ధిచెందింది.

ప్రస్తుతంలో ఉపయోగించే మారణయంత్రాలూ, అమానుష విధానాలూ మొదలైనవాటిని గురించి విన్నా చదివినా, అతిదారుణంగా కనిపిస్తుంది. భావనాశక్తికి అందని అధైర్యపడిన మహాభారత యుద్ధంకూడా, — అతిరథులూ మహారథులూ మొదలయిన ప్రముఖుల పూర్తిసామర్థ్యము రోదించుకోగలిగినా — ఈ రోజుల యుద్ధపద్ధతులముందర అతిసౌమ్యంగా కనిపిస్తుంది. ఆయుద్ధంలో ఎంత శూరత్వమూ, శస్త్రసాచిత్యమూ ఊహించుకున్నా భూమిమీదనే. ఇప్పుడు దాదాపు పంచభూతాల్లోనూ సంచరించి సైన్యాలుపయోగిస్తున్నారు- యుద్ధాల్లో రెండు పక్షాల్లోనూకూడాను.

అందులోనూ ఎక్కడికక్కడే అనేకమార్గాలు- అనేకయంత్రాలు, అనేకసాధనాలు.

కేవలమూ భూమిమీద జరిగేయుద్ధంలోనే దాదాపు అరడజనురకాల అంగాలున్నాయి; ప్రతీఅంగముయొక్క వేగమూ, బలమూ, సామర్థ్యమూ రోజుకి రోజు ఏవో కొన్ని క్రొత్తసాధనాలవల్ల అభివృద్ధి అవుతున్నాయికూడాను. అలెగ్జాండరురోజుల్లోనుంచి బొబ్బిలియుద్ధమువరకూకూడా నేలమీదిసైన్యము పదాతులతోటి, గుఱ్ఱపుదళముతోటిమాత్రమే కూడుకొనియుండేది. ఈ రోజున గుఱ్ఱపుదళము అచ్చటచ్చట ఏదో కొద్దిగానే ఉంది. చాలామట్టుకు ప్రతిసేనలోనూ మోటారు "టాంకు"లే ప్రధానాలు. విల్లంబులు పోయి తుపాకులు రావడముతోనే, అశ్వారూఢుల చాకచక్యంకంటే మోటారు"టాంకు"ల దుర్జయత్వమే సైన్యంలో ఎక్కువ ఉపయోగకరమైంది. అసలు అశ్వదళానికి ఉన్న అనుకూల్యము ఎంత కంటకప్రదేశంలోనైనా, ఎన్నిమిట్టపల్లాలున్నా త్వరగా సైన్యాన్ని ఒకచోటనుంచి ఇంకొకచోటుకి చేరవేయగలగటము.— దీనికితోడు — శత్రువుల పదాతిసైన్యంలో అశ్వికులు ప్రవేశించటంవల్ల శత్రుసైన్యాన్ని సులభంగా చీల్చి విడదీయటం. అయితే అశ్వికదళములో ఒక్కొక్కసైనికుడు రెండేసి జీవాలు కాపాడుకోవాలి, లేకపోతే అది నష్ట మన్నమాటే. దానికితోడు మనిషికే కాకుండా గుఱ్ఱానికికూడా వేళపట్టున తిండి అమర్చుకోవాలి. ఈరెండూ కాక తుపాకీలముందర అశ్వికదళము అట్టేసేపు ఆగదు. అంచేత అశ్వికదళంయొక్క అనుకూల్యాలుమాత్రము ఉండేలాగనూ, అందులోని కష్టాలు లేకుండాను టాంకులు కనిపెట్టారు.

ఈటాంకులు మొట్టమొదట యుద్ధంలో ఉపయోగించినప్పుడు శత్రుసేనలు బెంబేలుపడిపోయాయి. సాధారణసైనికులు పోలేని మిట్టపల్లాలన్నిటిమీదినించి పాకుతూ, ఒకమరతుపాకీతో ఎదట నిప్పులు కక్కుతూ ఎన్ని తుపాకిగుండ్లు తగిలినా లక్ష్యంలేకుండా ఆగకుండా తిన్నగా రావటము అతిభయంకరంగా కనిపించిందట. అప్పటికీ ఇప్పటికీ ఈటాంకులకు ఎటువంటితుపాకిగుండ్లు తగిలినాసరే సొట్టయినా పడనటువంటి ఉక్కురేకు లుపయోగించటం - అవి పూర్వము గంటకి ౧౦, ౧౫ మైళ్లు పోతుంటే, ఇప్పుడు ౩౦, ౩౫ మైళ్ల వేగముతో కూడా పోగలిగేటట్లు వాటిని నిర్మించటంవల్ల ఈరోజుల యుద్ధసాధనాలలో చాలా ముఖ్యంగా లయినవి ఈ "టాంకులు"లు.

ఇప్పటి యుద్ధము పరికరాలలోనూ పద్ధతిలోనూ చాలా మారిపోయింది ఈక్రొత్తవాహనాలవల్ల.

కాల్బలాలు ఎదుటబడి పోరాడేటప్పుడు— యుద్ధారంభంలో ఎవరిరాజ్యంలో వా రుంటారు; ఇక అక్కడినుంచి రెండువైపులవారూ ముందరికి పోవాలని ఎత్తులు వేస్తుంటారు.— అధమపక్షము తమ దేశ ప్రదేశము విడవకుండా ఉండడానికైనా దృఢనిశ్చయులై ఉంటారు.

ప్రపంచయుద్ధానికి (౧౯౧౪—౧౯౧౮) ముందర జరిగిన యుద్ధాల్లో ప్రతిసిపాయికి ఒక్కొకతుపాకి — అందులో ఇమిడే శక్తి కావలసినంత (అంటే సాధారణంగా మోయగలిగినంత) మందుగుండుసామాను ఉంటూండేవి. ఒక్కొకసేనావిభాగాని(రెజిమెంటు)కి కొన్ని మరతుపాకులు— పెద్దతుపాకులుకూడా సగటున ఉండేవి. అనుకూలసమయము చూచి ఒకకక్షివాళ్లు ముందుకు వందలకొద్దీ పరుగెత్తి ఎదటివారి తుపాకులని లక్ష్యపెట్టక శత్రుస్థానాన్ని ఆక్రమించుకోటానికి ప్రయత్నిస్తుండేవారు. — అడ్డొచ్చిన శత్రుసైనికులని

తుపాకులతో కాల్చివేసో, ఇంకా దగ్గరగా ఉంటే కత్తులతో పొడిచో, మరీ దగ్గరగా ఉంటే తుపాకి మడమలతో నెత్తిమీద మొత్తో, ఇటువంటి చొరబడటాలు లేకుండా ఉండేటందుకు పన్నిన పన్నాగము-కందకాలు (నీళ్లులేనివి) త్రవ్వకొని అందులో వరసగా నిలబడి ఉండటం. ఇందువల్ల పరిసరభూమిని ఆక్రమించుకోడానికి వచ్చే శత్రువుల తుపాకులకి ఎదురై గురి అవకుండా, వారిమీద గుండ్లవర్షము కురిపించటానికి వీలయ్యేది. — దీనికి అదనంగా వచ్చిన కట్టుబాటు ముండ్లతీగలతో నిర్మించే కంచె. ఇది కాల్బలాల ముందునడకకి ఎడతెగని అభ్యంతరము అయిపోయింది.

అలాటిసందర్భంలో టాంకులు వచ్చాయి — అవి అనాయాసంగా ముందర వెళ్లి ఈతీగలకంచెని నేలమట్టము చేసేవి — వాటివెనకనే కాల్బలాలు సాగిపోవడానికి వీలుగా.

కాని వాటి నిరంకుశత్వము ఒకటి రెండేళ్లు మాత్రమే. ఈటాంకులకి అమర్చిన ౩, ౪ అంగుళాల ఉక్కురేకునికూడా లక్ష్యం చేయకుండా దూసుకుపోయే గుండ్లు వదిలే పెద్ద పెద్ద తుపాకులు వచ్చాయి. అంతేకాక శత్రుసేనల మధ్యవున్న ప్రదేశము బాంబులవర్షముతో ముంచివేయబడటంవల్ల పిండిలాగా అయిపోయి పెద్దపెద్దగోతులతో నిండిపోతుంది. టాంకు ఎంత బలమయినదయినా ఈగోతులలో దిగబడి దట్టూ గట్టుకాక మెత్తటి మన్నులాటి పదార్థముండటంవల్ల పైకెక్కలేక ఊబిలో దిగబడ్డ ఏనుగలాగయిపోయి నిరుపయోగ మవడమే కాకుండా శత్రువులచేతుల్లో పడిపోయేది. దాంతో టాంకుల ఉపయోగము కొంతవరకు తగ్గిపోయింది. కాని ఇప్పటికికూడా కొన్నికొన్ని సందర్భాల్లో అది అమూల్యంగా ఉపయోగపడుతోంది.

ఎన్ని కొత్తయుద్ధసాధనా లొచ్చినా, ఎన్ని కొత్తపద్ధతు లొచ్చి ఎంత చురుకుగా మారణసాధనా లుపయోగించగలిగినా, కాల్బలాలు వద్దని యెవరూ యుద్ధం చేయలేరు — అది నేల విడిచి సాముచేయడం — అంచేతనే దండెత్తడానికి ఒకరు క్రమక్రమంగా ఒక్కొక్క క్రొత్తమార్గం కనిపెడుతూంటే — రెండోవారూ దానికి విరుగుడు కనిపెడుతూంటారు — తమ్ముతాము రక్షించుకోడానికి.

శత్రురాజ్యాన్ని ఆక్రమించుకోటానికి పూర్వపు మార్గము—కాల్బలాలు ముందుకి చొరుచుకొనిపోయి అవతల వారిని తరిమివేసో, చంపో వారిప్రదేశాలని ఆక్రమించుకోవటం—చాలా కష్టమయినది.--ఎక్కువమంది సిపాయిలు చచ్చిపోవటమే కాకుండా, ఎన్నాళ్లకీ ఈయుద్ధం తెగదు — ఏమంటే, ఒకరోజు నాల్గుగంటలకి ఒకఫర్లాంగు ముందరికి వెళ్లి ఒకప్రదేశము ఆక్రమించుకుంటే మళ్లా ఏ ఏడెనిమిదిగంటలకో శత్రుసేనలు ద్విగుణీకృతంగా వచ్చి వీళ్లని తరిమేసి మళ్లా అందులో కూర్చునేవారు. అందువల్ల ఒకరోజంతా యుద్ధము చేసి, గొప్పసాహసముతో ఎదటివాళ్ల మరతుపాకులని లక్ష్యపెట్టకుండా పోరాడి వందలకొద్దిజనం పడిపోయినా చివరకి ఒకస్థలం ఆక్రమించుకుంటే — ఆకాస్త ఇట్టే పోయి ఊరుకునేది. ఆలాగ ముందుకీ వెనక్కీ ఊగులాడటంలో రెండువేపులా అమితనష్టమయి — చివరకి రెండువైపులకీ ఒక్కగజమునేలయినా దక్కకుండా పోయేది.

పరస్పరమూ కలియబడి చేసే పోరాటంలో ఉపయోగించడానికి ఒకటిరెండు చిన్నచిన్న పరికరాలు కనిపెట్టారు యుద్ధము ముదరగా ముదరగా. వాటిల్లో మొదటిది చేతిబాంబు (**hand grenade**). ఇది ఒకదానిమ్మపండులాటి బాంబు. దీని కొచిన్న మీట ఉంటుంది, పట్టుకున్నవాళ్ల చేతిలోనే పేలకుండాను. ఆమీట వదులుచేసి ముందరికి వెళ్లేటప్పుడు శత్రువులు ఆక్రమించి ఉన్న ప్రదేశంలోకో, పారిపోయేటప్పుడు తరుముతూన్నవాళ్ల మధ్యకో గిరవాటేస్తే అది బ్రద్దలయి చుట్టుప్రక్కల ౧౦,౧౫ గజాల దూరంలో ఉన్నవాళ్లందర్నీ ఊరుకోబెట్టుకుంది.

రెండోది రంపపుకత్తి — కడచిన ప్రపంచయుద్ధంలో ఒకొకప్పుడు మామూలుకత్తి పెట్టి పొడుస్తే అది ఊడి వచ్చేది కాదట అవతలి శవంలోంచి — అంతగా గట్టిగా లాగితే విరిగిపోయేదిటకూడాను. అంచేత కొంతమంది ఆజానకత్తికి బదులు, కందకాలు తవ్వకోడానికి తెచ్చుకొన్న పారలతో శత్రుసిపాయిల

వీథులు చీల్చేసేవారు పరుగెత్తుతూనే! యుద్ధములో ఏనిమిషాని కానిమిషము చురుకుగా సాగిపోవలసిన సిపాయీలకి ఈకత్తి చట్టువ ఉపయోగపోవటము గొప్ప ప్రమాదంగా అనిపించేది. ఆలస్యమయితే ఆ అరనిమిషము లోనూ ఏమరతుపాకిగుండ్లు తమ్ము తుడిచి పెట్టేస్తాయో అని భయమే!

మరతుపాకులు సాధారణంగా ప్రతిపదాతి సైన్య విభాగముముందర, కందకముపైన అక్కడక్కడ ముక్కాలిపీటలను అధిష్ఠించి ఉంటాయి. ఒకప్రక్క నుంచి ఇంకొక ప్రక్కకి తల త్రిప్పే ఎలక్ట్రిక్ పంకాలాగ, ఇవి తిరుగుతూ నిమిషానికి ౨౦౦ మొదలు ౫౦౦ గుండ్లవరకు కురిపిస్తూం టాయి. అంచేత ముందుకు సాగిపోయే ప్రతిసిపాయి దృష్టీ ఈనిప్పులు కక్కేయంత్రంమీదనే ఉంటుంది — ఎదటివారి కందకాలు ఆక్రమించుకోవటంకంటే విలు వయినపని ఆమరతుపాకీ వెనకనున్న సిపాయిలని చంపి ఆతుపాకులని పట్టుకోవడం. గంటలకొద్దీ పనిచేస్తూంటే ఈమరతుపాకులు వేడెక్కిపోకుండా వాటిని నీళ్లతో చల్లార్చడానికి ఒకసాధనము వాటికి అమర్చిఉంటుంది. ఒకొక్కప్పుడు రాత్రిళ్లు పగళ్లు ఎడతెరపి లేకుండా యుద్ధముచేసి అలిసిపోయి దాహమెక్కువైన సిపాయి లకి ఆమరతుపాకులు పట్టుకోవడంకంటె - అక్కడ త్రాగడానికి వేన్నీళ్లయినా, త్రుప్పువాసనకొట్టినాసరే - లభిస్తాయన్నే ఆశ. అదీ రోజులతరబడి యుద్ధము సాగి నప్పుడు ఒకొక్కప్పుడు సిపాయి లుండేస్థితి.

ఈపరిస్థితులు మార్చడానికని చేసినప్రయత్నము పెద్దతుపాకులు (ఫిరంగులు) ఉపయోగించటం. - వీటికి సాధారణంగా రెండుమైళ్ల నుంచి ఇరవైమైళ్లవరకూ ఏవస్తువునైనా ధ్వంసం చేసేటంతశక్తి ఉంది. అంచేత శత్రుసేన కంటబడకుండా చాటున ఉండి, వాళ్లమర తుపాకుల్ని, కందకాల్లో దాగిఉన్న సిపాయిల్ని కంద కాల ముందరున్న తీగకంచెల్ని, ఆసిపాయిలకి ఆహారం తీసుకొచ్చే మోటార్లనీ అన్నిటినీ ధ్వంసంచేయడానికి వీటిద్వారా వీలు. - అయితే ఇవి కేవలమూ గణితశాస్త్ర ప్రకారం లెక్కచూసి అయినా, లేకపోతే ఏదో టెలి ఫోను తీసికెళ్లి దూరదర్శినియంత్రంతో చూస్తూ శత్రు స్థానాలని తెలియజేసేఉద్యోగిద్వారానయినా వాడాలి. ఈఫిరంగుల్లో అనేకరకాలున్నాయి. ఒకొక్కటి ఒకొక్కపనికి బాగా పనికివచ్చేటట్లు తయారు చేశారు- శత్రుసహాయంకోసం వెనకాలవచ్చే పటాలాల్లో గుండ్లు వేసి అధైర్యపరచే రకంపెద్దిరనుండి, కందకాల ముందరనున్న తీగతెరలని మట్టంచేయడానికి ఉపయో గించే రకాలవరకు. వీటిల్లో కొన్నిటిలో సాధారణపు ఫిరంగిగుండ్లుకాక - బాంబులుకూడా ఉపయోగిస్తారు, అవసరముకొద్దీ.



౧. నగరభాగదృశ్యము

బాంబు పడకపూర్వము; పడినతోడనే

ఈ బాంబు ఎక్కడ పడ్డా సరే భూమిలోకి కొన్ని అడుగులు దిగిపోయి (దిగేలోతు బాంబుయొక్క తూకాన్ని బట్టి — క్రిందికి పడే వేగాన్ని బట్టి ఉంటుంది)

చుట్టుపక్కలనున్న భూమిని చీల్చి, పేలినప్పుడు ఏర్పడిన చిన్న చిన్న ఉక్కుతునకలతో సహా చిచ్చుబుడ్డిలాగా అన్నివైపులా ఆవరించుకుంటుంది. ఈతునకల్లో ఏది గుచ్చుకున్నా ప్రాణహాని కలుగుతుంది. ఏవి గుచ్చుకోకపోయినా కొంతసేపు దిమ్మెక్కిపోతుంది దగ్గిరున్న ప్రాణులకి (దీనికే Shell-shock అంటారు). — ఇంతే కాక ఇలా పడ్డచోట చిన్న భూకంపమంత గందరగోళము జరగటంవల్ల చుట్టుప్రక్కలనున్న కట్టడాలకి కూడా నష్టం. అంచేతనే ఈరోజుల యుద్ధములో తుపాకిగుండ్లు, ఫిరంగిగుండ్లకంటె విస్తారము ఉపయోగము బాంబులు — ఫిరంగులలోంచి వచ్చిపడ్డా, గాలివిమానాల్లోంచి వర్షించినా.

మనుష్యులున్న కందకాల్లో పడ్డం ఆరంభిస్తే కందకాలు మూసుకుపోతయి — తీగెల కంచెమీద గాని, దగ్గిరగాని పడితే తీగెలు కట్టిన స్తంభాలు పడిపోయి క్రమేణా అడ్డు నేలమట్ట మయిపోతుంది. మరతుపాకులమీదనైనా శత్రుఫిరంగులమీదనైనా పడితే అవి ముక్కలు ముక్కలయిపోతాయి. ఈ ఉపద్రవాన్ని మొదటమొదట — అక్కడక్కడ ఇప్పటికీని- ఇసుక బస్తాలు పెట్టి కొంతవరకు ఉపసంహరిస్తారు.— బాంబు ఇసుకబస్తాలలోనే పడితే పేలదు కొంతసేపటివరకూ— అధమపక్షము — ఒకవేళ పేలినా భూమిలో పునాదులు పెల్లగించదు. అంతగా భూమిమీదపడ్డా ఈబస్తాల వెనకాల సురక్షితంగా దాక్కోవచ్చు- ఎగిరే ఉక్కుతునకలు గుచ్చుకోకుండా. అయితే ఈబస్తాలు కేవలము తాత్కాలిక ఉపశమనము.

ప్రత్యేకము రాజ్యాలయొక్క పరిహద్దులు కాపాడుకోవటానికి ఇంతకంటె మంచి కట్టుదిట్టమయిన శాశ్వతమయిన సంరక్షణస్థానము కావాలి. ఈ అవసరాన్ని బట్టే వివిధదేశాల పరిహద్దులలోనూ, "మాజినాట్" లైనులవంటివీ, "సిగ్ ఫ్రీడ్" లైనులవంటివీ ఏర్పడ్డాయి, ప్రక్కనున్న దేశములోంచి సైన్యాలు చటుక్కున వచ్చిపడకుండా ఉండేలాగున సంరక్షించుకోవడానికి. — బాంబులు వర్షించినప్పుడుకూడా పరిహద్దు పొలిమేరలు నిరాటంకంగా కాపాడుకొనేందుకు ప్పనేవలు కాపుండటానికి వీలుగా నిర్మించబడ్డాయి ఈపరిహద్దు సంరక్షణలు.

అయితే వాటిల్లో పెద్దవింత ఏమీ లేదు — కట్టడంలోగాని, కాపలాలోగాని.

బాంబులనుంచి పరిహద్దుసైన్యము చెక్కుచెదరకుండా ఉండటానికి, పట్టణాల్లో ప్రజలకి ఎటువంటిఅవకాశాలు, అండలూ ఏర్పరచారో అవే ఇక్కడానూ. ఇప్పుడు ప్రధానపట్టణాలలో బాంబులు పడితే సురక్షితంగాదాక్కోడానికి — భూమిక్రింద కాంక్రీటు కట్టడాలుకట్టారు. — ఇంకా చాలాచోట్ల గుహల్లోకూడా ఉక్కుస్తంభాలు చిమ్ముబుల్లాటివి — నిలబెట్టారు. బాంబులు పడతాయని అనుమానం వేసినప్పుడు ఎక్కడవాళ్ళక్కడ ఈ సురక్షణస్థానాలకి చేరుకుంటారు. ఈ రెండువిధాలైన చోట్లల్లోనూకూడా బాంబుయొక్క ఉక్కుకణాలనుంచీ — ప్రక్కని పడిపోయే కట్టడాల ఆపదనుంచీకూడా ఏం ప్రమాదం ఉండదు.— గుహల్లో పెట్టిన ఉక్కుస్తంభాలు ఎంతబరువు మీదపడ్డా ఆపగలిగే శక్తిగలవి. — భూమిక్రింద కట్టిన పెద్దహాలులు — పైభాగంమీద కాంక్రీటుతో రెండు పొరలతో కప్పబడివుండడంవల్ల పైనబడ్డ బాంబు పైపొరమీదనే పగిలిపోయి లోపలనున్నవాళ్ల కడుపులో చల్లనైనా కదపలేదు.

ఈసూత్రాన్ననుసరించే సిగ్ ఫ్రీడ్ లైను (జర్మను పరిహద్దు) పొడుగునా భూమిక్రింద కాంక్రీటు కందకాలు కట్టారు. అయితే అందులో ఉండవలసింది సిపాయీలుకనుక అవసరమైతే యుద్ధము చేయాలి గనుకనూ అక్కడక్కడ బాంబులు పడ్డా సరే పడిపోని బురుజులు కట్టారు. ఒక్కొక్క బురుజులో రెండువేలమంది సైనికులు ఉండడానికి, మరతుపాకులూ మామూలు తుపాకులూ అందులో ఉండి ఉపయోగించుకునేలాగునకూడా అక్కడక్కడ చిన్నచిన్న కిటికీలు పెట్టి.

అయితే ఇంత కట్టుబాటూ బాంబులకే; ఇక భూమిమీదనుంచి టాంకులు రాకుండాను, ఏటవాలుగా భూమిలోంచి ౭, ౮ అడుగులు పైకికూడా మొలిచిన

ట్టుండేలాగు దువ్వెనపళ్లలాంటి సిమెంటు స్తంభాలు. సిపాయీలు రాకుండా వాటికి ముండ్లతీగె అల్లడము— ఇలాంటి వరుసలు ఎన్నో.

అందుచేతనే ఈ సరిహద్దుప్రాంతాలు చాలా దుర్భేద్యంగా ఉన్నాయి — బాగా అభివృద్ధిపొందిన ఈరోజుల యుద్ధపరికరాలకికూడా.

భూమిమీదనుంచి దుర్భేద్యమయిన ఈస్థలాల్ని వశపరచుకోడానికే విమానాలమీంచి యుద్ధం ఆరంభమయింది. పెద్దయుద్ధాలన్నిటిలోనూ ఈవిమాన యుద్ధము చాలా ముఖ్యమయిన భాగం అయిపోయింది. రాను రాను అన్నివిధాల ఆక్రమణానికీ, శత్రుసేనలని చెల్లాచెదరుచేయడానికీ, సులభంగా నిర్మూలించడానికీ విమానాలే ఉపయోగపరుస్తున్నారు. కాల్బలము ముందుకు నడిచి శత్రుస్థానాన్ని ఆక్రమించుకోవడానికి దారితీసేవి విమానాలు. మొదట్లో పైనించి ఫోటోలు తీసి శత్రుసైన్యముయొక్క బలమైన భాగాలు, రక్షణలేని భాగాలు కనిపెట్టడందగ్గిరనుంచి — వారి పెద్ద తుపాకు లున్నప్రదేశాలమీద, మరతుపాకు లున్న స్థలాలమీద బాంబులు వేసి వాటిని నిరుపయోగంగా చేయడం, ముండ్లతీగెలని నిర్మూలము చేయడం, కందకాల్లో రోజుల తరబడి యుద్ధంచేస్తూన్న సేనలకి తిను బండారాలు, సహాయానికి క్రొత్తసేనలూ తీసుకొచ్చే మోటారు లారీలని ధ్వంసం చేసి యుద్ధం చేస్తూన్న సేనలని నిస్సహాయంగా చేయడం — ఇలాగే అనేకవిషయాలకి విమానాల ఉపయోగం.

అయితే ఈ విమానాలరాకతో భూమిమీద జరిగే యుద్ధంలో — ఈటిప్రమాదాన్ని తప్పించుకునే పన్నాగాలు బయలుదేరినయి. విమానాలు పైకెగిరి పగలైతేనేగాని భూమిమీద ఏం జరుగుతోందో చూడలేవుగదా. — అంచేత రెండుపక్షాలవారూకూడా, ముఖ్యంగా సైన్యాలు తీసుకురావడం, చెడిపోయిన తీగెలబారులు మరమ్మతు చేసుకోవడం, ముందరికి వెళ్లి శత్రుసైన్యంతో తలపడడం లాంటి అన్నిపనులు రాత్రిళ్లే చేసుకోవడం మొదలెట్టారు. — దానికితోడు రాత్రిళ్లే విడివిడిగా సైనికులు శత్రుసైన్యం దగ్గిరకి వెళ్లి వాళ్ల రాకపోకలు కట్టుదిట్టాలు అన్ని ఏయేొత్తయిన ప్రదేశంమీంచో చూసి తమసైన్యాధిపతికి తెలియ చేయడం కూడాను.

వీటికి ప్రతిగా విమానాలు గాలిలో కెగిరి రాత్రయినాసరే చూడ్డానికి వీలయేలాగ గొప్పకాంతి ఇచ్చే మతాబులు ఆకాశంలో వెలిగించి ఆవెల్తురులో క్రింద ఏం జరిగేదీ చూసి అవసరమయితే నాలుగు బాంబులు వదిలి అన్నిప్రయత్నాలు ఆటంకపరచటం ఆరంభించాయి నిమిషాలకొద్దీ వెలిగే ఈమతాబుల కాంతిలో ఏమాత్రం కదలిక కనపడ్డా, ఏగూఢచారిగాని తీగెలు మరమ్మతుచేస్తూన్న పనివాళ్లుగాని ఏకొంచెం కదిలినట్లు కనపించినా గురిపెట్టబడ్డ శత్రువుల మరతుపాకులు ఆప్రదేశములో ఏ మున్నాటే దాన్ని జల్లెడమాదిరిగా చేసేస్తాయి. అంచేత మతాబు వెలిగేటప్పటికి ఎక్కడివా రక్కడ ఉన్నవాళ్లున్నట్లు ఊరకుంటారు.

అసలు ఈకష్టమే తప్పించుకునేలాగు శత్రువుల విమానాలశబ్దం వినిపించేసరికి వాటిమీద గురిపెట్టి ఎడతెరపిలేకుండా నిమిషానికి ౩౦౦ గుండ్లు కురిపించి, ఏగుండు తగిలినా నిప్పంటుకునే లాగచేసి, విమానాలని నేలకూలడం మొదలుపెట్టారు.— అంతేకాక శత్రువిమానాలని క్రిందకి దింపడానికి- ఇవతలపక్షములోంచి కూడా విమానాలు ఎగిరి వాటిమీద బాంబులు, మరతుపాకి గుండ్లు వర్షించడం మొదలుపెట్టాయి. అంతతో ఆకాశములో విమానయుద్ధము ఒకవిధి అయిపోయింది, ప్రతి పెద్దయుద్ధములోనూ.

ఏవో రెండు రాజ్యాలకి సంఘటిల్లిన యుద్ధము ఆరాజ్యాల సరిహద్దుప్రాంతాల్లోనూ, ఇంకా విస్తరించి ఆ రాజ్యాల యావత్తువిస్తీర్ణములోనూమాత్రమే కాక అన్నిరాజ్యాలకి సంబంధించిన ఆకాశపథములో పడేటప్పటికి చాలా తీవ్రమయిన మార్పులు వచ్చాయి— యుద్ధముయొక్క సైనికప్రపోకడలోనూ, యుద్ధంతో ఇంతవరకూ సంబంధంలేని ఇతరదేశాలకు కలిగే ఇబ్బందుల్లోనూ కూడాను. అంతేకాక వాయువిమానదళాలు ప్రబలినకొద్దీ యుద్ధముయొక్క పంథికే మారిపోయింది — ముఖ్యంగా ఒకపరిసరప్రాంతానికిగాని — పట్టుకోదలచిన ప్రదేశానికిగాని పరిమితి లేకుండా

పీలున్న ప్రదేశం అంతట్లోనూ ఎవతెగని యుద్ధపు ఆంకోశవతో నింపివేయటంవల్ల.

విమానయుద్ధంలో మొదటి ఉపద్రవము బాంబులు వర్షించటం - సాధారణపు బాంబులు ఏవో కొద్దిమందిని చంపి, కొంతమందిని గాయపరచి అంత ఎక్కువనష్టం చేయవు. కాని ఆబాంబులే నేలమీద యుద్ధం చేస్తూన్న సేనలమీదగాక, పట్టణాల్లోనూ, ఫాక్టరీలలోనూ, పడటం ఆరంభిస్తే దేశానికి అపరిమిత నష్టం — యుద్ధంచేస్తున్న సేనలకి బాంబులు పడవచ్చునని తెలుసు - విమానముదగ్గిరకి వచ్చే చప్పుడు, బాంబు పడేటప్పుడు గాలిలో ఈలవేసినట్లు అరిచేశబ్దము, బాంబు పడగానే - ఏకో పల్లములో పడుక్కుంటే ఎగిరే ఉక్కుతునకలు తగులవన్న మాత్రము — ఇవన్నీ సైనికులకి నిత్యకృత్యాలు. కాని ఏమీ తెలియని సంరక్షించుకోలేని ప్రజలమీద గాని, కట్టడాలమీద గాని పడ్డప్పుడు. అవితమైన జననష్టం — ద్రవ్యనష్టమూను.

ఇక పీటికితోడు విమానయుద్ధములో వింత వింత పద్ధతులుకూడా అవలంబిస్తే కేవలము నష్టముచేసే ఉద్దేశ్యముతోనే, — చివరకి ఏ దేశములోనైనా సరే ఒక్క ప్రాణి మిగులకుండా చేసేయవచ్చు. — అటువంటి విధానాలే కొన్ని క్రొత్తరకపు బాంబులు — విప్పటించేవి ఒకరకం, పడ్డచోటనుంచి కొన్ని వందలగజాల చుట్టు ప్రక్కలవరకు విషవాయువుతో గాలిని నింపేసేవి ఒకరకం — విషక్రిములతో నింపేవి ఒకరకం - ఇలాగే.

అసలు సాధారణపు బాంబులు వేయటానికే అనేక రకాల విమానాలున్నాయి-కొన్నివందల టన్నుల బాంబులతో చాలాదూరము వెళ్లి దేశమంతా వర్షించే వాటిదగ్గిరనుంచి — ఏకో ఒకవంద బాంబులతో బయలుదేరి కావలసినచోట అవన్నీ కుప్పించి క్రింద నున్న ప్రదేశమంతా చెరువు త్రవ్వినంతపనిచేసే వాయువిమానాలవరకూ. పీటికితోడు ఈ విషవాయు ప్రయోగముకూడా చేరిస్తే కేవలము కల్క్యవతారమన్నమాటే.

మొట్టమొదట్లో కాల్బలాలు యుద్ధం చేయటంలోనే విషవాయువు ప్రయోగించటం మొదలుపెట్టారు. అయితే అప్పుడు గాలివాటము చూసుకుని శత్రుసేనవైపు గాలి వీస్తూన్న సమయం చూసి పెద్ద పెద్ద ఉక్కుసిలిండర్లలోంచి గొట్టాలు పెట్టి విరోధిసేనలవైపు ఈవాయువు వదిలివేయటం —

దానికి తట్టుకునేలాగున వెంటనే కనిపెట్టారు- టోపీలు. —విషవాయువులోంచి మంచిగాలిని లోపలకి ప్రవేశపెట్టి ప్రాణభయం లేకుండా ఉండేలాగున చేసేటట్లు.

ఇప్పటికే ఈటోపీలయొక్క అతినూతనపు రకాలకే యుద్ధమునుంచి భయపడే ప్రతిదేశములోనూ ప్రతి మనిషికీ ప్రభుత్వము పంచిపెటుతున్నారు.

ప్రతిదేశములోనూకూడా ఈ విషవాయురక్షణ టోపీలు, ఏంబులన్సు(Ambulance)దళాలూ, రాత్రులు దీపాలు లేకుండా చేయటం, విమానదాడి వచ్చినప్పుడు దాక్కోడానికి వీలయిన స్థలాలు ఏర్పరచటముమాత్రమే. కాక, అసలు విమానయుద్ధము సాధ్యమయినంతవరకూ ఆపడానికి చేసిన ప్రయత్నాలుకూడా ఉన్నాయి.

వాటిల్లో మొట్టమొదటిది ఏదేశముమీదికి శత్రువిమానాలు వస్తయో ఆదేశపు విమానాలుకూడా గాలిలోకి ఎగిరి శత్రువిమానాలని మరతుపాకులతో ఛేదించటం!*

రెండవది — భూమిమీదనే అక్కడక్కడ మంచి ఆయువుపట్లులాంటి ప్రదేశాల్లో విమానాలని బాగా గురిచూసి ఒకటి రెండునిమిషాల్లో ౧౦౦౦, ౧౫౦౦ గుండ్లని కాలుస్తూ విమానము ఏవేపు కదిలితే ఆవేపు తిరిగే మరతుపాకులతో బందోబస్తు చేయటము.

* అయితే రెండువేపుల విమానాలు వేగంగా ఎగురుతూండడంవల్ల గురి అందకపోవచ్చు, స్వదేశవిమానమే శత్రువిమానపుమరతుపాకినుంచి దెబ్బ తినవచ్చు. అంచేత ఇది ఒకమార్గమూ, అంత నిశ్చయంగా శత్రువులని నిశేష్టుం దనడానికి వీలు లేదు.

అయితే ఈతుపాకులు పనిచేయటానికి విమానము వినిపించాలి, కనిపించాలి; అంచేత 'ఏంటి-ఎయిర్ క్రాఫ్టు' (Anti-aircraft - విమానాల్ని కేటాడే యంత్రాల్ని) తప్పించుకోవడానికి రాత్రిళ్లు రావడమూ, శబ్దము ఏమాత్రమూ వినిపించకుండేంత ఎత్తున ఎగరడం ఆరంభించాయి శత్రువిమానాలు.

అదికూడా కనిపెట్టడానికి శబ్దగ్రహణయంత్రాల్ని (Sound detectors), దూరము తెలియజేసే యంత్రాల్ని కనిపెట్టి జోడించారు ఈమరతుపాకులకి. ఈమరతుపాకులు ప్రతిసరిహద్దుదగ్గిరా, ముఖ్యమైన కట్టడాలమీదా ప్రతిపెద్దనావలలోనూ వెలిశాయి-విమానపుదాడులవల్ల వినాశనమవకుండా ప్రజలనూ పట్టణాలనూ తప్పించడానికి.

మొదటమొదట్లో విమానాలు ఎంత ఎత్తున ఎగిరినా — బాంబులు వేయటంగాని, అసలు భూప్రదేశము చూడటంగాని అవసరమైనప్పుడు కొంత ఎత్తు దిగాలిసిఉంటుంది. గద్ద పకోడీలు తిన్నకుపోయినట్లు విమానం ఏదో ఎత్తునుంచి చటుక్కున దిగువకు మెరుపులాగ వాలి కొంచెం భూమిమీద ఏప్రదేశము ఏదో విచక్షత తెలియగానే కావలసినచోట పడేలాగున ఒక బాంబు వదిలి మళ్లా పైకి దూసుకు పోవడం — మరతుపాకులు సరిచూసుకునేలోపుగా — ఈతెలివి శేటులకి ఒకమందు కనిపెట్టారు.

అదేమిటంటే, ఏదో ఒక ఎత్తున ఎగిరేలాగున తాళ్లు కట్టి పెద్దపెద్ద గాలిసమ్మటాలు ఎగరవేయటం; — వాటికి మళ్లా ఒకదానికి మరొకదానికి తాళ్లు అల్లి ఒకకంచె తయారుచేయడం — ఈ కంచె తప్పించుకోడానికి క్రిందికి ఎగిరితే మరతుపాకుల మహత్తు తెలిసికోనేలాగునా, పైకి వెడితే, కాపలా కాస్తున్న స్వదేశీయ విమానాల చూపులో పడేలాగునా. ఈగాలిసమ్మటపుకంచెలు ముఖ్యమయిన ప్రదేశాల్లో అంతటా కావలసిన ఎత్తున కట్టేసి ఉంచారు.

అయితే విమానాలు నష్టం చేయడలచుకుంటే అంతేమిటి?

ఓడలమీద బాంబులు వేయడం ఆరంభమయింది.

అయితే సముద్రమధ్యంలోకి చక్కాపోయే ఓడల్ని బాంబులు వేసి నుంచి మళ్లా తిరిగిరవడానికి విమానానికి కావలసినంత పెట్రోలు కావాలి, నేలమీదనుంచి ఎగిరి నేలమీద వాలవలసి వచ్చేటట్లయితే. ఈపనికి సులువుగా ఉండటానికి — తీరానికి దగ్గిరగా ఉన్న రేవుపట్టణాలని ధ్వంసంచేయడానికి — 'సీ ప్లేన్స్' (Sea planes) నీళ్లమీదనుంచే ఎగురగలిగే విమానాలు ఉపయోగంలోకి వచ్చినయి. ఇక వీటిని పెద్దపెద్ద సంఖ్యలలో అక్కడికీ ఇక్కడికీ చేరవేయటానికి విమానాలు తీసుకువెళ్లేటందుకే ప్రత్యేకముగా ఏర్పడ్డ ఓడలు — భూమిమీదనుంచి ఎగిరినట్లే ఓడ



౨. ఓడమీదనుండి వదలిపెట్టబడిన 'సీ ప్లేన్'

మీదనుంచే ఎగరడానికి వీలయేటట్లు కట్టబడిన చదును ప్రదేశంగల ఓడలు.

ఉంటారు. అందరికీ కావలసిన ప్రాణవాయువు ఓ లోనే భద్రపరచబడిఉంటుంది. ఎటొచ్చీ దీనికి ఇం



3. వాయుసంచారముచేసి తిరిగి ఓడమీదకి వస్తూఉన్న 'సీ ప్లేన్'

అయితే ప్రతిరక్షపుఓడమీదాకూడా వరుసగా తుపాకులుండటంవల్ల ఓడల్ని ముంచటం అంత సులభంగా కనిపించలేదు — పోత్తిగా కళ్లముందరే తిరుగవలసివచ్చిన విమానాలకి. అయినా శత్రువుల వ్యాపారపడవలి, వస్తువుల అందుబాటు, సేనలు, రాకపోకలు అన్నింటికీ అభ్యంతరము కల్గించటానికి ఈఓడలని ముంచివేయటం ఒకముఖ్యమైనపని అయింది. ఈ ఒక్కపని నేరవేర్చటానికే మొదట మొదట్లో సబ్ మెరైన్స్ — ప్రవేశించినయి యుద్ధసాధనాలలో ఒక భాగముగా.

ఇవి కేవలమూ నీటిలోనే సంచరిస్తూ ఎన్నిగంటల కాలమయినా ఉండగలవు. ఒకఅడుగు ఎత్తుగల చిన్న ఉక్కుగొట్టముమాత్రము నీళ్లపైకి ఉంటుంది. దానికి చివర ఒకగాజుయంత్రము. దీనివల్ల సబ్ మెరైన్ లో ఉన్నవాళ్లకి సముద్రంమీద జరిగే అన్ని సంగతులు తెలుస్తాయి — ఏ ఓడ ఎటు వెళుతున్నదీ, ఎంత దూరములో నున్నదీ, ఏదేశపుదై నదీ — యావత్తూ.

సైజులనుబట్టి ఈసబ్ మెరైన్లలో ౨, 3 వందల మంది పనివాళ్లదగ్గరనుంచి అంతకెక్కువమంది వరకూ

అదనంగా ఉంటే విశేషము టార్పెడోలు వేసే య త్రాలు.

టార్పెడోలు ఒకఉక్కుగొట్టముద్వారా అణి పెట్టబడిన గాలిబలాలకంగా ప్రయోగిస్తారు. మనిషి తుపాకిగుండ్లెలాటివో ఓడలకీ ఈటార్పెడో లలాటి ఈటార్పెడోలని, లోతుయంత్రాలు అన్నీ సరిచేసి — గురిమూసి వదలినతరువాత అవి తిన్నగా పోయి నీళ్ల మునిగిఉన్న ఓడయొక్క భాగంలో ప్రవేశించి వెంట ఒకపెద్దబాంబులాగ పేలి - ఓడకి అక్కడ ఒకకన్న పెడ్తుంది. దాంతో ఎలాటి ఓడయినా రెండుమూ గంటలకంటె ఎక్కువకాలం తీసుకోకుండానే సునక నేస్తుంది.

అయితే ఈటార్పెడోలు నిరంతరంగా సము మధ్యంలో ఉండలేవు. అంచేత అప్పుడప్పుడు ఏఓ కనుమాపుమేర లేకుండా చూసి పైకి తేల్తుంటాయ పనివాళ్లు కొత్త గాలి పీల్తరు చూడడానికీ పీల తోకటానికీ, ఉన్న ప్రదేశమేదో బాగా నిర్ధారణ చూసుకోవడానికీ. ఇలాంటిసమయాల్లో ఏ శత్రువిమ

యినా చూసిందంటే ఊరికే బాంబులు గుప్పించేసి శవిధ్వాన్న దానిని వదలిపెట్టరు.

యుద్ధం ఇలా సముద్రముమీదికి వ్యాపించిన తరు ాత క్రమేణా ఈ సబ్ మెరైన్స్‌కంటె వేగముగా ళ్లే 'యు' బోటు లొచ్చాయి. వీటికి రెండు దర్శనీ సం్రాలు- ఆకాశంలో కూడా చూడ్డానికి వీలయే ాగ విమానా లొస్తున్నదేమోనని ఈ 'యు'బోట్లు దివరకి సబ్ మెరైనులలాగే పనిచేసినా, వాటికంటె ాలావరసిగా, చాలా ఎక్కువ టార్పెడోలు తీసికెడు ా ఉంటాయి.

ఇట్టి రతుణవోడలకే డిస్ట్రాయర్లు (Destroyers) అని పేరెట్టారు. ఇవి అంతులేనంత మంచునుండు హామూ నుతో బయలుదేరి- టార్పెడోలు వదలడానికీ, టార్పె డోలే తనలుకొనేలాగ గనలు లోతుగా వేయడానికీ, విమానాలతో యుద్ధం చేయడానికీ, మరీ పైన తేలుతూ న్న గనులు తీసివేసి ఏదేనా సముద్రమార్గము నిరపాయం గా చేయడానికిని.

ఈ గనులు- ఒకలోతున ఉండేలాగా అమర్చ బడి, ఒక ప్రదేశములో ఉండేలాగా ఒక బరువుకి కట్ట బడి ఉంటయి. ఇలాటివే అనేకమయినగనలు త్రాళ్లతో



౪. వాయువిమానమునుంచి సముద్రములోకి వదలిపెట్టబడుతున్న 'టార్పెడో'

ఇంతేగాక సముద్రంలో అక్కడక్కడ గనులు (తేలే బాంబులు) వాటడంకూడా ఆరంభించారు. ఏదైనా ముఖ్యమయిన సముద్రమార్గం చూసి చల్లగా ఆ త్రోవ కు పదిమైళ్లు ఇటూ పదిమైళ్లు అటూ ఎవరికీ తెలియకుం డానే రాత్రిపూట నాలుగు 'యు' బోట్లు వచ్చి ఒక ౨౦౦ గనులు వాటేసి చటుక్కున తప్పుకుంటూవుంటా యి. ఏవోడ ఏ ప్రక్కనుంచి వచ్చి ఏఒకగనిని తాకినా వెంటనే అది పేలి ఓడనంతనీ ముంచేస్తుంది. ఇది చాలా గొప్పప్రమాద మని తెలిసింది ప్రపంచయుద్ధంలో గనులు వేయడం ఆరంభమయినప్పుడే. అందుచేత వెంటనే ఈ ఆపద తప్పించటానికి పూనుకున్నారు.

ఒకదాని కొకటి కట్టికూడా ఉంచవచ్చు. డిస్ట్రాయర్లు చేసేపని-ఏదో ఒక లంకె కనిపెట్టి మిగిలినవాటి నన్ని టినీ పైకి లాగెయ్యడం; లేకపోతే బరువుకి కట్టి ఉన్న త్రాడు తెంపి గని పైకి లేచినప్పుడు దూరంగా ఉండి తుపాకులు గురిపెట్టి ఆ గని పేలిపోయేవరకూ కాల్చటం.

ఈ విధంగా కాక రెండు మూడు ఓడలు బయలు దేరి గనులున్నాయని అనుమానం వేసిన చోటల్లా వలలు వేసి వెతికి వాటిని లాగెయ్యడం. ఇలాటిపనుల్లో చాలా కట్టుదిట్టంగా ఉండకపోతే అపరిమితమయిన నష్టం సంభవిస్తుంది. ఈ పద్ధతులన్నీ పూర్తిగా అభివృద్ధి



౫. డిస్ట్రాయరు ఫిరంగిగుండ్లు వర్షించుట

పొందని ౧౯౧౪-౧౯౧౮ లోని యుద్ధ కాలంలో జర్మను 'యు' బోట్లు ౫,౮౦౦ ఓడల్ని ముంచేశాయి. వీటికి ప్రతిగా ౨౦౩ జర్మను సబ్ మెరైన్లని ముంచ గలిగారు శత్రువులు.

ఏరకపునావమైనా యుద్ధము చేయడానికి ఉద్దేశింపబడిన యుద్ధనౌకలు, క్రూయిజరులు మొదలుకొని చేపలు పట్టుకోడానికి పనికి వచ్చే సాధారణనావలవరకూ ఈ 'యు' బోటులకి ఆహుతి అవుతుండడంవల్ల వీటిని నిర్మూలము చేయటానికని డిస్ట్రాయర్లూ, కొన్ని వాయు విమానాలు (ఎంచేతంటే ఈ 'యు'బోట్లు నీళ్లలో వెళ్లేటప్పుడు వాటి యంత్రాలు నీళ్లలో వెళ్లుతూ, చిన్న నురుగు పుట్టించడంవల్ల - ఆకాశం మీంచి ఎక్కువ సులభంగా కనిపిస్తాయి అవి ఏ ప్రదేశములో ఉన్నాయో), దూరం పెద్దపెద్ద ఓడల్లో ౨౦ మైళ్లకూడా ప్రకాశించే దీపాలూ, వాటితో సమానశక్తిగల పెద్దపెద్ద ఫిరంగులూ అన్నీ హంగుచేశారు.

కాని ఎన్ని చేసినా అన్ని గండాలూ గడిచి 'యు' బోట్లు ఇంకా విచ్చలవిడిగా సముద్రాల్లో యమదూతల లాగా తిరుగుతూనే ఉన్నాయి. వీటిని బ్రిటిషునౌకలు తరిమి వేటాడుతున్నాయి.

అంచేతనే ప్రపంచయుద్ధ మనేటప్పటికి ఒకస్థలమూ ఒక సమయమూ లేకుండా భూమిమీద, నీళ్లమీద, నీళ్లలోనూ, ఆకాశంమీద, అంతరిక్షంలోనూ ఊరికే సమస్తాన్ని విధ్వంసం చేసే మరణశక్తి వ్యాపించివుంటోంది. ప్రతిరోజూ ఏదో ఒకఆపత్తు తప్పించుకునే మార్గమూ, ఆ మరుసటిరోజే ఆ రక్షణని ఛేదించే యంత్రమూ కని పెట్టడంలోనే మానవప్రయోజకత అంతా వినియోగ పడుతూంది.

ఈ అమానుషత్వము మూలాన్నే ఏ దేశాని కా దేశము యుద్ధము వద్దనీ, దాన్నుంచి తప్పించుకోవాలని చూస్తోంది.

# పుస్తకసమీక్ష

## రాజాబహద్దరు వేంకటరామారెడ్డి ఓ.బి.ఇ. జీవితచరిత్ర

రచయిత: శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారు. ప్రకాశకులు: బాలికల ఉన్నత పాఠశాలకమిటీ, నారాయణగూడెము, హైదరాబాదు దక్కన్. వెల మేలు ప్రతి రు ౦-౧౨-౮. సాదా ప్రతి రు ౦-౬-౦.

శ్రీ ప్రతాపరెడ్డిగారు ఆంధ్రభాషాయోషకు కానుకగా సమర్పించిన మరియొక నూతనాలంకరణ మిది. పేరుకు జీవితచరిత్రగాని నవలలాగు చదవడానికి చాలా ఇంపుగా వుంది. అవ్వల్ పోలీసు ఉద్యోగి చరిత్ర కావటంచేత ఒక్కొక్కయెడ డిటెక్టివ్ నవలాశోభలు కన్పిస్తుంటాయి. వీరికి పూర్వము దుండిన హైదరాబాదు కొత్వాలుల సమాచారంగల పట్టు చదువుతూవుంటే సాధారణంగా నవ్వున్నూ, ఒక్కొక్క కొత్వాలుగారి చర్య ఒక్కొక్క భావమున్నూ రేపుతూ ఉంటుంది. చిన్నతనంలోనే తల్లిదండ్రుల పోగొట్టుకొనినప్పటికీ, మధ్య ఆటంకాలు కలుగుతూ వున్నప్పటికీ రెడ్డిగారు ఈలాటి ఉన్నతపదవిని బొంది రాజును ప్రజలను సంతృప్తులుగా చేయగల్గుట వారి నిరంతర శ్రద్ధా తాత్పర్యాలతో పని చేయ బూనుకొన్న యెడల ఎంతటి గొప్ప జవాబు దారీగల పదవియందైనను జయము గాంచవచ్చునని స్పష్టమగును. మరియు ఆంగ్ల భాషాజ్ఞానము లేనిదీ బాధ్యతాపూర్ణమైన గొప్పపదవులకు అర్హులు కాజాలరను కొందరి భ్రాంతినికూడ వీరు నిర్మూలము గావించిరి. రాష్ట్రీయం దంతటనూ మంత్రిపదవి తర్వాతది పోలీసుపదవి. దానిని రెడ్డిగారు నిష్కళంకంగా రం వత్సరములకు పైగా నిర్వహించడమే కాకుండా జార్జి చక్రవర్తిగారిచేతనూ ఇద్దరు రాజప్రతినిధులచేతనూ సత్కారపూర్వకంగా మన్ననలనూ బిరుదులనూ పొందారు. దీర్ఘమైన వీరిపాలనకాలంలో హిందూముసల్మానుజగడాలు ఒక్కపర్యాయమైనా కలుగకుండటం ఆశ్చర్యమును గొలిపే విషయము. భారవంతమైన ఈ కొత్వాలుపదవికి తోడు రెడ్డిగారు రాజకీయములైన సాంఘికములైన మరి ముప్పదిసంస్థలకు అధ్యక్షులై తమపరిపాలనపాటవమును బూర్తిగ వెల్లడించిరి. హైదరాబాదులోని రెడ్డిహాస్టలున్నూ, బాలికల ఉన్నతపాఠశాలయు వీరి కీర్తిప్రతిష్ఠలను ఆచంద్రతారార్కముగ చాటగలవు. ఈ గ్రంథమును విక్రయించుటవలన వచ్చు ద్రవ్యమంతయు ఉపర్యుక్త బాలికాపాఠశాలకు ఇవ్వబడునుగాన దీనిని కొని చదువువారందరూ కేవలము గ్రంథపఠన లాభము నేగాక పాఠశాలానిర్వహణానికి ఆర్థికంగా తోడ్పడినవారును అగుదురు. చిట్టచివర అనుబంధంలో శ్రీ రామిరెడ్డిగారికి వచ్చిన స్వాగతాలూ సన్మానాలు మొదలైన వానిసమాచారం వుంది. ఆంధ్రు లందరికీ అవశ్యం పఠనీయగ్రంథ మిది.

'సం'

---

# పత్రికా స్వీకారము

---

**చిత్రకళ**—శ్రీ పసుమర్తి యజ్ఞనారాయణ శాస్త్రిగారి యాజమాన్యంగల సినీటోన్ ఇన్‌ఫర్‌మేషన్ బ్యూరో తరఫున కే. నరసింహారావుగారి సంపాదకత్వంలో క్రొత్తగా ఆంధ్రదేశ రంగంలోకి దిగిన మరో పత్రికారాజం. సినిమా కళాభివృద్ధినిమిత్తం వెలువడి వెలువడుతున్న పక్షప్రదర్శకము లనదగిన పత్రికలలో నిదియు నొకటి. ఆంధ్రదేశపు సినిమాయుద్యమాని కిది ఎంతయు తోడ్పడగలదని విశ్వాసము కలుగుతున్నది. ఈ తరుణంలో ఇటువంటి పత్రికలు మిక్కిలి యావసరము, ఏకారణంచేతనైన నేమి. నటీనటులను, సినిమా కార్యకర్తలను, భట్రాజుల్లాగు పొగడటంకాక అట్టివారి కందరికీ అవశ్యం పరిగ్రహణయోగ్యాలయిన ఉపదేశాలు, సూచనలు, సలహాలిందు ఒసంగబడియున్నవి. ఒక్కొ

క్క విధమైన డైరెక్టరునూ ఎత్తుకొని ఆతనికేలాటి యోగత్యలూ, లక్షణాలూ ఉండవలెనో నిరూపిస్తూ అందులకు వ్యతిరేకమార్గాలను అవలంబించి పోతూవుండటంవల్లనే కొన్ని సినీమాలు పైకి రాలేకపోవడం, వచ్చినా కొన్ని నష్టపడి లోపించి పోవడం గలుగుతూవున్నదని సోదాహరణంగా రూపింపబడింది కొన్ని వ్యాసాల్లో. అదే ప్రకారం సినీమా నాటకాలకు తగినలాగున వ్రాయగల కవులయోగ్యతాయోగ్యతలగురించీ పాత్రధారులగురించీ వ్రాయబడిన లేఖలునూ కలవు. ఈవ్యాసాలూ, లేఖలూ వ్రాసినవారు స్వదేశీయులే గాక అనుభవజ్ఞులయిన విదేశీయలేఖకులునూ కలరు. ఇంతవరకూ ఆంధ్రసినీమారంగంలో ప్రసిద్ధికి వచ్చిన నటీనటకులయొక్కయూ, ప్రఖ్యాత తారలయొక్కయూ రంగురంగుల చిత్రపటాలతో అలంకృతమై అనేక తేజోరాశులతో నిండి దేదీప్యమానంగా వెలిగే తారాపథంలాగు ఈ చిత్రకళపత్రిక మనోమోదం గొల్పుతూవుంది. సామాన్యచదువరులమాట సరే, సినీమావృత్తిలోకి దిగాలని అభిలషించేవారి కందరికీ ఇది అవశ్యం పఠనీయం.

సంవత్సరం చందా రు 3-0-0 లు, విడి ప్రతి ౧ కి రు 0-8-0 లు. నెం. ౧౦౮, మాబ్రేస్ రోడ్డు, మైలాపూరు, మద్రాసు.

**జ్ఞానప్రియ**—శ్రీతత్వానందస్వాములవారి సంపాదకత్వంతో క్రొత్తగా బయలుదేరిన యీ మాసపత్రికయొక్క మొదటి సంపుటపు మొదటి సంచిక ఆగష్టునెలది మాకు అందింది. ఇప్పటి పరిస్థితులకు అనుకూలంగా ప్రాచీన భారతీయ

జ్ఞానత్యానికి తోడ్పడిన సకల విధానాలనూ పరివర్తనంచేసి దేశమును ఉన్నతిలోనికి గొనిరావలెనని యీ పత్రిక ఆశయము. అందులకు అనుగుణంగా వున్నాయి ఇందులోని రచనలన్నీ. స్వల్పపరివారంలో దీపంలాగు వెలువడిన యీ పత్రిక క్రమంగా పెద్దవెలుగై దేశాన్నంతనూ ప్రకాశింపజేయుగాక.

మేనేజరు: జ్ఞానప్రియ పత్రిక ఆఫీసు, కొల్లూరు, గుంటూరుజిల్లా యనిగాని, ఎడిటర్ జ్ఞానప్రియ, గూడపల్లి, నడింపల్లిపోస్టు, (Via) తెనాలి యనిగాని వ్రాసిన పత్రిక దొరకును. సంవత్సరం చందా రు ౨-౦-౦. విడి సంచిక రు ౦-౩-౦.

**ఆంధ్ర గ్రంథాలయం**—ఆంధ్ర, ఆంగ్ల భాషాత్రైమాసికపత్రిక. సంపాదకులు ప్రొ. రాజశేఖరం గారు, బ్రాడీపేట-గుంటూరు. సంవత్సరం చందా నాలుగు రూపాయలు. ఆంధ్రగ్రంథాలయ సంఘముతరఫున వెలువడు పత్రికయగుటచే ఆసంఘ సభ్యులకు సంవత్సరంచందా రెండురూపాయలు మాత్రమే. ఇది గ్రంథాలయ సర్వస్వముయొక్క మరియొక రూపం. ఆపత్రిక కొన్నినిర్దిష్ట ఉద్దేశములతో పనిచేసి తనవారి ఆదరణసహాయములు గాంచక యలసి విశ్రమింపగా ఈ రూపంగానైనా స్వదేశీయుల ఆదరానురాగాలకు పాత్రమగుదునను ఆశతో రెండుభాషలతో వెల్వడింది. గ్రంథాలయోద్యమము, ప్రచారము, విజ్ఞానవ్యాప్తి ఇత్యాది విషయాలను గురించి అనుభవజ్ఞులగు వారు వ్రాసినవ్యాసాలు రెండు భాషల్లోనూ వున్నాయి. అమెరికా మొదలగు విదేశాలలో నీవిభాగ మెంతటి అభివృద్ధి గాంచినదీ దీనిచదువు వారలకు తేటతెల్ల మగును. మరియు విదేశ గ్రంథాలయముల విషయావగాహనంచేత మన దేశమందలి గ్రంథాలయములకును, వాని కార్యనిర్వాహకులకునూ అమితమగు సహాయము లభింపగలదు. ఆంధ్రులు దీనినైనా అనుమోదించి, ఆదరానురాగాలను చూపి తమ పూర్వాపరాధాన్ని ఎంతవరకు మాపుకొంటారో చూడాలి.

## గ్రంథస్వీకారం

**సింగయార్య రచిత జాతక రాజము**—ఆంధ్ర వ్యాఖ్యాతలు: శ్రీధర వెంకయ్య సిద్ధాంతిగారు, శ్రీధర విశ్వనాథశాస్త్రిగారు. తెనాలి దైవజ్ఞ గ్రంథమండలివారిచే ప్రకటింపబడినది. వెల రు. ౦-౨-౦.

**౧౯౩౯-వ సంవత్సరపు మద్రాసు సాధారణ విక్రయ:పుల పన్ను అక్టు**—రచయిత: శ్రీ మల్లెల సీతారామశాస్త్రిగారు, బి. ఏ., యల్. యల్. బి. మచిలీపట్నం, వెల రు. ౦-౮-౦.

**శాంతి సమరము**— కర్త: మల్లాది చంద్రశేఖర రావుగారు, బెజవాడ. (సౌభాగ్య ప్రెస్సులో ముద్రితము.) వెల రు. ౦-౨-౦.

**రాష్ట్రిగానము**— కర్త: తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు, బాపట్ల. (బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ప్రెస్సులో ముద్రితము.) వెల రు. ౦-౨-౦.

**ఆర్యవాణి**—రచయిత: వైద్యవిద్వాన్ నారు నాగనార్యగారు, కోడూరు. మద్రాసు వావిళ్లవారి ప్రెస్సులో ముద్రితము. వెల రు ౦-౬-౦.

**హారతి, పితృభక్తి**—ఈ రెండు చిన్న గ్రంథములను రచించినవారు దువ్వూరు సూర్యనారాయణమూర్తిగారు.

**వైద్యవిప్లవం**—రచయిత: డా. అడుసుమిల్లి వేంకటకృష్ణారావుగారు ఎల్. ఐ. ఎం. డి ఆరోగ్యవర్ధనీసమాజంవారిచే ప్రకటితం. చంద్రాల, అంగలూరు పోస్టు. వెల ౦-౮-౦.

**నాగురుదేవుడు**—కర్త: వివేకానంద స్వామిగారు. జ్యోతిప్రసూనములలోని ప్రథమ గ్రంథము. శ్రీ రామకృష్ణ సేవాసమితి వారిచే ప్రకటితము. వెల రు ౦-౧-౦. రామకృష్ణ సేవాసమితి, అగ్రహారం, ఏలూరు.

**పాంచజన్యం**—అనువాదకుడు. "చక్రపాణి". నవశక్తికార్యాలయం, బెజవాడ. వెల రు ౦-౬-౯.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty St., Madras. Editor:— S. Sambhu Prasad.